Th Largest
culated
elu Monthly

# చతుర

నవంబర్ 1993
*
రూ.5/-



ఓల్గా
గులాబీలు

పొట్టు తీసే పనిలేదు.  ముక్కలు తరగక్కర్లేదు. 

 శుభ్రం చేసే శ్రమలేదు.  నూరుకునే భారంలేదు.

ఒక్క క్షణం కూడా వృథాకాదు!

# ఏ వేళనైనా - ఏ వంటకానికైనా 
# మీకోసం సంసిద్ధం.

# స్వచ్ఛమైన - శుద్ధమైన
# ప్రియ అల్లం వెల్లుల్లి

# మిశ్రమం.




తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘుమ ఘుమలకోసం
'ప్రియ' అల్లం వెల్లుల్లి మిశ్రమం.

ఏవిధ కృత్రిమ పదార్థాలు మచ్చుకైనా లేవు. నూటికి నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగా తయారైన సహజ మిశ్రమం.




యా ఎంటర్‌ప్రైజస్ లిమిటెడ్,
ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు - 500 482

Sista's-UEL-609/93 TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

నవంబర్ చతుర నవల గులాబీలు

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

# చతురకథలు

## ఘనత

పొద్దుటే న్యూస్ పేపరు విప్పేసరికల్లా అన్నీ ఒకేతరహా వార్తల శీర్షికలు. 'బస్ దోపిడి'.

'ఎక్స్‌ప్రెస్ ట్రైన్ లూటీ'

'నగర సివార్లలో దొంగల స్వైరవిహారం

'పెద్దమొత్తంలో నగదు, బంగారం అపహరణ'

మొదటిపేజీనిండా దర్శనమిచ్చిన వార్తలివే. నా మనస్సు. వికలమైపోయింది. ఏమిటిది? అసలు పోలీసు డిపార్టుమెంటు అంటూ ఒకటుందా? ఉంటే వాళ్ళేం చేస్తున్నట్టు? సామాన్యుడికి భద్రత అన్నది ఏమైనా వుందా? రకరకాల ప్రశ్నలు పొద్దుటే నా మూడ్ అంతా ఖరాబుచేసిపారేశాయి.

బుర్ర వేడెక్కిపోయింది. సిగరెట్ కాల్చాలనిపించింది. జేబులు వెదుక్కున్నాను. లేవు! చెప్పుల్లో కాళ్ళు దూర్చి వీధి చివరనున్న పోలీసు బాబాయ్! బడ్డీవైపుకు నడిచాను.

పోలీసు వెంకటస్వామి ఉద్యోగ విరమణ తరువాత మా వీధి చివరన కిళ్ళీబడ్డీ పెట్టాడు. అందరితో చతురోక్తులతో సరస సంభాషణ చెయ్యడం అతని హాబీ. అంతా 'పోలీసు బాబాయ్' అని పిలుస్తారు.

పోలీసుబాబాయ్ అందించిన సిగరెట్టు పాకెట్ అందుకొని సిగరెట్టు అంటించి గట్టిగా రెండు దమ్ములు లాగి పొద్దుటే న్యూస్ పేపరులో నేను చూసిన వార్తాశీర్షికల గురించి చెప్పి ''అసలు మీ డిపార్టుమెంట్ ఉన్నది ఎందుకు బాబాయ్?'' అని ప్రశ్నించాను.



పోలీసు బాబాయి ముక్కున వేలేసుకొని, నాలిక అడ్డం కరచుకొని, గట్టిగా నవ్వేసి నన్నో అమాయకుణ్ణి చూసినట్టుగా చూశాడు. పోలీసు అలవాటుగా నా దగ్గరనుంచి ఓ సిగరెట్టు తీసుకొని అంటించి పొగ వదుల్తూ చెప్పాడు

''మా డిపార్టుమెంట్‌ని చాలా తక్కువగా అంచనా వేస్తున్నావు అబ్బాయి. దొంగల విషయంలో మాకు పేరుంది''

---

ముఖచిత్రం: జగ్‌మోహన్

"ఎలా...?"

"అమెరికాలో అయితే ఏదైనా దొంగతనం జరిగితే ఒకటి, రెండు గంటల్లో దొంగను పట్టేస్తారు అక్కడ పోలీసులు"

"అవును"

"అదే ఇంగ్లండులో అయితే పది పన్నెండు గంటల్లో దొంగతనం చేసింది కొత్త కేడీయా? లేక వృత్తి కేడీయా అన్నది తేల్చేసి గాలించిపట్టేస్తారు"

"నిజమే"

"జపాన్‌లో ఒకటి, రెండు రోజుల్లో దొంగని, దొంగ సొత్తుని కూడా కోర్టుముందుంచుతారు"

"నేనూ విన్నాను"

"యిక ఫ్రాన్స్‌లో అయితే వారం రోజులలో దొంగగాడి స్నేహితులు, వాడి తాలూకు ముండల భోగట్టాతోసహా వాడి జీవిత చరిత్రను పూర్తి నివేదికతో చట్టంముందుంచుతారు"

"అద్భుతం..."

"అదే మన ఇండియాలో అయితే ఎవరింట్లో ఎవరు దొంగతనం చేస్తారో, తద్వారా స్టేషన్‌లో స్టాఫ్‌కి ఎవరివాటాకు ఎంత ముడుతుందో పదిరోజుల ముందుగానే మన పోలీసులకు తెలిసిపోతుంది" అంటూ ముగించాడు పోలీసు బాబాయ్!

కళ్ళు తేలేసి, నోరు తెరిచి ఆశ్చర్యపోవడం నావంతయ్యింది"

-రతన్‌బాబు

## పచ్చినిజం

ఆ కాలనీ చిన్నా పెద్దా, ఆడా, మగా అంతా వెంకయ్య ఇంటిముందు గుమిగూడి, తెగ మెచ్చుకుంటున్నారు.

"అచ్చం ముర్రాజాతి. లేకపోతే యింత బలంగా, నల్లగా, కొమ్ములు వంకరగా చిన్నవిగా వుండవు" అన్నాడు పెంచలయ్య.

"ఔను! దూడ కూడా చాలా బాగుంది. గేదె ప్రస్తుతానికి ఓ పది పదిహేను లీటర్ల పాలు యివ్వొచ్చు" చెప్పాడు నాంచారయ్య.

"ఏమైతేనేం చక్కగా రోజూ పాలూ, పెరుగూ తాగొచ్చు" అన్నారు ఆడాళ్ళంతా మిసెస్ వెంకయ్య అండ్ సన్స్ అండ్ డాటర్స్ అదృష్టానికి అసూయపడుతూ.

"ఇంతకీ ఎంతక్కొన్నారు?" ప్రశ్నించాడు రామయ్య.

"ఐదొందలు" చెప్పాడు వెంకయ్య.



''ఐదొందలా?!'' ఆశ్చర్యంగా అడిగాడు పెంచలయ్య.

''ఔనండీ'' నమ్రతగా అన్నాడు వెంకయ్య.

''ఇలాంటిజాతి గేదెను ఐదొందలకెవడిచ్చాడబ్బా? ఇదేదో దొంగవ్యాపారంలా ఉందే!'' గట్టిగానే అనేశాడు అప్పారావు.

''దొంగతనంగా కాదు. దొరతనంగా కొన్న గేదే!'' గర్వంగా చెప్పాడు వెంకయ్య.

''ఐతే అమ్మినవాడు పిచ్చివాడు కాబోలు!?'' నవ్వుతూ అన్నాడు రామయ్య.

''వాడేం పిచ్చివాడు కాదు. మంచి ఆరోగ్యవంతుడే! చదువుకున్న తెలివైనవాడే!'' రెట్టించాడు వెంకయ్య.

''కనీసం పదివేలు చేసే ఈ ముర్రాజాతి గేదెను ఐదొందలకెలా కొన్నావ్? హాస్యమాడకు'' అన్నారింకొకరు.

''హాస్యంకాదు. నిజమే'' మళ్ళీ చెప్పాడు వెంకయ్య.

''నిజంగా ఐదొందలకు కొన్నావంటే నమ్మడానికి మేమేం వెర్రివాళ్ళంగాదు'' అదోలా ముఖంపెట్టి అన్నాడు ముత్తయ్య.

''మీరు నమ్మండి నమ్మకపోండి. దీన్ని ఐదొందలకు కొన్నమాట నిజమే'' అన్నాడు వెంకయ్య.

''ఎప్పుడు? ఎక్కడ?'' అన్నారు వాళ్ళు.

''దీని చిన్నప్పుడు! ఈ ఊళ్ళోనే!'' చెప్పాడు వెంకయ్య.

''ఆఁ...!'' అని నోరెళ్ళబెట్టారంతా.

-భైరి విశ్వనాథం

---

## అపశృతి

ఇద్దరు యువకులు యాదృచ్ఛికంగా కలుసుకున్నారు.



''హలో, మీ పేరు''

''రామం... మరి మీ పేరు?''

''శంకర్రావు... ఏం చేస్తున్నారు మీరు''

''డిగ్రీ చేస్తున్నా... ఎస్.వి.ఆర్ట్స్ కాలేజీలో, మరి మీరు?''

''నేనూ డిగ్రీనే, ఎస్ వి. ఆర్ట్స్ కాలేజే. మీరు నాకెక్కడా తగల్లేదు''

''సారీ, మీరూ నాకు తగల్లేదు''

ఇద్దరూ నవ్వుకున్నారు.



"ఇప్పుడు చెప్పండి. మీ హాబీలేమిటి?"

"స్టాంప్స్ కలెక్షన్, క్రికెట్, మ్యూజిక్, సినిమాలు చూడటం వగైరా వగైరా..."

"వాటే వండర్‌ఫుల్ టేస్ట్. నాక్కూడా సేమ్ ఇవే హాబీలు"

"నిజంగా?... అయితే మీ అభిమాన హీరో ఎవరు?"

"అమితాబ్. మరి మీకు?"

"నాకూ అమితాబే. మరీ ఇంత కో-ఇన్సిడెన్సా. మరి మీకు మ్యూజిక్ ఇష్టమన్నారుకదా! ఏవరి మ్యూజిక్‌ని ఎక్కువ లైక్‌చేస్తారు?"

"దిగ్రేట్ సమంతా ఫాక్స్. మరి మీకో?"

"అరె! నాకూ సమంతా ఫాక్సే. ఇదేమిటండీ! మరీ ఇంతగా కల్సిపోతున్నాయి మన అభిప్రాయాలు"

"అదే నాకూ అర్థంకావడంలేదు. పూర్వజన్మలో మనం మాంచి స్నేహితులమైవుంటామని నా అనుమానం"

"నిజమే ఖచ్చితంగా నేనూ అదే అందామనుకుంటున్నా!"

"పదండి. అలా టీ తాగుతూ మాట్లాడుకుందాం"

ఇద్దరూ టీ తాగారు.

"... ఆగండాగండి, బిల్ నే పే చేస్తా"

"మీరు భలేవారే, మీరు పే చెయ్యడమేంటి?... నే చేస్తా"

"నేనొప్పుకోను. మీరేమన్నా అనుకోండి, బిల్ మాత్రం నేనే పేచేస్తా!"

"అదేం కుదరదు. బిల్ నేనే ఇస్తా"

"మీకు మరీ ఇంత పట్టుదల వుండకూడదు. ఈసారికి నన్ను కట్టనివ్వండి"

"సారీ మీరు నన్నెంతగానో బాధపెట్టినవారవుతారు, బిల్ కట్టనివ్వకపోతే"

"మీరు మరీ మొండిగా ప్రవర్తిస్తున్నారు"

"మీరు కూడా"

"అలాగా! మూర్ఖులు ఎన్నటికీ నా స్నేహితులు కాలేరు సుమండీ!"

"ఖచ్చితంగా నాకూ గూడా అంతేనండీ"

"మంచిది ఇహ ఈ జీవితంలో నీ ముఖం నాకు చూపించకేం"

"ఓస్, దానిదేముంది నీ ముఖం నాకు కనిపించకుండా జాగ్రత్తపడితే సరి! నేనూ వస్తా!"

-ఎస్.మురళీధర్

---

## చిట్కా

పిల్లా పెద్దా అంతా కలిసి పెళ్ళివాళ్ళు పాతికమందయ్యేరు. రైల్వేస్టేషన్‌లో ప్లాట్‌ఫాంమీద వాళ్ల కోలాహలం అంతాయింతా కాదు. చాలాకాలానికి కలిసారేమో పెద్దల కబుర్లు ఎంతకీ తెమలడంలేదు.

పెళ్ళి పెద్ద నరసింహంగారికి మాత్రం గంగ వెర్రులెత్తుతోంది. పిల్లలు ఈ చివర్నుంచి ఆ చివరికి పరుగులుతీస్తూ ప్లాట్‌ఫారాన్ని ఓ ఆటస్థలంగా మార్చేసారు. రైలొచ్చేవేళకి ఎవరెక్కడ తప్పిపోతారో అని తెగ ఆదుర్దాపడిపోతున్నారు. పెద్దకొడుకు రవితోనహా ఆడపెళ్ళివారి ఊరికి తరలివెళ్తున్నారంతా. నాలుగు గంటల ప్రయాణం.

"పిల్లల్ని కాస్త చూసుకోండర్రా" అనీ, "సామాన్లు జాగ్రత్త" అనీ చెప్పీ చెప్పీ అవసోపాలు పడిపోతున్నారు నరసింహంగారు.

"అలాగే, అలాగే" అంటూనే చుట్టాలు మళ్ళీ ఎవరి ధోరణిలో వాళ్ళు పడిపోతున్నారు. కబుర్లే కబుర్లు.

నరసింహంగారి గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి.

చివరికి రైలొచ్చింది. చాలా రద్దీగానే ఉందది! ఎలాగయితేనేం సామాన్లతోపాటు అందర్నీ ఓ జనరల్ కంపార్ట్‌మెంటులోకి ఎక్కించేసరికి తలప్రాణం తోకకి వచ్చినట్లయింది నరసింహంగారికి.

రైలెక్కాక కూడా ఆయన ఆందోళన తగ్గలేదు. సామాన్లన్నీ చిందరవందరగా ఎక్కడపడితే అక్కడ పడేసి మళ్ళీ ఆడవాళ్లంతా





కబుర్లలో మునిగిపోయేరు. తమనీ, సామాన్లనీ భద్రంగా పెళ్ళికి తీసుకెళ్ళి తిరిగి తీసుకురావాల్సిన బాధ్యత నరసింహంగారిదే అన్నంత ధీమాగా ఉన్నారందరూ. మొగవాళ్ళేమో సిగరెట్లు వెలిగించి ఆ రద్దీలోనే పేకదస్తాలు కనుపించలేదు. నరసింహంగారు దిగులుపడిపోయేరు.

"సామాన్లు జాగ్రత్త... పిల్లలు జాగ్రత్త..." అని ఒకరినొకరు హెచ్చరించుకోవడం ప్రారంభించేరు. కబుర్లకి, పేకాటకి స్వస్తిచెప్పి ఆ



తీసేరు. ఆడవాళ్ళు నిల్చునీ, కూర్చునీ తరతరాల కబుర్లు చెప్పుకోవడంలో మునిగిపోయేరు. పిల్లలు కిటికీదగ్గర సీట్లకోసం తగువులాడుకుంటున్నారు.

అసలే జనరల్ కంపార్టుమెంటు. ఎక్కే జనం, దిగే జనం. ఏ సామాను ఎవడు పట్టుకుని దిగిపోతాడో అనేది అసలు భయం నరసింహంగారికి. కాని ఎంత హెచ్చరించినా వీళ్ళు పట్టించుకోవడం లేదు.

"అరే, నా కేష్‌బేగ్ కనిపించడం లేదు. ఎక్కడుందర్రా?" ఉన్నట్టుండి బిగ్గరగా అరిచేరు నరసింహంగారు.

ఆదుర్దాగా అందరూ పనులు ఆపి అతనివేపు చూసేరు అంతే... కబుర్లు ఆగిపోయేయి. ఆ వెంటనే తమతమ సామాన్లు పదిలంగా ఉన్నాయో లేదో చూసుకుని ఎక్కడెక్కడో పడేసిన సామాన్లన్నీ పదిలంగా ఓ చోట చేర్చారందరూ... కానీ ఆ కాష్‌బాగ్ మాత్రం ఎక్కడా జాగ్రత్తలో పడ్డారందరూ.

ఆ తర్వాత నరసింహంగారు పోయిందంటున్న బేగ్ గురించి వివరాలు అడగసాగేరు.

"పోయిందేదో పోయింది... మరీ పెద్ద మొత్తమేం లేదులెండి... ఏమయినా మళ్ళీ మనింటికి చేరేవరకూ అందరం జాగ్రత్తగా ఉండడం మంచిది" అన్నారు నరసింహంగారు.

"అవునవును..." అందరూ తలూపేరు.

ఆడపెళ్ళివారి ఊరు చేరాక నరసింహంగారు కేష్‌బేగ్‌ని సూట్‌కేసులోంచి తీస్తున్నపుడు మాత్రం అది అందులోకి ఎలా వచ్చిందో ఎవరికీ అర్థంకాలేదు.

-పి.విజయలక్ష్మి

# 'చతుర' ప్రపంచం

## దెయ్యంకథ

దెయ్యాలంటే చచ్చేలా భయపడేవాళ్ళూ వున్నారు. అసలు దెయ్యాలు లేవనీ, అవన్నీ అభూతకల్పనలనీ వాదించేవాళ్ళూ వున్నారు.




కానీ అప్పుడప్పుడు దెయ్యాలు లేవని ఖచ్చితంగా నమ్మేవాళ్ళని కూడా బుట్టలో వేసే సంఘటనలు జరుగుతూవుంటాయి.

ఆమధ్యకాలంలో ఇటలీలో ఓ మారుమూల ప్రాంతంలో జరిగిన ఓ సంఘటన అలాంటిదే. థామస్ అనే ఓ 13 ఏళ్ళ కుర్రాడు వాళ్ళ మేనమామతో కలిసి వద్దంటున్నా వినకుండా వేటకెళ్ళాడు. దట్టమైన ఆ అరణ్యంలో అనుకోకుండా మామయ్యనుంచి విడిపోయి దారితప్పాడు థామస్. మొత్తంమీద ఎలాగో కష్టపడి ఇంటికి చేరుకోగలిగాడు ఆ కుర్రవాడు. కానీ ఇంటికొచ్చినప్పటినుంచీ ఏదో అంతుపట్టని అనారోగ్యంతో బాధపడుతూ, లేనిపోని పిచ్చికేకలు వేస్తూండటంతో డాక్టరుకి చూపించారు తల్లితండ్రులు. ఆ మందులేవీ పనిచెయ్యకపోగా వింతచేష్టలు ఇంకా ఎక్కువవడం మొదలెట్టాయి. ఇరుగుపొరుగువాళ్ళొచ్చి ఇది ఖచ్చితంగా గాలి లక్షణమే అనీ, వెంటనే భూతవైద్యుడు వద్దకుగానీ, పూజారివద్దకుగానీ తీసుకెళ్ళడమవసరమని చెప్పారు. అసలు అడవిలో ఏం జరిగిందంటూ ఒకళ్ళ తరువాత ఒకళ్ళు ప్రశ్నలు గుప్పిస్తుంటే చివరికి నోరువిప్పి 'అడ

విలో తానొక వృద్ధురాల్ని చూశానని, దాని మొహంలో పిల్లులు, నక్కలు, పులుల్లాంటి జంతువులు భయంకరంగా కనిపించాయనీ, దాంతో పారిపోయి ఇంటికొచ్చాననీ' చెప్పాడు. ఇంకేం! అది గాలి లక్షణమే అని నిర్ధారించారు అందరూ. అడవిలో థామస్ తిరిగిస ప్రదేశంలో వెతికి మొత్తంమీద ఆ ముసలిదాన్ని పట్టుకుని పోలీసు స్టేషన్‌కి లాక్కొచ్చారు. దాన్ని చూడగానే ''అదే... అదే... అదే భూతం'' అంటూ అరిచాడు థామస్. వెంటనే ఆ ముసలిదాన్ని పట్టుకుని చావచితక్కొట్టినా నాకేమీ తెలియదదంది. ఇది పని కాదని చివరికి కాలుతున్న ఇనపబూట్లువంటివాటిని కాళ్ళకి తొడిగారు. వెంటనే బాధ భరించలేక అది 'అవును! నేను మాంత్రికురాలినే' అని ఒప్పుకుంది. వెంటనే దాన్ని జైల్లో పెట్టారు. కానీ ఆ తరువాత చాలా కాలానికి 'తనకి దెయ్యం పట్టడం, క్రూర జంతువులు మాంత్రికురాలి మొహంలో కనిపించి భయపెట్టడం అబద్ధమనీ, పెద్దవాళ్ళు, బంధువులు అందరూ తనని సీరియస్‌గా పట్టించుకోవడంకోసం తమాషాకి అలా చేశానని థామస్ చెప్పడంతో అందరూ ముక్కున వేలేసుకున్నారు. కానీ ఆ సమయంలో ఎలాంటి నమ్మకాలూ లేనివాళ్ళు కూడా నమ్మేలా థామస్ చెప్పిన కథ సాక్ష్యాధారాలతో కనిపించడంతో తాత్కాలికంగానైనా నమ్మక తప్పలేదుమరి.

---

## '555' ఎలాపుట్టింది

సిగరెట్లకీ క్రికెటర్లకీ అవినాభావ సంబంధం ఉందన్పిస్తుంది. అందుకే కాబోలు కొన్ని సిగరెట్ కంపెనీలు తమ అమ్మకాలు పెరగడం కోసం టెస్ట్ మ్యాచ్‌లు, ఒన్‌డే మ్యాచ్‌లూ స్పాన్సర్ చేస్తుంటాయి. అయితే సిగరెట్ అంటుకోని క్రికెటర్లూ ఉన్నారు. జాక్‌హాబ్స్, డాన్‌బ్రాడ్‌మన్, జాక్‌రైడర్, విజయ్‌హజారే, విజయ్ మర్చంట్ మొదలైన వాళ్లు ఆ కోవలోకే వస్తారు. వీళ్లకి విరుద్ధంగా వాల్టర్ హామండ్, ఫెండర్, డగ్లస్, లాలా అమర్‌నాథ్‌లని చెప్పుకోవచ్చు. సిగరెట్‌లేందే వీళ్లకి క్షణం గడవదు.

ఓసారి సరదాగా ధూమపాన ప్రియులైన క్రికెటర్లకీ, అది అంటే గిట్టని క్రికెటర్లకీ మధ్య లండన్‌లో ఓ మ్యాచ్ ఏర్పాటయింది. ధూమ



పాన ప్రియుల టీమ్ చిత్తుగా ఓడిపోయింది. ఆ జట్టులోని స్కాటన్ చివరి బంతిని బ్యాట్‌తో కొట్టకుండా చేత్తో పట్టుకొని జేబులో వేసుకున్నాడు. "అదేం పనయ్యాబాబూ?"అంటే "మ్యాచ్ ఎలాగో ఓడిపోతున్నాం గదా? అయితే ఈ చారిత్రాత్మక అపజయానికి శాశ్వత చిహ్నంగా ఈ బాల్‌ని నా దగ్గరే ఉంచుకుందామని ఇలా చేశాను" అన్నాడట నవ్వుతూ.

కౌంటీమాచ్‌లలో ప్రసిద్ధమైన సర్రీజట్టుకు నేతృత్వం వహించే స్ట్రడ్విక్ స్వతహాగా ధూమపాన వ్యతిరేకి. తన జట్టుగనుక కెంట్స్ జట్టును ఓడించగలిగితే సిగరెట్లు నేనూ తాగుతానని ప్రకటించాడతను. అనుకున్నట్లుగానే స్ట్రడ్విక్ జట్టు, కెంట్స్ జట్టును ఓ మాచ్‌లో ఓడించింది. అప్పటినుంచీ ధూమపానం ప్రారంభించాడతను.

ఒకే ఇన్నింగ్స్‌లో 68 ఫోర్లు కొట్టి 343 పరుగులు సాధించిన పెర్సీపెరిన్‌ను ఇంగ్లండ్ సెలక్షన్ కమిటీ టెస్ట్ మ్యాచ్‌కి ఎంపికచేయలేదంటే కారణం అతని సిగరెట్ల పిచ్చే! అతను సందర్భాసందర్భాల్ని పట్టించుకోకుండా ఎటువంటి ప్రముఖుల ముందైనా సిగరెట్లు ఊదేస్తుంటాడు.ఒకవేళ అవి అయిపోతే "ఓ సిగరెట్ ఇవ్వు గురూ" అంటూ చనువుగా ఎంత పెద్ద హోదాలో ఉన్న వాణ్ణైనాసరే నిర్మొహమాటంగా అడుగుతాడట.

ఆస్ట్రేలియన్ కెప్టెన్, ట్రాట్‌కి స్వయంగా ఇంగ్లాండ్ రాజైన కింగ్ ఎడ్వర్డ్ VII ఓ సందర్భంలో సిగరెట్ ఆఫర్ చేసి తన ఎదురుగానే కాల్చుకునే అవకాశం ఇచ్చారట. ఎవరికీ దక్కని ఆ అపూర్వ గౌరవం తనకి దక్కినందుకు ఎంతో ఆనందపడ్డ ట్రాట్, కాల్చేశాక ఆ సిగరెట్ పీకను భద్రంగా దాచుకుని తన దేశానికి తెచ్చుకున్నాడు. ఆ తర్వాత తన యాష్‌ట్రేలో ఉన్న సిగరెట్ పీకల్ని తీసి తన జట్టు సభ్యులందరికీ ఒకళ్లకి తెలియకుండా ఒకళ్లకి తలొకటీపంచి పెట్టు, "మిత్రమా! ఎడ్వర్డ్ రాజుగారు నాకు బహూకరించిన సిగరెట్ తాలూకు పీక ఇది. నీ మీద ప్రత్యేకాభిమానంతో నీకే యిస్తున్నాను. నా గుర్తుగా దాచుకో. ఇంకెవరికీ చెప్పకు" అని అందరికీ చెప్పాడట అతను. ఆ రహస్యం చాలాకాలం తర్వాతే బయటపడింది.

బ్రౌన్- ట్యూనిక్లిఫ్‌లు జంటగా సాధించిన 554 పరుగుల రికార్డును 34 ఏళ్ల తర్వాత అంటే 1932లో యార్క్‌షైర్ టీమ్ బద్దలుకొట్టింది. ఆ జట్టులోని సాట్‌క్లిఫ్- హూమ్స్ ఓపెనర్స్‌గా ఆడి 555 పరుగులు సాధించారు. ఆ విజయానికి చిహ్నంగానే 'త్రిబుల్‌ఫైవ్' సిగరెట్ కంపెనీ ఆవిర్భవించిందని చాలా మందికి తెలియదు.

ఒకే ఒక్క సీజన్‌లో 304 వికెట్లు పడగొట్టిన ధీశాలి ఫ్రీమన్ ధూమపాన ప్రియుడే! గమ్మత్తేమంటే 'స్వేచ్ఛాజీవి' (ఫ్రీమన్) అనేది అతని పేరులోనే తప్ప నిజజీవితంలో లేదు. భార్య ఎదురుగా సిగరెట్ తాగడానికి ఆయనకి ధైర్యంలేదు.

ఇంగ్లండ్‌లోని లార్డ్స్ మైదానంలో ఇంగ్లండ్‌కి ఆస్ట్రేలియాకి మధ్య జరిగిన ఓమాచ్ సిగరెట్ల కారణంగా లేటయింది. కారణం కొంతమంది క్రికెటర్లు మైదానానికి వెళ్తూ దారిలో కన్పించిన ప్లెయిర్ సిగరెట్ల కంపెనీలోకి చూద్దామని సరదా ప్రవేశించారు. కంపెనీవారు సగౌరవంగా వారందరికీ తలో పాకెట్ సిగరెట్లు ఇస్తామంటే ఆటకి లేటవుతున్నా పట్టించుకోకుండా వేచి ఉండి పాకెట్లు తెచ్చుకున్నారు. ఇలా చెప్పాలంటే ఎన్నో ముచ్చట్లు!

## మారుతున్న కుక్క

**త**రతరాలుగా మనుషుల ఆలోచనల్లో, ప్రవర్తనల్లో, సంస్కృతీ, సంప్రదాయాల్లో ఎన్నో మార్పులొస్తున్నాయి. కానీ అలాంటి మార్పు జంతువుల్లో కూడా వచ్చే అవకాశముందంటే ఆశ్చర్యకరమే. మనుషుల్లో మార్పులొస్తున్నట్లే కుక్కల్లో కూడా అనాదిగా ఎన్నో మార్పులొస్తున్నాయంటున్నారు శాస్త్రజ్ఞులు.

కుక్కకి, మనిషికి మధ్య విశ్వాసబంధానికి పునాదిపడి, పదివేల సంవత్సరాలయింది. డానీకాపే అనే ఓ ఫ్రెంచి రచయితకి కుక్కలంటే మహాఇష్టం. అందుకే ఆయన కుక్కలకు సంబంధించిన మొత్తం సమాచారం ఇస్తూ, "ది ఎక్స్.వై.జెడ్. ఆఫ్ డాగ్" అనే







పుస్తకం రాశాడు. కుక్కని ఎలా ఎన్నుకోవాలి, దాన్నెలా పెంచాలి, వాటికి వచ్చే రోగాలె లాంటివి...? వగైరా మొత్తం సమాచారం లభ్యమవుతుందా పుస్తకంలో.

కుక్కల్లో 6 ముఖ్యమయిన రకాలున్నాయంటాడు డానీ. ఆటకుక్క, వేటకుక్క, పెంపుడుకుక్క, పందెపుకుక్క, అలంకరణ కుక్క, చిన్ని చిన్ని వేటలకు పనికివచ్చే కుక్క.

ఇంతకీ ఈయనగారు 25 సంవత్సరాలు సుదీర్ఘ పరిశోధనచేసి తెలిసుకొన్నదేమిటంటే కుక్కల్లో మనుమల్లో లాగానే ఎన్నో మార్పులు చోటుచేసుకున్నాయని.

ఒకప్పుడు కుక్కలు విశ్వాసానికి మారుపేరుగా వుంటూ, బద్ధకం లేకుండా ఇంటికాపలా కాసేవి. కానీ నేటి కుక్కల్లో మనుమల్లాగే స్వార్థపరత్వం, బద్ధకం పెరిగిందంటున్నాడాయన.

సుమారు 20, 30 సంవత్సరాల క్రితందాకా బుల్లి బుల్లి పెంపుడు కుక్కలు (టోయ్ డాగ్స్) యజమాని భోంచేస్తుంటే ఈగలని తోలడం, పరుగున వెళ్లి సాక్స్ తెచ్చివ్వడంలాంటి ఎన్నో పనులు చేసేవి. ఇప్పుడలా లేవు సరికదా యజమాని హడావిడిగా టిఫిన్ తింటుంటే, ఒళ్లోకిదూకి ఖరీదైన సూటు కాస్తా పాడుచేసి, నానా ఛండాలం చేస్తున్నాయంటాడు డానీ.

ఒకప్పుడు ఎత్తుగా, పెద్ద సైజు గొర్రెల్లా కనిపించే డాల్‌మేషన్ డాగ్స్, యజమాని ప్రయాణించే కోచ్‌ను లాగుతూవుండేవి. నిజానికి ఈ పని గుర్రాలదే అయినా అప్పుడప్పుడు వాటికి విశ్రాంతి ఇచ్చే నిమిత్తం కుక్కలే ఆ పనిచేసేవి. ఫైరింజన్లు వెడుతుంటే గంటలు కొడుతూవుండేవి డాల్‌మేషన్ కుక్కలే. కానీ ఇప్పుడు అవే కుక్కలు బద్ధకం బలిసి, నిత్యం టి.వి.ముందు కూర్చుంటున్నాయి తప్ప అరిచి గీపెట్టినా పట్టించుకోవటంలేదట. రిఫ్రిజరేటర్లను స్వయంగా తెరుచుకుని అందులో పెట్టిన మాంసం, గుడ్లు వగైరా ఆహారపదార్థాలను భోంచేసే దొంగబుద్ధులు కూడా వాటికి వచ్చాయంటున్నాడు డానీ.

వీటంతటికీ కారణం మనిషిలో పెరుగుతున్న స్వార్థమే అంటాడీయన. ఆ బుద్ధులే అతడు పెంచుకున్న కుక్కలకీ వస్తున్నాయని ఆయనగారి వాదం.



# చతుర

సంపుటి: 16 సంచిక: 10 నవంబర్: 1993

పట్టులా మృదువుగా వుండే రేకులతో, కనువిందుచేసే అందాలతో, ఎన్నో రంగుల్లో దర్శనమిచ్చే గులాబీపూలంటే... ప్రాణం పెట్టే... ఆ యువతి హృదయం... వజ్రంకన్నా కఠినం.

రోజాపూల కోసం, ఆ మొక్కలకోసం వేలకువేలు ఖర్చుపెట్టే ఆమె అర్ధరూపాయి బస్సు ఖర్చుకు భయపడేది.

తను పెట్టుకోక, ఒకరికివ్వక...

ఆ పూలకోసం అయినవాళ్ల ప్రేమకు, ఆప్యాయతకు దూరమయిన ఆమెజీవితాన్ని మలుపులు తిప్పిన ఆ మరువరాని సంఘటన ఏమిటి?

పూవులాంటి ఓ స్త్రీ హృదయం రాయిలా మారితే... ఎదురయ్యే అనుభవాలు ఎలాంటివి? ఆపకుండా చదివిస్తూనే ఆలోచింపచేసే ఓల్గా రచన 'గులాబీలు' ఈ నెల చతుర సమగ్ర నవల.

# గులాబీలు

— ఓల్గా

మట్టి నింపిన పాలిథిన్ కవర్లలో ఎంతో జాగ్రత్తగా వుంచిన గులాబీ మొక్కల అంట్లను శ్రద్ధగా, ప్రేమగా, భక్తిగా పట్టుకుని ఆటో ఎక్కింది సుధ.

"టీవీ జాగ్రత్త! నీ గులాబీ మొక్కల్ని కాసేపు కిందపెట్టి టీవీని పట్టుకో" శ్రీకాంత్ వెనకనుంచి అరిచాడు.

"అమ్మా- నా ఫొటోలు పట్టుకుని కూచో. అద్దాలు పగిలితే నేను వూరుకోను" లయ తండ్రి వెనకాల స్కూటర్‌మీద కూచుంటూ కేక పెట్టింది.

'తండ్రీ కూతుళ్ళిద్దరూ సరిపోయారు' అని విసుక్కుంటూ సుధ గులాబీ మొక్కలను ఒళ్ళో పెట్టుకుని ఒక చేయి టీవీమీదా మరో చెయ్యి కట్టగా కట్టిపెట్టిన ఫొటోలమీదా వేసింది.

కాళ్ళ దగ్గర కొన్ని విలువయిన సామాన్లే ఉన్నాయి. ఆటో కదిలింది. వెనకాల శ్రీకాంత్ స్కూటర్ కదిలింది. ఆ వెనక నిండుగా సామాన్లతో వున్న లారీ కూడా కదిలింది.

పదిహేనేళ్ళు నిరంతరం శ్రమపడితే ఇప్పుడు తన కోరిక తీరబోతోంది. స్వంత ఇల్లు, దానిముందు గులాబీతోట, ఎలాగైతేనేం తను సాధించింది. కళ్ళల్లో నీళ్ళు ఉబుకుతుంటే టీవీమీద చేయితీసి సుధ పమిట కొంగుతో ఆ కన్నీళ్ళను అద్దేసింది.

శ్రీకాంత్ కూడా తనలాంటి వాడయితే, తనతో పూర్తిగా సహకరించే వాడయితే యివాళ యిలా ఆటోలో వెళ్ళాల్సి వచ్చేదేనా? స్వంత ఇంటికి స్వంత కార్లో వెళ్ళేవాళ్ళం. ప్రాప్తం లేదు. శ్రీకాంత్ తనలాగా మారడు. తను అతనిలా మారలేదు. ఒక్కటే సంతోషించాల్సిన విషయం. తన విషయంలో పెత్తనం చెయ్యాలని చూడడు. 'నా జోలికి నువ్వు రాకు. నీ జోలికి నేను రాను' అనే తత్త్వం. కనకనే తన రెక్కల కష్టమన్నా తనకి దక్కింది. ఒక యిల్లంటూ ఏర్పడింది.

ఈ ఇంటికోసం ఎంత పొదుపుగా బతికింది. ప్రతిపైసా కూడబెట్టింది. లయ తర్వాత యిక పిల్లలు వద్దని ఆపరేషన్ చేయించుకుంది. అత్యవసరమైన ఖర్చులు పోను జీతం మొత్తం పొదుపు చేస్తే- యిన్నాళ్టికి ఈ కల నిజమైంది.

అందమైన చిన్న ఇల్లు- ఆ ఇంటిముందు ముచ్చటైన గులాబీతోట. తన చిరకాలపు కల నెరవేరింది. ఇకనుంచీ కాస్తంత సుఖంగా బతకొచ్చు. ఆటోతోపాటు సుధ మనసులో ఆలోచనలు కూడా ప్రయాణం చేస్తున్నాయి.

ఒక విధమైన శాంతి సంతృప్తులతో సుధ మనసు నిండిపోయింది.

ఆటో నగరపు ఒక చివరికి ప్రయాణం చేసి ఒక కొత్త యింటిముందు ఆగింది.

శ్రీకాంత్ స్కూటర్ దిగి సుధకు సహాయం చెయ్యటానికి ఆటో దగ్గరకు వచ్చాడు.

లయ స్కూటర్ దిగి గేటు తీసుకుని ఇంటి దగ్గరకు చేరి అసహనంగా తండ్రికోసం చూస్తోంది.

ఆటోని పంపి సామాను ఎలా దించాలో లారీలో వున్న యిద్దరు మనుమలకు చెబుతున్నాడు శ్రీకాంత్.

"నాన్నా- నువ్వు తాళం తీసి వెళ్తావా లేదా?"

లయ అరుపులకు భయపడుతున్నవాడిలా గబగబా వచ్చి ఇంటి తాళం తీశాడు.

లయ లోపలకు ఒక్క పరుగు తీసింది.

తెల్లగా సున్నంకొట్టిన ఇంట్లో విశాలమైన గదుల్లో యిష్టం వచ్చినట్లు పరిగెత్తింది లయ

చివరకు అలుపువచ్చి ఆగింది.

నవ్వుతూ చూస్తున్న తండ్రిని కావలించుకుని

"నాన్నా- ఇల్లు చాలా బాగుంది" అంది ఉత్సాహం పట్టలేని గొంతుతో.

"మీ అమ్మతో చెప్పరా- చాలా సంతోషిస్తుంది" అన్నాడు శ్రీకాంత్.

"అమ్మేది?" అంటూ అటూ యిటూ చూసి,

"నాన్నా నా గది ఏది వీటిలో" అని అడిగింది లయ.

శ్రీకాంత్ తీసుకెళ్ళాడు.

"మీ గదికంటే నా గది చిన్నది" ఇదేం అన్యాయమన్నట్లు చూసింది లయ.

"మాకంటే నువ్వు చిన్నదానివి కదా"

లయ ఒప్పుకున్నట్లు నవ్వేసింది.




''నాన్నా వెంటనే గోడలకు మేకులు కొట్టి ఫొటోలన్నీ తగిలిస్తా''

''ఇంకా నయం- గోడలకు మేకులు కొట్టకూడదు''

''నాన్నా నువ్వుకూడా మన ఇంటి ఓనర్‌లా మాట్లాడతావేంటి. అసలు గోడలకు మేకులు కొట్టుకోటానికేగా మనం స్వంత యిల్లు కట్టుకుంది. నువ్వే చెప్పావు మర్చిపోయావా?''

శ్రీకాంత్ నవ్వి లయను దగ్గరకు తీసుకుని-

''అద్దె యిళ్ళల్లో వున్నప్పుడు మేకులు కొట్టుకోవటం చాలా అవసరం అనిపిస్తుంది. ఒక ఇంటికి ఓనర్ అవగానే మేకులు కొట్టటం చాలా పెద్ద నేరం అనిపిస్తుంది''

''అయితే నువ్వు ఈ ఇంటి ఓనర్‌వా?''

''నేను కాదు మీ అమ్మ. మీ అమ్మ పర్మిషన్ తీసుకుని ఆ తర్వాత నీ యిష్టం వచ్చినన్ని మేకులు కొట్టు''

''అమ్మ కనపడదేంటి'' లయ పరిగెత్తింది. లారీ నుంచి దించిన సామానంతా హాల్లో కుప్పపడింది.

లయ ఆ సామాను తప్పించుకుంటూ తల్లి కోసం బైటికి వెళ్ళింది.

సుధ ఇంటిముందు చక్కగా తవ్వి, మట్టి వేసి ఎరువు చల్లిన నేలమీద నుంచుని గులాబీ మొక్కలను ఏ క్రమంలో నాటాలా అని ఆలోచిస్తోంది.

''అమ్మా- నా గదిలో మేకులు కొట్టి ఫొటోలు తగిలించుకుంటా''

తల్లి మెడకు వేళ్ళాడుతూ గారంగా అడిగిన లయను వెనక్కు నెట్టింది సుధ.

''నన్ను డిస్టర్బ్ చెయ్యకు. మీ నాన్ననడుగు వెళ్ళు'' విసుక్కుంది.

లయ ఆరాటంగా మళ్ళీ తండ్రి దగ్గరకు పరిగెత్తింది. తండ్రి కిష్టయ్యతో మాట్లాడుతున్నాడు.

కిష్టయ్య ఈ ఇల్లు పునాదులు తవ్వేరోజు నుంచీ యిప్పటివరకూ ఆపనీ ఈపనీ అనుకోకుండా అన్ని పనులూ చేశాడు. ఇంటికీ, ఇంటికని తెచ్చిన సిమెంటు, కలప ఇనుమూ వీటన్నిటికీ కాపలా కాశాడు. స్టోరుకోసం కట్టిన చిన్న గదిలో సామానుతోపాటు తనూ భార్యా పిల్లలతో వుండిపోయాడు.

''మీరు ఇంట్లో సెటిలయ్యాక నేనా గది కాళీ చేస్తానండీ'' అన్నాడు కిష్టయ్య.

''ఎందుకు కిష్టయ్యా. ఆ గదితో మాకేం అవసరం లేదు. మీరు ఉండొచ్చు''

''కాదులే అయ్యా- అమ్మగారు ముందే చెప్పారు. అదీగాక అవతల బజార్లో యింకో యిల్లు కట్టుబడి అవుతాంది. అక్కడ గదిలో కాపలాగా వుంటే మూడొందలు యిస్తారు. నేనూ, మాయావిడ అక్కడే పని చెయ్యొచ్చు. దాని కూలి దానికే యిస్తారు''

ప్రతి ఇల్లూ జాగ్రత్తగా కట్టిచ్చి యజమానులకు అప్పగించి యింకో కొత్త యింటికోసం వెతుక్కోవటం పనివాళ్ళందరిలాగే కిష్టయ్యకూ అలవాటే.

లయకు ఈ మాటలకంటే తన పని అత్యవసరమైనదిగా అన్పించింది. తండ్రిని ఒదలకుండా పట్టుకుంది. శ్రీకాంత్ ఫొటోలు, మేకులూ కిష్టయ్యకు యిచ్చి లయ చెప్పినట్లు చెయ్యమని మిగిలిన సామాను గదుల్లో సర్దించటంలో పడిపోయాడు.

రెండు మూడు గంటలు మరో మాట లేకుండా పని సాగింది. ఇంటి నిండుగా సామాను సర్దుకుంది. ఒక భద్రజీవితానికి నేనే ఆధారమన్నట్లు సామానుతో గర్వంగా, హుందాగా నిలబడింది ఇల్లు. శ్రీకాంత్ దుమ్ము కొట్టుకున్న కాళ్ళు, చేతులూ, ముఖం కడుక్కుని లయకోసం వెదికాడు. లయ తన గది సర్దుకుంది. గోడలకు తగిలించిన ఫొటోల విషయంలోనే ఆ పిల్లకు తృప్తి కలగటం లేదు. అక్కడి ఫొటో యిక్కడికి యిక్కడి ఫొటో అక్కడికీ మార్చి మార్చి చూస్తోంది.

తండ్రిని చూసి వికసించిన ముఖంతో

''నాన్నా బాగున్నాయా?'' అని అడిగింది.

శ్రీకాంత్ అమాంతం లయను ఎత్తుకుని ముత్యాల్లా మెరుస్తున్న చెమట చుక్కలతో నిండిన లయ ముఖాన్ని ముద్దాడాడు.

''మరి నీ ఫొటోలన్నీ నాకు పరిచయం చెయ్యవూ?'' అని అడిగాడు.

"నీకు తెలియదా? అన్నీ నువ్వేగా ప్రేములు కట్టింది" లయ తండ్రి పొడుగాటి ముక్కును పట్టుకుని ఊపింది.
అయినా నువ్వు చెబితే నాకు బాగుంటుందిరా నాన్నా" లయను దించాడు.

"ఇది చార్లీ చాప్లిన్, సావిత్రి, తర్వాత గురజాడ, అడుగో శ్రీశ్రీ అక్కడ, సత్యజిత్‌రే యిక్కడ, సునీల్ గవాస్కర్, అజహరుద్దీన్‌లు యిక్కడ- దుర్గాబాయి దేశ్‌ముఖ్ ఫొటో ఎక్కడ పెడితే బాగుంటుంది నాన్నా"

"అయ్యయ్యో- అయ్యయ్యో ఇల్లంతా మేకులు దిగ్గొట్టేశారా? ఎందుకు ఆ దిక్కుమాలిన ఫొటోలతో గోడలన్నీ పాడుచేస్తారు. అది చిన్నపిల్ల. మీరైనా చెప్పొద్దూ"

సుధ గోడలకు జరిగిన ప్రమాదానికి విలవిలలాడి పోయింది.

"చిన్న పిల్లలకు వాళ్ళిష్టాలు వాళ్ళకుంటాయి. అదృష్టవశాత్తూ మనమ్మాయికి మంచి యిష్టాలు వున్నాయి. దానికి సంతోషించక గోడలకోసం ఏడుస్తావెందుకు సుధా" నచ్చచెప్పాడు శ్రీకాంత్.

సుధ రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

"అమ్మకు కోపం లేకపోతే బాగుంటుంది కదు నాన్నా" లయ వెళ్తున్న తల్లివంక జాలిగా చూసింది. తన యిష్టాన్ని కాదన్న తల్లిమీద కోపం తెచ్చుకోకుండా కోపానికి వశురాలవుతున్నందుకు తల్లిమీద జాలిపడే కూతురి గొప్ప మనసుకు వివశుడవుతూ లయను గుండెలకు హత్తుకున్నాడు శ్రీకాంత్.

సుధ ఇల్లంతా పరిశీలించి తృప్తి పడింది. శ్రీకాంత్ చక్కగానే సర్దించాడు.

"రండి- ఇంత తిండి తిని కాసేపు నిద్ర పోదాం" కేక పెట్టింది.

"నీ తోటపని పూర్తయిందా? మాకు చూపించవూ?" శ్రీకాంత్ తోట చూడటానికి వెళ్లాడు.

తోటలో గులాబీ మొక్కలు ఠీవీగా నిలబడ్డాయి. లేత మొక్కలు. సుధ వాటిని నాలుగు గుండ్రాలుగా అమర్చింది. ముందు ఒక పెద్ద వరస గుండ్రంగా రెండోది దానిలోపల కాస్త చిన్నది. మూడవ రౌండు యింకా చిన్నది. నాలుగవ రౌండు ఆరే మొక్కలతో అతి చిన్నది.

"ఆ మధ్య స్థలంలో లాన్ పెంచితే బాగుంటుంది కదండీ" సుధ వచ్చింది.

"అమ్మా చాలా బావుంది" సుధకి ఒక ముద్దిచ్చింది లయ.

"చూడు ఇలా అందమైన పనులు చెయ్యాలిగానీ గోడలన్నీ వికారం చెయ్యకూడదు"

సుధ మళ్ళీ లయను నొప్పిస్తున్నందుకు శ్రీకాంత్ మనసు చివుక్కుమంది.

"అమ్మా- నా గదిలో వున్న ఫొటోల్లో వాళ్లందరూ గులాబీ పూలలాగే అందమైన వాళ్లమ్మా"

లయ తల్లిని ఒప్పించాలనే ప్రయత్నంలో తన చిన్ని మెదడంతా వుపయోగించి చెప్పిన మాటకు శ్రీకాంత్ పులకించి పోయాడు.

"ఏడిశావు- నీకు ఈ నోరొకటి యిచ్చాడు దేవుడు. ఎవర్నీ గెలవనివ్వవు"

కూతురి తెలివితేటల్ని విసుగ్గానైనా గుర్తించింది సుధ.

సుధ శ్రీకాంత్‌ల పెళ్ళయ్యి పదిహేను సంవత్సరాలయింది. పెళ్ళి నాటికే సుధ లెక్చరర్‌గా పని చేస్తోంది. శ్రీకాంత్ ఒక ఫ్యాక్టరీలో సూపర్‌వైజర్‌గా చేస్తున్నాడు. ఇద్దరివీ అతి సామాన్య కుటుంబాలు.

సుధ తండ్రి స్కూలు టీచరు. ముగ్గురాడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు. ఆ పెద్ద సంసారాన్ని పళ్ళ బిగువున లాక్కొచ్చేవాడు. పిల్లలందరూ తెలివిగలవాళ్ళు. బుద్ధిమంతులు. సుధ మూడవది. ఇద్దరాడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసి నడుం విరిగినట్లున్న సుబ్బారావుగారికి సుధ పెళ్ళి అసాధ్యమనిపించింది. పైగా వున్న వూళ్ళో కాలేజీ యూనివర్సిటీ వుండటంతో పిల్లలందరూ బాగా చదివారు. స్కాలర్ షిప్పులు తెచ్చుకునీ, ట్యూషన్లు చెప్పీ ముగ్గురాడపిల్లలూ పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేశారు. సుధ ఫిజిక్సు ఎమ్మెస్సీ చేసింది. వెంటనే హైదరాబాదులో ఉద్యోగం సంపాదించుకుంది. నాలుగేళ్ళు పెళ్ళి మాట తలపెట్టను. తమ్ముళ్ళిద్దర్నీ ఓ ఒడ్డుకి చేర్చి దాని పెళ్ళి అదే చేసుకుంటుంది. నేను బొత్తిగా అశక్తుడిని అని

గుండె రాయిచేసుకున్నాడు సుబ్బారావు.

అయితే సుధకు అనుకోకుండా మంచి సంబంధం వచ్చింది. సుబ్బారావు కుటుంబం ఎంత పద్ధతి గలదో తెలిసిన ఒక స్నేహితుడు శ్రీకాంత్ తల్లికి సుధ గురించి వదేవదే చెప్పాడు. శ్రీకాంత్ తల్లి కూడా టీచరే. ఆమెకు యిద్దరు పిల్లలు. పిల్లలు బాగా చిన్నగా వుండగానే ఆమె భర్త చచ్చిపోయాడు.ఆడపిల్ల పెద్దది. కష్టపడి చదివి డాక్టరయింది. రెండవవాడు శ్రీకాంత్. అక్క డాక్టర్ చదువుతుంటే తనూ ఇంజనీర్నవుతానని కూచుంటే తల్లికి భారం ఎక్కువవుతుందని పదో తరగతి తర్వాత పాలిటెక్నిక్‌లో చేరాడు. అక్క కంటే ముందు చదువు పూర్తిచేసి ఉద్యోగంలో చేరాడు. శారదను పెళ్ళిచేసుకొమ్మని పోరీపోరీ లాభంలేక విరమించుకుంది సావిత్రమ్మ. శారద హవుస్ సర్జన్సీ అవగానే పరీక్ష రాసి గవర్నమెంటు ఉద్యోగంలో చేరింది. హైదరాబాదుకి నలభై కిలోమీటర్ల దూరాన వున్న పల్లెటూరిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో డాక్టరుగా చేరింది. సావిత్రమ్మ కూతురితోపాటు వెళ్ళటంతో శ్రీకాంత్ ఒంటరివాడయ్యాడు. పుస్తకాలు చదువుకుంటూ సభలకూ సమావేశాలకు వెళ్తూ హాయిగానే బతుకుతున్నానని ఎంత చెప్పినా తల్లి వినిపించుకోలేదు. సంబంధాలకోసం వెతక సాగింది.

సుధ గురించి దగ్గరి బంధువు జానకిరామయ్య చెప్పింది వింటే సావిత్రమ్మకు ఆ పిల్లనూ, ఆ కుటుంబాన్నీ చూడాలనిపించింది.

ముందు తను వెళ్ళి చూసింది. బీద కుటుంబం అయినా సుబ్బారావుగారి మంచితనం, పిల్లల పద్ధతీ చూశాక ఆమెకు ఈ సంబంధం ఒదలాలనిపించలేదు.

ఈ కాలంలో కూడా మగపిల్లలిద్దరూ సాయంత్రం ప్రైవేట్లు చెప్పీ, ఆదివారాలు దుకాణాల్లో లెక్కలు రాసీ సంపాదించి చదువుతున్నారు. ఆడపిల్లలు కూడా అలాగే కష్టపడి చదివారట. కట్నాలు యిచ్చుకోలేరు గానీ ఈ కష్టపడే స్వభావం ముందు ఎంత కట్నమైనా తక్కువే. పిల్ల లెక్చరరు. ఇద్దరూ సంపాదించుకునే వాళ్ళయితే ఎంతలో బాగుపడతారు!

కానీ కట్నం లేకుండా సుధను తన కొడుక్కి చేసుకుంటానని సావిత్రమ్మ చెబుతుంటే సుబ్బారావుగారి కళ్ళవెంట నీళ్ళు ఆగలేదు. రెండు చేతులూ ఎత్తి ఆమెకు నమస్కరించాడు. శ్రీకాంత్‌కి తల్లి మాటంటే గురి. ఆమె తెలివైనదనీ, మంచి నిర్ణయాలు చేస్తుందనీ నమ్మకం. సుధను చూసినపుడు కూడా తల్లి మీద గౌరవం హెచ్చింది. అందం, తెలివి తన సొత్తయినట్లున్న సుధను ఒద్దని చెప్పటానికి ఏ కారణం కన్పించలేదు. కట్నం కావాలని శ్రీకాంత్ ఏనాడూ అనుకోలేదు. శారద కూడా సుధను చూసి మెచ్చుకుంది. అందరూ సంతోషంగా ఉన్నారు. ఒక్క సుధకే కాస్త అసంతృప్తి. డిగ్రీ లేదు. సూపర్‌వైజర్ హోదా, జీతం బాగానే వున్నా తనకున్న డిగ్రీ లేదు గదా- అలాగని సంబంధం ఒద్దనేంత అవివేకి కాదు. శ్రీకాంత్ ఎంతో అందంగా ఉన్నాడు. తన స్నేహితులెవరికీ యింత అందమైన భర్త దొరకలేదు. ఇంతకంటే మంచి సంబంధం తండ్రి తేగలడనే ఆశా లేదు. సుధ నిర్లిప్తంగా పెళ్ళికి సిద్ధమయింది. కట్నం కోరని శ్రీకాంత్ మంచితనాన్ని అందరూ అదేపనిగా పొగుడుతుంటే విసుగ్గా అంది సుధ-

"లెక్చరర్ ఉద్యోగమంటే మీకు తెలియటం లేదు. పాలిటెక్నిక్ చదివినవాడికి మహా యిస్తే లక్ష యిస్తారు. నేను ఎన్ని లక్షలు సంపాదిస్తానో తెలుసా? లోకంలో ఎవరూ ఎవరికీ వుత్తినే ఏ ప్రయోజనం లేకుండా ఉపకారం చెయ్యరు. వాళ్ళకి అన్ని విధాలా లాభం గనకనే నన్ను చేసుకుంటున్నారు"

సుధ మాటలకు అందరూ విస్తుపోయారు. అయితే మాటల్ని ఎలా ఖండించాలో ఎవరికీ తెలియలేదు. జయ అనే స్నేహితురాలు మాత్రం.

"సుధా మంచితనాన్ని గుర్తించటంవల్ల నీ గౌరవం తగ్గదే పైగా చాలా సంతోషంగా వుంటుంది. నీ భర్త మంచివాడనుకుంటే నీకు సంతోషం కదూ- నువ్వు సంపాదిస్తావు నిజమే- కానీ ఆయనా నీ అంత సంపాదిస్తున్నాడుగా. మొన్న మన పద్మజకు నిరుద్యోగితో పెళ్ళయింది. రెండులక్షలు కట్నం. ఈరోజుల్లో మీ అత్తగారిలాంటి వాళ్ళు చాలా అరుదు.




సుధకు జయ మాటలు రుచించలేదు.

"ఏమోనే ఉత్తివుణ్యానికి మనుషులు మంచిగా ఉంటారా? ఒకరి సంగతెందుకు. నేనైతే నాకు పనికిరాని పని చెయ్యనే చెయ్యను" అంది.

సుధ దురుసుతనానికి జయ బాధపడింది.

పెళ్ళి జరిగి సంసారం మొదలెట్టాక కొన్నాళ్ళపాటు సుధా శ్రీకాంత్‌లకు ఒకర్ని చూసి ఒకరు విస్తుపోవటమే సరిపోయేది. సుధ చాలా పిసినారి అని తెలుసుకున్నకొద్దీ శ్రీకాంత్ చాలా బాధపడ్డాడు. శ్రీకాంత్‌కు డబ్బంటే లెక్కలేదనీ, తనకిష్టమైన పనులకోసం ఎంత డబ్బయినా తగలేస్తాడనీ తెలిసి సుధ భయంతో ఒణికిపోయింది. ఇలాంటి మనిషితో సంసారం ఎక్కడ తేలేను.

పెళ్ళయి వారమయిందో లేదో ఒక సాయంత్రం గాలిలో తేలుతున్నవాడిలా ఇంటికి వచ్చాడు.

"ఇవిగో టిక్కట్లు రేపు మధ్యాహ్నం కోణార్క్‌కి మనం బరంపురం వెళ్తున్నాం" అన్నాడు.

"బరంపురమా?" ఆ పేరు మొదటిసారి వింటున్న సుధకు అక్కడికి ఈ హఠాత్ ప్రయాణం ఎందుకో ఏ ప్రమాదం ముంచుకొచ్చిందో అర్థంకాలేదు.

"బరంపురం... బరంపురం తెలియదూ? మనం... మనం బరంపురం" సుధకు శ్రీకాంత్‌కు అంత నవ్వూ, ఆ సంతోషం దేనికో అర్థంకాలేదు.

"అదేనోయ్ మహాప్రస్థానంలో కొంపెల్ల జనార్థనరావుకోసం రాసిన కవితలో శ్రీశ్రీ అంటాడే 'బరంపురంలో మనం ఇంకా నిన్నగాక మొన్న మాట్లాడుతున్నట్లే ఉంది' అని ఆ బరంపురం"

శ్రీకాంత్‌కి పిచ్చా? అపుడపుడూ యిలా మాట్లాడతాడా? అందుకే కట్నం లేకుండా తనను చేసుకున్నారా? సుధ ముఖం వివర్ణమయింది.

"ఉప్పల లక్ష్మణరావుగారి 'బతుకు పుస్తకం' ఆవిష్కరణ సభ. ఆయన తప్పకుండా రమ్మని ఉత్తరం రాశారు"

సుధకు తన మాటలేవీ అర్థంకావనీ, సాహిత్యం గురించి ఆమెకు బొత్తిగా తెలియదనీ అర్థం కావటానికి అరగంటపైనే పట్టింది శ్రీకాంత్‌కి.

అంతులేని నిరాశతో బిక్కమొహం పెట్టుకు కూచున్నాడు. భర్తకు సాహిత్యం అంటే పిచ్చనీ, పుస్తకాలకోసం వందలకు వందలు తగలేస్తాడనీ, తనకిష్టమైన రచయితల్ని చూడటానికి ఎంతదూరమైనా వెళ్ళి డబ్బు ఖర్చుచేస్తాడని తెలిసి సుధ ముఖం నల్లగా మాడ్చుకుని కూర్చుంది.

ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ ప్రయాణం తను చెయ్యనంది. బరంపురంలో ఒక్కపూట వుండి, కోణార్క వెళ్ళి శిల్పాలు చూడొచ్చని బతిమాలాడు శ్రీకాంత్.

సుధ కరగలేదు. అనవసరపు ఖర్చులు మాని సంసారం సంగతి చూడాలని యింట్లోకి కావాల్సిన సామాన్ల లిస్టు చదివింది. ఆ రోజు యిద్దరికీ పెద్ద పోట్లాటే జరిగింది.

సుధ తన జీవితాశయం ప్రకటించింది.

"నేను స్వంత ఇల్లు కట్టుకోవాలి. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా, నా జీతం అంతా దానికే దాచిపెడతాను. సంసారం ఎలా నడుపుతారో మీ ఇష్టం"

కొత్తగా పెళ్ళయి ఏ కలలూ, కోరికలూ, రొమాంటిక్ ఊహలూ లేకుండా మహా ప్రాక్టికల్‌గా ఆలోచిస్తున్న సుధను చూసి భయపడ్డాడు శ్రీకాంత్. చివరికి యిద్దరికీ ఒప్పందం జరిగింది. ఎవరి కోరికలు వాళ్ళకుంటాయి. ఎవరి అభిరుచులు వాళ్ళకుంటాయి. ఇద్దరూ సంసారానికి చెరిసగం ఖర్చు భరించి మిగిలినది వాళ్ళిష్టం వచ్చినట్లు చేసుకోవచ్చు.

ఇప్పుడు చెప్పుకోటానికి యింత సులభంగా వుందిగానీ ఈ ఒప్పందానికి వచ్చేలోపు శ్రీకాంత్ హృదయం వందసార్లు గాయపడింది.

ఒక్కడే సర్వం కోల్పోయినవాడిలా బరంపురం వెళ్ళి లక్ష్మణరావుగారికి నమస్కరించి వచ్చేశాడు. తిరుగు ప్రయాణంలో లక్ష్మణరావుగారి 'అతడు-ఆమె' నవల చదువుతూ దుఃఖం పట్టలేక ఏడ్చాడు.

ఆ తర్వాత శ్రీకాంత్ త్వరలోనే జీవితంతో రాజీపడ్డాడు. సుధ తనతో ప్రేమగానే ఉంటుంది. దేనికీ లోటు చెయ్యదు.

'తన ఒంటరితనం ఈ జన్మకు పోదు' అనుకున్నాడు. పెళ్ళైన నాలుగేళ్ళకు లయ పుట్టింది. శ్రీకాంత్‌కు లయ సర్వస్వం అయిపో యింది. తన కథలు, కబుర్లు, సంగీతం, అన్నీ లయకు అర్థమవుతాయో లేదో ఆలోచించ కుండా చెప్పేవాడు.

నాలుగేళ్ళ లయ సైగల్ పాట 'ఇన్ దోమత్ వాలే నయినోమే జాదుహై, జాదుహై' అని పాడుతుంటే మురిసిపోయేవాడు. స్నేహితు లందరినీ పిల్చి కూతురిచేత సైగల్ పాటలు పాడించేవాడు.

అత్త సావిత్రమ్మతో, ఆడపడుచు శారదతో కూడ సుధ ఆత్మీయమైన సంబంధం పెట్టుకో లేదు. ఆ మాటకొస్తే అసలు సంబంధం లేకుండా బతకటానికే ప్రయత్నించింది. శా రద తను పనిచేసే ఆరోగ్యకేంద్రంలో నిజాయి తీగా పనిచేసింది. ఆ ఊరిలోనే ఉండి రాత్రీ పగలూ రోగులను చూసింది. బీదా గొప్ప తేడా లేకుండా అందరికీ ఒకేరకమైన సేవ చేసింది. మందులు అమ్ముకోకపోగా అక్కడ లేని మందులకోసం జిల్లా కేంద్రంతో దెబ్బలాడి తెప్పించింది. ఇంత శ్రద్ధగా వైద్యం చేసేవా ళ్ళు మనదేశంలో ప్రభుత్వోద్యోగాలకు పనికిరా రు. అందుకే ప్రభుత్వం రెండేళ్ళలో శారదను నాలుగూళ్ళు మార్చింది. నాలుగో ఊళ్ళో చాలా పెద్ద గొడవ జరిగింది. ఆ ఊరి ముఠా తగాదా లలో కొట్టుకుని రెండు వర్గాలవాళ్ళూ చచ్చిపో యారు. ఆ కేసులో శారద అధికార పక్షానికి వ్యతిరేకంగా సాక్ష్యం యిచ్చింది. వెంటనే శార దకు శ్రీకాకుళం జిల్లాలో మారుమూల గ్రామాని కి బదిలీ అయింది. మామూలుగా ఎంత మారుమూలకైనా వెళ్ళటానికి శారదకు అభ్యంతరం లేదు. కానీ సావిత్రమ్మకు గుండె జబ్బని అప్పుడే బైటపడింది. తల్లిని అన్నద గ్గర ఉంచి వెళ్ళటానికి శారదకు ఎందుకో మనస్కరించలేదు. ఎందుకో ఏముంది - సుధ ఆమెను సరిగ్గా చూడదని శారదకు అను మానం. గుండెజబ్బున్న తల్లిని తీసుకుని ఆ కుగ్రామం వెళ్ళే ధైర్యం చెయ్యలేక శారద ముందు శలవుపెట్టి హైద్రాబాదు వచ్చింది. స్నేహితులతో సంప్రదిస్తే వాళ్ళు గవర్న మెంటు ఉద్యోగంలో శారద సుఖపడలేదని చెప్పి ఒప్పించి నగరంలో కొత్తగా వస్తున్న పెద్ద ప్రైవేట్ నర్సింగ్ హోంలలో దేనిలోనైనా చే రితే బాగుంటుందన్నారు. తల్లికోసం ఆ పనే చెయ్యక తప్పలేదు శారదకు. ఆమె మెడిసిన్ చదివేటప్పుడు ప్రొఫెసర్‌గా వున్న డాక్టరు ఒక పెద్ద పాలీక్లినిక్ ప్రారంభించాడు. శారద వెళ్ళి అడగగానే ఉద్యోగం యిచ్చాడు. గవర్న మెంటు యిచ్చే జీతంకంటే ఎక్కువే జీతం యిస్తానన్నాడు. ఆస్పత్రి పక్కనే యిల్లు తీసు కుని రాత్రీ పగలూ తనకు తృప్తిగా వుండేలా పనిచేస్తోంది శారద. పోస్ట్‌గ్రాడ్యుయేషన్ లేక పోయినా ఆడవాళ్ళకు సంబంధించి అన్ని జబ్బుల గురించీ శ్రద్ధగా చదివి, తెలుసుకునే వైద్యంచేసేది. క్రమంగా ఆపరేషన్లు కూడా శారదకు అప్పగించారు. శారద తనెంత పనిచే స్తోందో ఎవరూ గమనించలేనంత ఎక్కువ పనిచేసేది. పని తప్ప ఆమెకు మరోలోకం లేదు. శారద హైద్రాబాదులో సెటిల్ అవు తుందనుకున్నప్పుడు శ్రీకాంత్ భయపడ్డాడు. అందరూ కలిసివుంటే సుధ ఏదో ఒక గొడవ సృష్టిస్తుందని అతనికి భయం. అతని భయా న్ని అర్థంచేసుకున్నట్లుగా శారద ఉద్యోగం దొరికిన వెంటనే ఇల్లు తీసుకుని తల్లితో సహా వెళ్ళిపోయింది. సుధకు సావిత్రమ్మతోగానీ, శా రదతోగానీ మరో పేచీ ఏమీలేదు. వాళ్ళుంటే ఖర్చు ఎక్కువవుతుంది. ఇలా ఖర్చులు పెంచుకుంటూపోతే ఇల్లు ఎప్పటికి కట్టుకునే టట్లు?

సుధ పొదుపు ఉద్యమం గురించి చెప్పుకో వాలంటే ఎంత టైమూ సరిపోదు. పదిపైసలు ఆదా చెయ్యటానికి ఎంత కష్టమైనా పడేది. కాలేజీకి తొందరగా వెళ్ళాలంటే రెండు బస్సు లు మారాలి. సరాసరి కాలేజీకి వెళ్ళే బస్సులు చాలా తక్కువున్నాయి. రెండు బస్సులు మారి వెళ్తే అర్ధరూపాయి ఎక్కువవుతుందని పది గంటలకు వెళ్ళాల్సిన కాలేజీకి ఎనిమిదిన్నరకే వెళ్ళేది.

అలా వెళ్ళటానికి తెల్లవారుఝామునే లేచి పనులు చేసుకునేది. మామూలుగా శ్రీకాంత్‌కి




ఇంట్లో పనులు చెయ్యటం అలవాటే. తల్లికి వంటపనిలో శారదకంటే శ్రీకాంతే ఎక్కువ సాయపడేవాడు. కానీ సుధ అర్థరూపాయి మిగల్చటంకోసం చేసే ప్రయత్నం అతనికి దుర్భరంగా వుండేది. దానికోసం తను కూడా తెల్లవారుఝామున లేవటం, పని చేస్తున్నంతసేపూ సుధ పిసినారి తనాన్ని తిట్టుకుంటూ వుండటం, దానివల్ల సుధపట్ల వ్యతిరేకత తన మనసులో పెరిగిపోవటం వీటన్నిటికంటే తను నిద్రపోవటంవల్లనే సంసారం శాంతిగా వుంటుందని గ్రహించాడు. తను మామూలుగా లేచేవేళకి లేచి అప్పుడు తను చెయ్యగలిగిన పనులేమన్నా వుంటే చేసేవాడు. లయకు సంబంధించిన పనులన్నీ లయ నెలల పిల్లగా వున్నప్పటినుంచీ శ్రీకాంతే చేసేవాడు. పిల్లలను పెంచటం, వాళ్ళతో ఎక్కువ టైము గడపటంవల్ల మనం కరడుగట్టకుండా వుంటామనీ, మనలో మానవలక్షణాలు యింకిపోకుండా వుంటాయనీ శ్రీకాంత్ స్నేహితులతో వాదించేవాడు.

సుధ తను అనుకున్నది చివరకు సాధించగలిగింది. హైద్రాబాదుకి ఒక చివర కాస్త చవగ్గానే స్థలం కొన్నది. తను దాచిన డబ్బుకు తోడు అన్నిరకాల లోన్లూ తీసుకుని అందమైన ఇల్లు కట్టించింది. ఇపుడామె ధ్యానంతా ఇంటి ముందు గులాబీ తోట గురించే. ఒక వందగజాల స్థలం దానికోసమే ప్రత్యేకంగా ఉంచింది. గులాబీ మొక్కలను నర్సరీలన్నీ తిరిగి సంపాదించింది. ప్రాణాలన్నీ ఆ తోటమీదే వుంచి పెంచుతోంది.



కొత్త ఇంటికి అందరూ అలవాటు పడిపోయారు. బస్సుల వేళలు బాగా తెలిసిపోయాయి. పాలూ నీళ్ళూ అన్ని సౌకర్యంగానే అమిరాయి. పన్నెండేళ్ళ సంసార జీవితంలో మొదటిసారిగా పనిమనిషిని పెట్టుకుంది సుధ. కిష్టయ్య భార్య ఎల్లమ్మ రోజూ వచ్చి ఇంటిపని చేసి వెళ్తుంది. డబ్బుకిప్పుడు కాస్త వెసులుబాటు రావటమే కాక సుధకు తోటపని అదనంగా వచ్చింది. అందువల్ల ఎల్లమ్మకు రెండు పందలివ్వక తప్పలేదు.

"పోడు డబ్బు పోతే పోనియ్. తోటకంటే ఎక్కువా?" అని సుధ మొదటిసారిగా డబ్బుని చిన్నచూపు చూసింది.

ఆరోజు శ్రీకాంత్ యింకా నిద్ర లేవలేదు. లయ హోంవర్కు వుండటంతో పెందలాడే లేచి బుద్ధిగా పుస్తకాలు ముందేసుకుని కూచుంది. హఠాత్తుగా పెద్దపెద్ద కేకలు విన్పించేసరికి లయ బైటికి పరిగెత్తింది. శ్రీకాంత్ కూడా నిద్రమత్తు ఒదిలించుకుని వచ్చాడు. సుధ పెద్దపెద్దగా అరుస్తూ పోట్లాడుతోంది.

"మీకు కళ్ళు కనపడటంలా. ఈ మొక్కలన్నిటికీ పొద్దునా సాయంత్రం ఎన్ని నీళ్ళు పడతాయనుకుంటున్నారు? ఐనా యిక్కడ మా యిల్లు తప్ప మీకు మరే యిల్లూ కనపడలేదా? నీళ్ళు ఒక్క చుక్క యివ్వను. వెళ్ళండి"

శ్రీకాంత్ సుధ దగ్గరకు వచ్చి "ఏంటి సుధా గోల?" అన్నాడు.

"చూడండి నేను నిద్రలేచేసరికే నీళ్ళు పట్టుకుపోతున్నారు. టాంకు సగం ఖాళీ అయింది"

"పోన్లే ఏదో యిబ్బంది వచ్చివుంటుంది. ఒకరోజు పట్టుకుంటే ఏమవుతుంది? నువ్వు లోపలికి రా"

"ముందు మీరు లోపలికి నడవండి" సుధ కఠినంగా అంది.

శ్రీకాంత్ చిన్నబుచ్చుకున్న ముఖంతో లోపలికి వెళ్ళాడు. లయకూడా తండ్రితోపాటు వెళ్ళింది.

సుధ మరో ఐదు నిమిషాలు వాళ్ళతో పోట్లా

డి తమ ఇంట్లోంచి ఒక్క నీటిబొట్టు కూడా వాళ్ళు సంపాదించలేరని ఘంటాపథంగా చెప్పి లోపలకు వచ్చింది. రాగానే తండ్రీకూతుళ్ళు తనకేదో చెప్పేలా వున్నారనిపించి తనే వాళ్ళమీద పోట్లాడటం మొదలుపెట్టింది.

"అక్కడికి మీరు ధర్మరాజులు. నేనో పాపిష్టి దాన్ని. నేనో మాట వాళ్ళతో చెబుతున్నానుగదా! మీరొచ్చి అదంతా కొట్టిపారేస్తారా? ఇక నాకేమన్నా విలువ వుంటుందా? నీళ్ళు ఎక్కడ్నించి తెచ్చిస్తారు? గులాబీలకు నీళ్ళు లేకుండా చేసి వాటిని చంపేస్తేగాని మీకు శాంతిగా ఉండదా?"

సుధ ఈరకమైన ధోరణిలో ఎంతదూరమైనా వెళ్ళగలదని శ్రీకాంత్‌కు తెలుసు. అతను మాట్లాడకుండా లేచి బాత్‌రూంలోకి వెళ్ళిపోయాడు.

లయమాత్రం తల్లికి సమాధానం చెప్పాలనే అనుకుంది. "మొక్కలకు నీళ్ళు లేకపోతే చచ్చిపోతాయి. మనుమలు చచ్చిపోరా? వాళ్ళకు నీళ్ళొద్దా?"

పదేళ్ళ లయ తనకెదురు మాట్లాడటం సుధ భరించలేకపోయింది.

"హైద్రాబాదులో నీళ్ళులేక చాలామంది చస్తున్నారు. మీ తండ్రీకూతుళ్ళు చలివేంద్రాలు తెరిచి టాంకుల్లో నీళ్ళు సప్లయి చేయండి. మనుమలందరికీ నీళ్లు యిచ్చే బాధ్యత మున్సిపాలిటీవాళ్ళది. బోలెడంత డబ్బు కట్టించుకుని వాళ్ళే నీళ్ళు యివ్వకపోతే నా యింట్లో నా డబ్బుతో నేను కొనుక్కుంటున్న నీళ్ళు నేనెందుకు యిస్తాను. తండ్రీకూతుళ్ళిద్దరూ వెళ్ళి మున్సిపాలిటీవాళ్ళనడగండి. చిన్నపిల్లవి చిన్నపిల్లలాగా వుండకుండా వెధవ తెలివితేటలు. అన్నీ నీకు నేర్పిపెడుతున్నాడు. ముందు స్నానానికి పద. టైము ఎంతయిందో చూసుకున్నావా?"

లయ నిస్సహాయంగా స్నానానికి నడిచింది. తల్లి చెప్పిన మున్సిపాలిటీ సంగతి ఆ పిల్లకు సరిగా అర్థంకాలేదు. తండ్రినడిగి తెలుసుకోవాలనుకుంది. స్కూలుకి వెళ్ళే హడావిడిలో ఆ విషయం మర్చిపోయింది.

సాయంత్రం వచ్చేసరికి శారదత్తా, నాయనమ్మ వచ్చివున్నారు. లయ అన్ని సంగతులూ మర్చిపోయి అత్తతో కబుర్లు చెప్పటం, నాయనమ్మతో కథలు చెప్పించుకోవటంలో పడిపోయింది.

శారద చాలా డల్‌గా వుండటం శ్రీకాంత్, సుధ యిద్దరూ గమనించారు. సుధ - అడిగిన దగ్గర్నుంచీ ఏదో ఒకటి చెయ్యాలి ఎందుకొచ్చిన బాధ. నేలను పొయ్యేదాన్ని తీసి నెత్తిన రాసుకోవటం దేనికి అని తనేమీ గమనించనట్లు ఊరుకుంది. శ్రీకాంత్ అలా ఊరుకోలేకపోయాడు.

రాత్రి భోజనాలయ్యాక లయ నిద్రపోయాక నలుగురూ వరండాలో కూర్చున్నారు.

సుధ అంతూపొంతూ లేకుండా కొత్త యింటికోసం చేసిన అప్పులూ అవి తీర్చే పద్ధతులూ చెబుతోంది. శ్రీకాంత్ యిక లాభంలేదనిమధ్యలో సుధను ఆపి

"ఏంటి అక్కా! చాలా డల్‌గా వున్నావు?" అనడిగాడు శారదని.

"డల్ అని చిన్నగా అంటావేమిట్రా? పదిరోజుల్నించీ తిండి కూడా సరిగా తినటంలేదు. ఇక్కడికి వస్తేనన్నా కాస్త హుషారు వస్తుందని నేనే బలవంతంగా తీసుకొచ్చాను" అన్నది సావిత్రమ్మ.

సుధకు ఇక తనక్కడ వుండకపోవటమే మంచిదనిపించింది.

"నాకు నిద్రొస్తోంది. మీ అక్కాతమ్ముళ్ళు కబుర్లు యిప్పట్లో తెమలవుగానీ నే వెళ్ళి పడుకుంటాను" అంటూ లేచి వెళ్ళిపోయింది.

శ్రీకాంత్ శారదను మళ్ళీ అడిగాడు.

"ఏంలేదురా! మా హాస్పిటల్‌ని అమ్మేశారు"

"ఎవరు? ఎవరికి?" శ్రీకాంత్ ఆశ్చర్యానికి అంతులేదు. హాస్పిటల్‌ని అమ్మటమనే విషయం అతనికి కొత్తగా ఉంది.

"ఒక ఫైవ్‌స్టార్ హాస్పిటల్‌వాళ్ళకి మా ఆస్పత్రిని అమ్మేశారు"

"ఎందుకు?"

"మా ఆస్పత్రిని పెట్టిన డాక్టర్‌గారు యింత పెద్ద హాస్పిటల్ నడపలేకపోతున్నాడు. వాళ్ళు మంచి రేటు యిచ్చి కొంటామన్నారు. అమ్మేశారు"




దీనికేమనాలో శ్రీకాంత్‌కి తెలియలేదు. అంతలో హఠాత్తుగా శ్రీకాంత్‌కి గుర్తొచ్చింది. ఈ అమ్మకాల్లో అక్క ఏమైంది? అక్క ఉద్యోగం పోయిందా?

"మరి నీ ఉద్యోగం?"

"నన్ను కూడా ఆ ఐదు నక్షత్రాలవాళ్ళకు అమ్మేశారు. వాళ్ళు నాకింకా ఎక్కువ జీతం యిస్తున్నారు"

"మరి?"

శ్రీకాంత్ మనసు తేలికపడిందిగానీ ఈ విషయంలో శారద బాధపడటానికి ఏముందో అర్థం కావటం లేదు. హాస్పిటల్ నడవలేక ఆయన అమ్మేశాడు. నడప గలిగిన వాళ్లు కొనుక్కున్నారు. అంతకుముందు అక్కడ పని చేసే డాక్టర్‌ని తీసెయ్యలేదు. పైగా జీతం పెంచారు. మరి శారద బాధేమిటి?

"తీరా అమ్మేసిన తర్వాత మా డాక్టరుగారికి ఊరికే కూచోవాలనిపించలేదు. పక్కనే ఇంకో నర్సింగ్‌హోం తెరిచాడు. అంతకుముందు మా హాస్పిటల్‌కి వచ్చే పేషెంట్లంతా అక్కడికి పోతున్నారు"

శ్రీకాంత్‌కి అక్క దేనికోసం బాధపడుతోందో అర్థం కాలేదు.

"ఈ హాస్పిటల్ చాలా ఖరీదైన హాస్పిటల్. చాలా గొప్పవాళ్లు వస్తారు. వాళ్లు స్పెషలిస్టులతో తప్ప నాతో వైద్యం చేయించుకోరు. నేను స్పెషలిస్టులకు అసిస్ట్ చేస్తూ ఉండాలి. అవతల పేషెంట్లు సరైన వైద్యం లేక చచ్చిపోతున్నారు. రెండు నెలల్లో ఐదుగురు పోయారు. పూర్వం అలా జరిగేది కాదు"

శారద కళ్లల్లో నీరు చూసి శ్రీకాంత్‌కి బాధనిపించింది.

"పోనీ నువ్వు పాత డాక్టర్‌గారి కొత్త హాస్పిటల్‌కే వెళ్తే"

"కుదరదు. హాస్పిటల్ అమ్మేటపుడు నాకూ మా డాక్టర్‌గారికీ చాలా గొడవలయ్యాయి. నేను అమ్మొద్దంటాను, ఆయన అమ్మాలని నిర్ణయించుకున్నాడు. ఆ హాస్పిటల్‌కి నేను ఎంత చేశానో ఆయనకు తెలియదు. మొత్తం నేనే నడిపాను. నేను నడుపుతున్నానని ఎవరికీ తెలియకుండా నడిపాను"

"అదే నీ తప్పు. నువ్విలా వెనకవుండి పనిచెయ్యటం వల్లే ఇవాళ వాళ్లు నువ్వెవరు? నువ్వేం చేశావు? జీతం డబ్బులకోసం చేశావని అనగలుగుతున్నారు" సావిత్రమ్మ శారదను మందలించింది.

"అలా అన్నారా?" శారద ఎంత అంకితమై పని చేస్తోందో తెలిసిన శ్రీకాంత్ ఆశ్చర్యపోయాడు.

"శ్రీదేవి అని నా పేషెంటు ఉంది. పది సంవత్సరాలుగా నేనే ట్రీట్ చేస్తున్నాను. మొన్న ఆమెకు ఆపరేషన్ చెయ్యాల్సి వచ్చింది. ఈ ఐదు నక్షత్రాల హాస్పిటల్ ఖర్చు ఆమె భరించలేదు. నేను ఆ హాస్పిటల్‌కి వెళ్లి ఆపరేషన్ చెయ్యటానికి వీళ్లూ ఒప్పుకోరు, ఆ హాస్పిటల్ వాళ్లూ ఒప్పుకోరు. మా పాత హాస్పిటల్‌లో చేరితే ఎవరి చేతనో చేయించారు. అక్కడికీ నేను బతిమాలి అడిగాను. ఆ కేసు సంగతి నాకు బాగా తెలుసు. నేను చూస్తానని. ఒప్పుకోలేదు. నేను గవర్నమెంటు ఉద్యోగంలో నా శక్తంతా పెట్టి ప్రజలకు సేవ చేస్తానంటే ప్రభుత్వం ఒప్పుకోలేదు. పోనీ ఎవరో ఒకరికి డాక్టరుగా నేను చెయ్యగలిగింది చేద్దామంటే లాభాలపిచ్చిలో పడిన వైద్యరంగం ఒప్పుకోవటం లేదు.

ఇపుడు నేను పని చేస్తున్న హాస్పిటల్‌లో డబ్బుకి తప్ప మరిదేనికీ విలువలేదు. మంచీ, మానవత్వం, సేవ, కొన్ని మోరల్ ఎథిక్స్ ఏమీలేవు. డబ్బు గుంజు... ఇంకా గుంజు, ఇంకా గుంజు. ఇదొక్కటే సూత్రం. ఒక పేషెంట్ మామూలు జ్వరంతో వచ్చినా సరే స్కానింగ్ వరకూ అన్ని పరీక్షలూ చెయ్యందే ఒదలరు. కేవలం డబ్బు కోసమే! నేనక్కడ ఇమడలేకపోతున్నాను శ్రీకాంత్"

శారద బాధేమిటో శ్రీకాంత్‌కిపుడు బాగానే అర్థమయిందిగానీ ఏం చెయ్యాలో తోచటం లేదు. ఉద్యోగం ఒదులుకుని ఏం చెయ్యాలి. ఉద్యోగమంటే ఎక్కడైనా ఇదే పరిస్థితి ఉంటొమ్మ. ప్రాక్టీసు పెట్టాలంటే డబ్బు కావాలి.

"పోనీ ప్రాక్టీసు పెడితే" సందేహంగా అన్నాడు.

"అదే అనుకుంటున్నాను. ఏదైనా ఒక స్ల

మ్‌లో చిన్న క్లినిక్ పెడదామని. కానీ అది కూడా తేలికకాదు. బోలెడంత పోటీ వుంటుంది. ఎన్నో సమస్యలుంటాయి. డాక్టర్ల మధ్య పోటీ వుంటుంది. ఐనా తప్పదులే, స్ట్రగుల్ పడాలి. మన పని మనం చేసుకోటానికి కూడా ఎంతో కష్టపడాలి''

''తమాషా ఏమిటంటే డబ్బు సంపాదించటం కష్టం అనుకుంటారందరూ. బహుశా పాతికేళ్ల క్రితం కష్టమేనేమో. ఇవాళ డబ్బు సంపాదించటం చాలా తేలిక. మనం తల్చుకోవాలంతే. నాకు డబ్బు ముఖ్యం కాదు, నీతినిజాయితీలు ముఖ్యం అనుకునేవాడికి బతకటం కూడా కష్టమవుతుంది. వాడి తిప్పలు తిప్పలు కావు'' శ్రీకాంత్ ఆవేదనగా అన్నాడు.

''నేనదే చెబుతున్నాను. నీకు డబ్బు ఇచ్చినందుకు వాళ్లకు కావాల్సిన పని చేసి హాయిగా వుండు. వాళ్లు ఏం చేస్తే నీకెందుకు? వాళ్లందరినీ మార్చటం మన తరమా? చెప్పాలంటే ఇపుడు జీతం పెరిగింది. పని తగ్గింది. సుఖపడొచ్చుగదా వినదు. అస్తమానం అశాంతి పడుతుంది. ఇపుడు మళ్లీ ప్రాక్టీసంటే మాటలా? కాస్త రాజీపడితే పోలా?'' సావిత్రమ్మ కూతురి సుఖం కోరి కాస్త నిష్ఠూరంగా మాట్లాడింది.

''అందరూ రాజీ పడబట్టే సమాజం ఇట్లా తయారవుతోంది. ఎదిరించగల శక్తీ, వేరే మార్గంలో పోగల శక్తీ వున్నవాళ్లు రాజీపడకూడదమ్మా. అక్కని తనిష్టం ఒచ్చినట్లు బతకనివ్వు. అక్క రాజీ పడకూడదు''



శ్రీకాంత్ మాటలకు శారద ముఖం వికసించింది. మర్నాడు ఉదయాన్నే శారద, సావిత్రమ్మా వెళ్లిపోయారు. శ్రీకాంత్‌ద్వారా శారద సమస్య గురించి తెలుసుకున్న సుధ...

"మీ వంశంలోనే వేపకాయంత వెర్రివుందనుకుంటా. సుఖంగావున్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకోవటం మీకందరికీ అలవాటు. మన సంగతి మనం చూసుకోకుండా వూళ్లో వాళ్లందరినీ ఉద్ధరిస్తామంటారు. ఎందుకీ అశాంతి?" అంది వెక్కిరింపుగా.

"సుధా! మనం మన సంగతే చూసుకుంటున్నాం. శారద వైద్యం తప్ప జీవితంలో మరింకేదీ ఒద్దనుకుంది. తను శాంతిగావుంటానికి అశాంతి పడితే మనం వెక్కిరించటం దేనికి" అన్నాడు కాస్త కటువుగా.

సుధ మరింకేం మాట్లాడలేదు.

★ ★ ★

"లయా లయా! తొందరగా రా!"

తల్లి కేకలు విన్న లయ తోటలోకి పరిగెత్తింది. సుధ ముఖం వెలిగిపోతోంది. తల్లి సంత సంతోషంగా చూసి లయ ఆశ్చర్యపోతూ తల్లి దగ్గరకుచేరింది.

లయను ప్రేమగా దగ్గరకు తీసుకుని

"లయా! అటు చూడు"

సుధ వేలికిందగా చిన్న గులాబీ మొగ్గ. అపుడే మొగ్గగా ఏర్పడుతోంది. ఆకుపచ్చని రేకులు నిండుగా కప్పుకుని ఉంది. లయ సంతోషంతో చప్పట్లు కొట్టింది.

"నాన్నా నాన్నా" హడావుడిగా పిల్చింది. శ్రీకాంత్ వచ్చి చూశాడు. సుధ ముఖంలో సంతోషం, గులాబీ మొగ్గ మీద ప్రేమతో వెలిగే కళ్లూ చూస్తే శ్రీకాంత్‌కు ఆనందమూ ఆశ్చర్యమూ మనసునిండా నిండాయి.

అందరితో విరసంగా మాట్లాడుతూ, విమర్శిస్తూ ఎవ్వరినీ ప్రేమించినట్లు కన్పించని సుధ గులాబీలను ఇంతగా ప్రేమిస్తుందా! ఆమెలో ప్రేమించే గుణం ఉంది. అందరిమీదా ఆ ప్రేమ ప్రసరిస్తే ఎంత బాగుంటుంది. పువ్వుల్ని ప్రేమించగలగటం కూడా తక్కువ సంగతేం కాదుగానీ మమ్మల్ని కూడా అలా అవ్యాజంగా ప్రేమించగలిగితే ఎంత బాగుండు అనుకున్నాడు.

సుధ కళ్లల్లో ప్రేమ కురిపించిన గులాబీ లంటే అతనికి ఎంతో ప్రేమ కలిగింది. వంగి గులాబీ మొగ్గను ముద్దాడాడు. లయ తండ్రిని అనుకరించింది. "ఊరుకోండి... ఒత్తిడి తగిలితే మొగ్గ నలిగిపోతుంది" మృదువుగా వారించింది సుధ.

ముగ్గురూ సంతోషించే విషయాలు వాళ్ల జీవితంలో అరుదు. ఆ అరుదైన క్షణాలను మనస్ఫూర్తిగా ఆనందించాడు శ్రీకాంత్.

సుధ ఆ రోజు పాయసం చేసింది.

"లయ పుట్టిన రోజున నువ్వింత సంతోషంగా వున్నట్టు గుర్తులేదు సుధా" శ్రీకాంత్ పరిహాసం చేస్తే మధురంగా నవ్వింది.

ఆ రోజు కాలేజీకి వెళ్లాలనిపించలేదు సుధకి. ఆ గులాబీ మొగ్గ దగ్గరే కూర్చోవాలనిపించింది. అయిష్టంగా బలవంతంగా కాలేజీకి బయల్దేరింది.

తీరా వెళ్తే కాలేజీలో క్లాసులు జరగలేదు.

విద్యార్థులు సమ్మె చేశారు. లెక్చరర్లందరూ కబుర్లు చెప్పుకుంటూ స్టాఫ్‌రూంలో కూర్చున్నారు. సుధ అందరికీ టీ తెప్పించింది.

"సుధగారు చాలా మారిపోయారండీ" అన్నాడు కెమిస్ట్రీ లెక్చరరు ప్రసాద్.

"కొత్త ఇంట్లోకి అదే స్వంత ఇంట్లోకి వెళ్లాక కాస్త ధైర్యంగా ఖర్చు పెడుతోంది... సహజమే" అంది సునంద.

"ఇంతకీ ఇవాళ విశేషమేమిటి?" ఎవరో అడిగారు

"మా గులాబీ తోటలో మొదటి మొగ్గ వచ్చింది"

అందరూ ఒక్కక్షణం నిశ్శబ్దమై పోయారు. ఎన్నడూ రూపాయి ఖర్చు పెట్టని సుధ, కూతురి పుట్టిన రోజుకు కూడా పార్టీ ఇవ్వని సుధ గులాబీ మొగ్గ కోసం పాతికరూపాయలు ఖర్చుపెట్టి అందరికీ టీ ఇప్పించటమా?

"ఎంత గులాబీ తోటండీ" ప్రసాద్ అడిగాడు.

గృహప్రవేశం లేకుండానే ఇంట్లోకి వెళ్లిన





సుధ ఇల్లు చూసినవాళ్లు చాలా తక్కువ మంది.

"పెద్దదే... ఒక వంద గులాబీ మొక్కలు ఉంటాయి" సునంద సమాధానానికి మళ్లీ అందరూ ఆశ్చర్యపోయారు.

వంద గులాబీ మొక్కలు పెంచటానికి నెలకి ఎంత ఖర్చవుతుంది. సుధ అంత ఖర్చు గులాబీ పూల కోసం చేస్తుందా?

"అన్ని గులాబీ మొక్కలు పెంచటం చాలా ఖర్చూ, శ్రమా కదండీ" రంగారావనే లెక్చరర్ ఆపుకోలేక అడిగాడు.

"ఖర్చేనండీ... ముందు మొక్కలు కొని నాటటానికీ ఎరువుకే పదివేలదాకా ఖర్చ యింది. ప్రతినెలా ఏదో ఒక ఖర్చుంటుంది. తోటపని నేనే చేస్తాననుకోండి" సుధ ఉత్సా హంగా చెప్పింది.

అందరూ ఆ రోజు సుధను చాలా కొత్తగా చూశారు. "మీ వారు పుస్తకాలకూ, స్నేహితు లకూ డబ్బు తగలేస్తారని అంటావు నీకున్న పిచ్చి తక్కువదా" అంది సునంద చనువుగా.

మొదటిసారిగా భర్త మీద సానుభూతి కలి గింది సుధకు.

ఈ తోటకోసం ఎంత డబ్బు ఖర్చయినా ఎందుకిదంతా అనలేదు. చాలా సహకరించా డు. వీళ్లంతా ఆశ్చర్యపడినట్లు ఆశ్చర్యపడలే దు.

"గులాబీ తోటకు పదివేలు ఖర్చవుతుంది" అంటే నవ్వి వూరుకున్నాడు.

"శ్రీకాంత్ మంచివాడే" సుధ తన ఆలోచ నకు తనే ఆశ్చర్యపడింది.

"ఇకనుంచీ మన లేడీ స్టాఫ్‌కి గులాబీలకు కొరత లేదన్నమాట" ప్రసాద్ నవ్వుతూ అన్నా డు.

"అదేం లేదండోయ్. నేను ఒక్క పువ్వు కూడా కొయ్యను. ఆఖరికి మా అమ్మాయైనా సరే పువ్వు ముట్టుకోటానికి లేదు"

క్షణం ముందు సుధ ముఖానికీ ఇప్పటి సుధ ముఖానికీ చూడగలిగిన వాళ్లకు ఎంతో తేడా కనిపిస్తుంది.

"అదేంటి మీరు కరుణశ్రీ శిష్యులా?" తెలు గు లెక్చరర్ అడిగాడు.

"ఎందుకలా అడుగుతున్నారు?" సుధకు సాహిత్యం గురించి ఏమీ తెలియదు.

"ఆయన రాసిన పుష్పవిలాపం చదివి ప్రభావితులయ్యారేమోనని"

"నేనేం చదవలేదు. పువ్వులు ముఖ్యం. గులాబీ పువ్వులు కొయ్యటం నాకు ఇష్టం వుండదు"

ఇంతలో ఎవరో పుష్పవిలాపంలో పద్యాలు పాడటం మొదలు పెట్టారు. కాసేపటికి బెల్ కొట్టారు. సుధ ఇంటికొచ్చి తాళం కూడా తియ్య కుండా గులాబీ మొగ్గను తనివిదీరా చూసు కుంది. ఆ తర్వాత నాలుగు ఉదయాలు సుధకూ శ్రీకాంత్‌కూ లయకూ మర్చిపోలేని ఉదయాలయ్యాయి. ముగ్గురూ గులాబీ మొగ్గ దగ్గర చేరి అది ఎంత పెరిగిందో అంచనా వేసేవారు. నిజంగానే నాలుగు రోజుల్లోనే మొ గ్గలో చాలా మార్పు వచ్చింది. లావయింది. ఆకు పచ్చని రేకల్లోంచి అతి సన్నగా లోపలెక్క డినుంచో ఎర్ర రంగు కనిపిస్తోంది. ముగ్గురూ కలిసి సంతోష పడేవారు. ముగ్గురి మధ్యా ఎంతో సామరస్యం ఏర్పడింది. ఆ నాలుగు రోజులూ సుధ ఎవరినీ కసురుకోలేదు.

నాలుగో రోజు సాయంత్రం సుధ అందరి కంటే ముందు వచ్చింది. ఇంట్లోకి వెళ్లి కాళ్లూ చేతులు కడుక్కొని గులాబీ మొగ్గను చూద్దా మని వెళ్లింది.

సుధ గుండె ఆగినంత పనయింది.

గులాబీ కొమ్మకు మొగ్గలేదు. సుధ కళ్లు కొమ్మలన్నింటినీ పిచ్చిగా గాలించాయి.

ఎక్కడా మొగ్గ జాడేలేదు. సుధ కంగారుగా అటూ ఇటూ చూసింది.

ఆ మొక్కకు రెండడుగుల దూరంలో నేల మీద పడివుంది.

నలిపేసి విసిరేశారు. చిన్ని మొగ్గను తుంపి ఆకుపచ్చ రక్షక పత్రాల్ని బల వంతంగా చీల్చి మొగ్గను నలిపేసి అక్కడ పడేశారు.

సుధకు కోపంతో దుఃఖంతో పిచ్చెక్కిపో యింది. నోటమాట రావటం లేదు. ఒణికిపో తోంది. అతి ప్రయత్నం మీద ఇంట్లోకి నడి

చింది.

తన కల నిజంకాదా? గులాబీ పూలు తన తోటలో వికసించవా?

ఎవరికి తన మీద ఇంత కసి? ఎవరా రాక్షసులు? ఇక ప్రతి మొగ్గనూ అలాగే చేస్తారా? తన తోటలో పూలు వికసించవా?

వెక్కివెక్కి ఏడ్చింది సుధ.

శ్రీకాంత్, లయ వచ్చి సుధను చూసి ఆశ్చర్యపోయారు. ఎర్రబడ్డ కళ్లతో, అలిసిన శరీరంతో విరిగిన గులాబీ కొమ్మలా వుంది సుధ.

"సుధా! ఏమైంది?"కంగారుగా అడిగాడు శ్రీకాంత్.

సుధ చిన్న పిల్లలా బావురుమంది. తల్లి ఏడుపు చూసి లయ ఏడుపు మొదలెట్టింది.

సుధను సముదాయించి కారణం తెలుసుకున్న శ్రీకాంత్ కాస్త రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

"మొగ్గను ఎవరో తుంచారని ఇట్లా ఏడుస్తారా?" అంటున్న శ్రీకాంత్‌ను దుర్మార్గుడిని చూసినట్లు చూసింది.

శ్రీకాంత్ తప్పు తెలుసుకుని దిద్దుకున్నాడు.

లయ తోటలోకి వెళ్లి ఆ మొగ్గను తీసుకొచ్చింది. ముగ్గురూ విషాదంగా ఆ మొగ్గను చూస్తూ కూచున్నారు.

"మన తోటలో పూలు ఎలా పూస్తాయండీ"

సుధకు ఎంత కంట్రోల్ చేసుకుందామన్నా దుఃఖం ఆగటం లేదు.

"తోటకు కాపలాగా ఎవర్నన్నా పెడదాంలే" శ్రీకాంత్ ఓదార్చాడు.

"కాపలా పెట్టటమంటే మాటలా? పగలంతా కాపలా కాసినందుకు జీతం ఎంతడుగుతారు? మనం ఇవ్వగలమా? ఇప్పటికే ఆ తోటకు బోలెడు ఖర్చవుతోంది" సుధకు మాటలు పెగలటం కూడా కష్టంగా వుంది.

"చూద్దాం... ఎవరు దొరుకుతారో, ఎంతడుగుతారో విచారిస్తే గదా తెలిసేది. పనేం ఉంటుంది, ఉదయం పది గంటల నుంచీ సాయంత్రం ఐదింటిదాకా ఏ ముసలమ్మైనా కాస్త తోటలో తిరుగుతుంటే చాలు. దొరకచ్చు. నువ్వు మరీ అంత నిరాశపడకు" ఓదార్చాడు.

ఆ రోజు శ్రీకాంత్, లయ ఎంత బతిమాలినా సుధ భోజనం చెయ్యలేదు.

★ ★ ★

మర్నాడు ఉదయం పనిలోకి వచ్చిన ఎల్లమ్మకు జరిగిన సంగతి చెప్పింది సుధ. ఎల్లమ్మ మొగ్గ కోసిన వాళ్ల చేతులు విరిగి తీరతాయనీ, ఆ ఉసురు తగిలి తీరుతుందనీ శాపనార్థాలు పెట్టింది. "సరేలేవే వాళ్లెలాగో చస్తారు. మన తోట సంగతి మనం చూసుకోవాలిగా? కాపలాకు ఎవరన్నా దొరుకుతారేమో చూద్దూ" అంది సుధ.

"కాపలా మనిషా? చానా అడుగుతారమ్మా' అంది ఎల్లమ్మ ఆలోచనగా.

"ఎంతడుగుతారే" సుధ భయంగా అంది.

"ఎంతేంటమ్మా కూలికి పోతే రోజూ ముప్పై రూపాయలు దొరుకుతాయి. తోట కాపలాకు మీరు అంతివ్వలేరు. ఆ కూలీ ఒదులుకుని ఈ పనికి ఎవరొస్తారు?"

"రోజుకి ముప్పై రూపాయలు కూలీ!" సుధ నిరాశతో కుంగిపోయింది.

"ఎవరన్నా ముసలాళ్ళు దొరకరా?"

"చూస్తానమ్మా - మా ఆయనకి చెబితే ఎవర్నన్నా చూస్తాడేమో" ఎల్లమ్మ తనపనిలో పడిపోయింది.

సుధకు ఈ విషయం ఏదో ఒకటి తేలేదాకా కాలూ చెయ్యీ ఆడేలా లేదు.

ఎల్లమ్మ వెనకే తిరుగుతూ ఈ కాపలామనిషి ఎంత ముఖ్యమో ఎల్లమ్మకు విసుగుపుట్టేదాకా చెప్పింది. ఎల్లమ్మకు కాపలామనిషి చింతకంటే అమ్మగారి పోరు ఎలా తప్పించుకోవటమా అనే చింత పట్టుకుంది. వారం గడిచినా ఎవరూ ఇదిగో కాపలా పని చేస్తానని రాలేదు. ఈలోపల తోటలో ఇరవై చెట్లకు మొగ్గలొచ్చాయి.

మొగ్గలను చూస్తున్నకొద్దీ సుధకు సంతోషం కంటే దిగులూ, ఆరాటం ఎక్కువయ్యాయి.

ఆ దిగుల్లో, ఆరాటంలో సుధకు సత్తెమ్మ ఆశాకిరణంలా కనిపించింది.

సత్తెమ్మ ఎల్లమ్మ కూతురు. ఎనిమిదేళ్ళ పిల్ల. చూడటానికి ఆరేళ్ళదానిలా కనిపిస్తుంది. నల్లగా సన్నగా తొర్రిపళ్ళతో వున్న సత్తెమ్మ ఓ రోజు తల్లితోపాటు పనికి వచ్చింది.




తల్లి తోమి కడిగిన అంట్లగిన్నెలు లోపల పెట్టింది. బట్టలకు సబ్బు రాసింది. ఎల్లమ్మ జాడించిన బట్టలన్నీ ఆరేసింది. సత్తెమ్మను చూస్తున్నకొద్దీ సుధ మనసులో ఆశ పెరిగింది. చివరకు ఎల్లమ్మ వెళ్ళిపోయేవేళకు మనసులో ఒక నిర్ణయం చేసుకుంది.

"ఎల్లమ్మా! నీ కూతురు ఏం పనికి పోతుందే" అని అడిగింది.

"చిన్నముండ. అదేం పనిచేస్తదమ్మా" అంది ఎల్లమ్మ.

"అలాగైతే నీ కూతుర్నే కాపలా పనికి పెట్టరాదటే" అడిగేసింది సుధ.

"దానికేం చేతనవుద్దమ్మా?"

"ఏముంది చేతనవటానికి... పగలు తోటలో ఎవరో ఒకరు తిరుగుతుంటే చాలు. పోకిరీవాళ్ళు రారు. మరీ ఎవరూ లేరనుకుంటే మొక్కలు కూడా బతకనివ్వరు. పోనీ ఒక నెల చూద్దాం"

ఎల్లమ్మ ఆలోచనలో పడింది. పగలంతా నీడపట్టున కూచోకుండా తోటలో తిరగాలి. అంతా చేస్తే ఈమె జీతం ఎంతిచ్చేనూ? యాభై రూపాయలైనా యిస్తుందా?

"ఏంటే మాట్లాడవు. పొద్దుగూకులూ తోటలో తిరగక్కర్లా. వరండాలో కూచుని తోటవంక చూస్తున్నా చాలు. రోజుకి రెండ్రూపాయలిస్తాను. అంతకంటే నేనివ్వలేను"

ఎల్లమ్మకు నెలకు అరవై రూపాయలు సత్తెమ్మ తెస్తుందంటే ఫరవాలేదనిపించింది. అయినా తొందరపడకుండా "దాన్నే అడగండమ్మా ఒప్పదేమో. అది ఒట్టి మొండిముండ. దానికిష్టమైతే తప్ప ఎవరు చెప్పినా చెయ్యదు" అన్నది.

"ఏమే! రోజూ మా తోటకు కాపలా ఉంటావా?"

తల దించుకు నుంచున్న సత్తెమ్మను గదమాయించింది. సత్తెమ్మ దించిన తల ఎత్తలేదు.

"చెప్పూ. మూగమొద్దులా నిలబడతావేం?" అసహనంగా అంది సుధ.

సత్తెమ్మ కళ్ళెత్తి ఒకసారి సుధను చూసి మళ్ళీ కళ్ళుదించి నేలను చూస్తూ నిలబడింది.

"ఏంటే నీ కూతురి ఉద్దేశం. పెద్ద రాణీగారిలా మాట్లాడదేంటి?" చిరాకుపడింది.

"అదంతేనమ్మా- నేను నచ్చజెప్పి పంపిస్తాలే - పదవే" అంటూ కూతుర్ని తీసుకుని వెళ్ళిపోయింది ఎల్లమ్మ.

సుధ పనివాళ్ళ పొగరుమోతు తనాన్ని గురించి తనలో తను గొణుక్కుంటూ వంటపని కానిచ్చింది. లయను స్కూలుకి పంపి, శ్రీకాంత్‌ను ఫాక్టరీకి పంపి తను తయారై ఇంటికి తాళంపెట్టి వెనక్కు తిరిగి చూస్తే అక్కడ సత్తెమ్మనుంచునివుంది. సుధకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది.

"ఐతే నువ్వు పన్లోకి వస్తున్నావటే?"

సత్తెమ్మ కళ్ళెత్తి చూసింది.

"నీతో యిదొక గోల గాబోలు. మాట్టాట్టానికి ఏం రోగం. ఔననో కాదనో చెప్పొచ్చుగా"

సత్తెమ్మమాత్రం మాట్లాడలేదు. తల మరింత కిందకు దించుకుని నిలబడింది.

సుధ చేసేది లేక సత్తెమ్మకు తను చెప్పదల్చుకున్న జాగ్రత్తలన్నీ చెప్పి కాలేజీకి టైమవుతోందని పరిగెడుతున్నట్టే నడిచింది బస్‌స్టాప్‌కి.

ఎలాగో ఈ సత్తెమ్మ పుణ్యమా అని తోటలో కాస్త పూలు నిలబడితే చాలు. అది మాట్లాడితే నాకెందుకు మాట్లాడకపోతే నాకెందుకు? ఒక వైపు మొగ్గలు పెరిగి పెద్దవవుతున్నాయి. ప్రతి రోజూ వాటినొదిలి బైటికి రావటమంటే ప్రాణాంతకంగా ఉంది. ఇవాళనుంచీ కాస్త నిశ్చింతగా ఉండగలిగితే అదే పదివేలు అనుకుంది.

సుధ వెళ్ళిపోయాక సత్తెమ్మ గులాబీ మొక్కలవంక చూస్తూ కూచుంది. అక్టోబరు నెల. హైదరాబాదు వాతావరణం చల్లగా వుంది. పది గంటలవుతున్నా చల్లటి గాలితో ఉదయపు ఆహ్లాద వాతావరణం యింకా వుంది. సత్తెమ్మ సంతోషంగా గాలికి వూగుతున్న మొక్కలవంక చూసింది.

చూడగా చూడగా ఒక మొక్క కొమ్మల చేతులు చాపుతూ తననే పిలుస్తున్నట్లు అని

పించింది నత్తెమ్మకు. మెల్లగా లేచి ఆ మొక్క దగ్గరకు వెళ్ళింది.

"ఏంటి?" అనడిగింది.

మొక్క ఈసారి అడ్డంగా ఊగింది.

"ఏంలేదా? ఊకే పిల్చావా?" నత్తెమ్మ అడిగింది. ఔనన్నట్లు కొమ్మలు ఊగాయి.

"నేనంటే నీకిష్టమేనా?" నత్తెమ్మ గులాబీని అడిగింది. గులాబీ మొక్కలో కదలిక లేదు.

నత్తెమ్మ ముఖం చిన్నబోయింది.

"చెప్పు. నేనంటే నీకిష్టమేనా?" మళ్ళీ అడిగింది.

ఈసారి గులాబీ చాలా గట్టిగా ఊగింది. నత్తెమ్మ కిలకిలా నవ్వింది.

"మా అమ్మక్కూడా నేనంటే యిష్టం. మా అయ్యకూ యిష్టం. నేను అన్నం తిన్నాను. అమ్మ ఇంటికి తాళంవేసింది. పనికి ఎల్లింది. పని చానా కష్టం. చేస్తానే ఉండాలి. కూసేపు కూచున్నా మేస్త్రీ ఊకోడు. తిడతాడు. మేస్త్రీ అంటే నాకిష్టంలే" నత్తెమ్మ అంతూపొంతూ లేని కబుర్లు చెప్పటం మొదలుపెట్టింది.

ఆనాటినుంచీ గులాబీ మొక్కలతో నత్తెమ్మకు స్నేహం కుదిరింది. నత్తెమ్మకు తెలిసిన సంగతి ఏదైనా గులాబీలకు తెలియాల్సిందే. క్రమంగా సాయంత్రం మొక్కలకు నీళ్ళు పోసే పనికూడా నత్తెమ్మ మీదేపడింది. ఎంత చీకటి పడినా మొక్కలన్నిటికీ నీళ్ళుపోసిగాని ఇంటికి వెళ్ళేది కాదు. చూస్తుండగానే మొగ్గలన్నీ పూలయ్యాయి.

సుధ సంగతి తెలిసిన లయ పూలు కోస్తానని ఎప్పుడూ అనలేదు. నత్తెమ్మకు ఎప్పుడన్నా ఓ పువ్వు కోసుకోవాలనిపించినా ధైర్యం చాలేదిగాదు. పూలను తాకి, వాసన చూసి, ముద్దు పెట్టుకుని తృప్తిపడేది.

అనేక రంగుల గులాబీలతో తోట మనోహరంగా ఉంది. ఆ వీధిలో అందరి కళ్ళూ ఆ తోటమీదనే. అటువైపుగా వచ్చినవారెవరైనానరే ఒక్క క్షణం ఆగి తోటను చూసే ముందుకు వెళ్తారు.

ఎర్ర గులాబీలలో అన్ని పేర్లూ ఆ తోటలో ఉన్నాయి. తెల్ల గులాబీలు చెప్పే పనిలేదు. గుత్తులు గుత్తులు పూస్తున్నాయి. కాషాయ రంగు గులాబీలు ఎంత ఠీవీగానో వికసిస్తాయి.

వీటన్నిటినీ చూసి సుధ గర్వంతో, ఉబ్బి తబ్బిబ్బవుతుంది. అన్ని రంగులూ దొరికాయి గానీ పచ్చ గులాబీలు లేకుండా పోయాయి. పచ్చ గులాబీనే అని నమ్మకంగా యిచ్చిన మొక్కలు తెల్ల గులాబీలయ్యాయి. ఈసారి సీజన్లోనన్నా పచ్చగులాబీలు సంపాదించాలి అని లేనివాటికోసం దిగులుపడటం కూడా సుధకు అలవాటయింది.

తోట నిండుగా పూలు వుండటతో యిరుగు పొరుగువాళ్ళ తాకిడి బాగా ఎక్కువైంది. వచ్చి తోటను మెచ్చుకుని రెండు పూలిమ్మన్నట్లు చూసేవాళ్ళు. సుధ ఆ చూపులను లక్ష్యపెట్టేది గాదుగానీ ప్రతివాళ్ళూ అట్లాగే చూడటంతో చిరాకుపడేది సుధ. పక్కింటి మాణిక్యవల్లి చూపెప్పుడూ ఈ పూలమీదే ఉండేది.

మాణిక్యవల్లి వాళ్ళకు కూడా తోట వుంది. సొంత ఇల్లు కాకపోయినా పూలమొక్కలు బాగానే పెంచారు. అరటిచెట్లూ, జామచెట్టు, మామిడిచెట్టు వీటితో ఇల్లంతా చల్లగా ఉంటుంది.

చామంతులూ, కనకాంబరాలు, జాజిపూలూ విపరీతంగా పూస్తాయి. క్రోటన్ మొక్కలకూ కరువు లేదు. గులాబీ మొక్కలు కూడా రెండున్నాయి. కానీ మాణిక్యవల్లి సుధ గులాబీ తోటను చూసి అసూయపడేది. ఆ అసూయను దాచుకోవాలని కూడా చూసేది కాదు. రకరకాలుగా సుధను నొప్పించేది. చివరకు "స్వంత యిల్లయితే నేనూ పెంచేదాన్నే - ఈయన వున్నాడంటే ఇల్లు కట్టుకుందామన్న ధ్యాసే వుండదాయె! నాకే గులాబీ తోటవుంటే వాళ్ళనీ వీళ్ళనీ పూలకోసం దేబిరించాల్సిన ఖర్మేం".

ఇలా అర్థంపర్థంలేని మాటలన్నీ మాట్లాడేది. సుధకు మండిపోయి తిట్టేది.

సుధ కోపం, తిట్లూ శ్రీకాంత్‌కి చిరాగ్గా వుండేవి. "గులాబీలను చూసి ఆ కొత్తలో నాలుగురోజులు ఏం ఆనందించావో... రానురాను నీలో అశాంతీ అసహనం పెరిగిపోతున్నాయి - వాళ్ళని తిడుతూ, వీళ్ళను తిడుతూ యింకా ఆ పూలెందుకు నీకు?" అని కసురుకున్నాడు శ్రీకాంత్.




సుధ ఆ మాటల్ని బొత్తిగా లక్ష్యపెట్టలేదు. ఇరుగుపొరుగువాళ్ళతో యుద్ధంచేసి పూలను రక్షించుకునే ప్రయత్నంలో పూర్తిగా మునిగిపో యింది. ఇంట్లో వున్నంతసేపు ఎవరిమీదో ఒక రిమీద చిటపటలాడుతూనే ఉండేది. గులాబీ లను నిజంగా ఆనందించేది సత్తెమ్మ ఒకతే. సత్తెమ్మ పూలతో మాట్లాడటమే కాదు. పూలమ ధ్య స్నేహాలు కలిపేది. వైరాలు సృష్టించేది. పెళ్ళిళ్ళు చేసేది. వాటిని మందలించేది. ముద్దుచేసేది. సత్తెమ్మకు పూలతో వున్న ఈ స్నేహం మరెవరికీ తెలియదు.

★ ★ ★

పది గంటలవేళ. కాలేజీ అంతా నందడి నందడిగా వుంది. దీపావళి సెలవుల తర్వాత మొదటిరోజు. విద్యార్థులకు క్లాసులకు వెళ్ళా లనే తొందరకంటే స్నేహితులతో శలవురోజుల కబుర్లు చెప్పుకుందామనే ఉంది. ఎక్కడంటే అక్కడ గుంపులు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు. నవ్వులూ, కేరింతలూ, చప్పట్లతో కోలాహలంగా ఉంది. ఆ కోలాహలా నికి ఆశ్చర్యపడుతూ ఆ గుంపుల్ని తప్పించు కుంటూ వస్తోంది జయ.

ప్రిన్సిపల్ రూంకోసం అటూ యిటూ తిరిగి వెతుకుతోంది. అంతలో సుధ అటుగా వచ్చింది.

జయ గబగబా వెళ్ళి ''ప్రిన్సిపల్ రూం ఎక్కడండీ?'' అని అడిగింది.

అడిగాకగానీ సుధ ముఖంవంక తేరపార చూడలేదు. ఈలోపల సుధ జయను గుర్తుపట్టే సింది.

''జయా! ఏంటిలా... యిన్నాళ్ళకు?'' అని జయ చెయ్యి పట్టుకుంది.

''నువ్వు ఈ కాలేజీలో వున్నావా? నాకూ యిక్కడే ఉద్యోగం వచ్చింది'' జయ నవ్వుతూ చెప్పింది.

ఇక ఆ తర్వాత జరగాల్సిన పనులన్నీ చకచకా జరిగిపోయాయి. సుధతోపాటు ప్రిన్సి పల్ రూంకి వెళ్ళి జాయినింగ్ రిపోర్టు యిచ్చింది. సుధ జయను స్టాఫ్ అందరికీ పరిచయం చేసింది.

ఆరోజు క్లాసు తీసుకోకుండా జయతోనే తిరి గింది. జయకు యింకా టైమ్‌టేబిల్ వెయ్యలే దు.

''క్లాసుకు వెళ్ళకపోయినా ఫరవాలేదా?'' జయ ఆశ్చర్యంగా అడిగింది.

''ఏం ఫరవాలేదు. పిల్లలు సంతోషిస్తారు. ఐనా నేను సామాన్యంగా ఒదలను. కొందరున్నా రు. ఏడాదికి పాతిక క్లాసులు కూడా తీసుకోరు. ఆడవాళ్ళు అలా వుండర్లే''

''క్లాసులు తీసుకోకుండా ఏంచేస్తారు?''

''ఏదో ఒకటి చేస్తారు. చాలామంది బిజినెస్ లు చేస్తారు. ఇప్పుడు షేర్ల గోలొకటి వచ్చిప డిందిగా. అందరూ అవే కబుర్లు''

జయ విస్తుపోయింది. పదేళ్ళపాటు ఉద్యోగం చెయ్యకుండా యింటిపట్టున వున్న జయకు కాలేజీ విద్యలో వచ్చిన మార్పు యింత దారుణంగా వుందని తెలియదు. లెక్చరర్లు బిజినెస్‌లు చేస్తూ పాఠాలు చెప్ప టంలేదంటే ముందు నమ్మలేకపోయింది.

''సరే! ఈ గోలకేంగానీ. నీ విశేషాలు చెప్పు. ఈ పదేళ్ళూ ఏం చేశావు?''

''పిల్లలిద్దర్ని కనిపెంచాను. అంతకంటే యింకేం చెయ్యాలి?'' నవ్వింది జయ.

''పిల్లలు పెద్దవాళ్ళయ్యాక ఉద్యోగం చె య్యాలనిపించింది. రెండేళ్ళుగా ప్రయత్ని స్తుంటే చివరికి యిప్పుడు దొరికింది''

''మీ ఆయనేం చేస్తాడు?''

''ఆయన బాంకు మేనేజర్... కాకినాడలో. జూన్‌నాటికి హైదరాబాదు ట్రాన్స్‌ఫర్ వస్తుందంటున్నాడు. ఈ ఏడెనిమిది నెలలు నాకు స్వేచ్ఛ. పిల్లల్ని కూడా వచ్చే ఏడాదే యిక్కడ స్కూల్లో చేరుస్తా. ఇప్పుడు మా అమ్మ కాకినాడ వచ్చి పిల్లల్ని చూసుకుంటోంది. మా బాబాయిగారు యిక్కడే వుంటున్నారు. ఎండా కాలం వచ్చేవరకూ అక్కడే మకాం. ఆ తర్వాత యిల్లు వెతుక్కోవాలి'' గబగబా వివరాలన్నీ చెప్పేసింది.

''మీ బాబాయిగారింట్లో ఫోన్ వుందా?'' అడిగింది సుధ.

''ఉంది. ఎందుకు?''

''ఉంటే వెంటనే ఫోన్‌చేసి ఆలస్యంగా వస్తానని చెప్పు. మా ఇంటికి వెళ్దాం. నిన్ను

క్షేమంగా మీ ఇల్లు చేర్చే బాధ్యత నాది''

జయ వెంటనే ఒప్పుకుంది. ఇద్దరూ కలిసి ఫోన్‌చేశారు. సుధ దారిపొడుగునా ఇల్లు కట్టుకోటానికి తను పడిన శ్రమ గురించి చెబుతూనే వుంది. గేటు తీసుకుని లోపలకు అడుగుపెట్టిన జయ అలాగే నిలబడిపోయింది.

వెనక సుధ విజయగర్వంతో నిలబడి వుంది. జయ ఆశ్చర్యంతో వెనక్కు తిరిగి సుధను చూసింది.

''సుధా! సాధించావా చివరికి?''

సుధ చిరునవ్వు నవ్వింది.

''జయా! నీకు గుర్తుందా?''

''ఉంది. ఇవాళ నీ గులాబీ తోటను చూస్తుంటే యింకా బాగా గుర్తొస్తోంది. అప్పుడు మనకి ఎన్నేళ్ళుంటాయి. ఎనిమిదేళ్ళు?''

సుధ ఔనన్నట్లు తలూపింది.



ఎనిమిదేళ్ళ సుధ, జయ స్నేహితులు. రైలుపెట్టెల్లా వున్న ఇళ్ళల్లో పక్కపక్కనే ఉండేవారు. ఇద్దరివీ బీద కుటుంబాలే. సినిమాలూ షికార్లూ వాళ్లకు తెలియవు. బడినుంచి రాగానే ఇంటిపక్క ఖాళీస్థలంలో ఆడుకునేవాళ్ళు. కలిసి చదువుకునేవాళ్ళు. ఒకరోజు సాయంత్రం వాళ్ళ ఆటలు హఠాత్తుగా ఆగిపోయాయి. ఆ ఖాళీస్థలం చూడటానికి బోలెడు మంది మనుషులు కార్లలో వచ్చారు. ఎంతకూ పోరు. చీకటిపడేదాకా ఆ కార్లచుట్టూ తిరిగి ఇళ్ళు చేరారు జయ, సుధ. మర్నాడు సాయంత్రం చూస్తే ఏముంది? లారీల నిండుగా ఇసుక, పెద్దపెద్ద రాళ్ళూ ఆ స్థలంలో తెచ్చిపడేశారు. జయ, సుధ కొత్త ఆటవస్తువులు దొరికినంత సంబరంగా ఇసుక కుప్పలెక్కి ఆడారు. కానీ క్రమంగా వాళ్ళ ఆటలు ఆగిపోయాయి. ఖాళీస్థలంలో అందమైన బంగళా తయారవుతోంది. ప్రహరీ గోడ కట్టారు. లోపలికి ఎవర్నీ రానీయటంలేదు. జయ, సుధ ఆటలు మానేసి ఆ బంగళా గురించి కొన్నాళ్ళు కబుర్లు చెప్పుకున్నారు. కలలు కన్నారు. ఆ బంగళాలో తమంత వయసున్న అమ్మాయి వుంటే ఆ అమ్మాయి తమ స్కూల్లోనే చదివితే ఆ అమ్మాయితో స్నేహం చెయ్యాలనీ, బంగళా లోపలంతా తిరిగి చూడాలనీ అనుకున్నారు. వాళ్ళు కలలు కంటుండగానే బంగళా తయారయింది. ముందు చక్కని తోట తయారయింది. ఆ తోటలో రంగురంగుల గులాబీ చెట్లు. జయ, సుధ సాయంత్రపు ఆటలు మర్చిపోయి ఆ బంగళానూ, తోటనూ చూస్తూ ఆ బంగళానొక రాజమహలుగా, ఆ తోటను ఉద్యానవనంగా వూహిస్తూ ఎన్నెన్నో కథలు చెప్పుకునేవారు. కొన్నాళ్ళకు ఒక రాకుమారి ఆ బంగళాలో వచ్చి చేరింది. ఆమెది కూడా సుధ వయసే. కానీ ఆ రాకుమారి ఈ పిల్లలతో స్నేహం చేయలేదు సరికదా కనీసం కన్నెత్తి చూడలేదు. ఆ రాకుమారి చూపుల్లో పడాలని ఆమె కారుదిగే సమయానికి జయ, సుధ వెళ్ళి కారుపక్కనే నిల్చునేవారు. ఒక్కరోజు కూడా రాకుమారి ఇటు చూడలేదు. చివరికోరోజు చూసింది.

ఈ పిల్లలు ఆ చూపును ఎన్నడూ ఎరగరు.

వాళ్ళనెవరూ అలా చూడలేదు.

వాళ్ళూ యింకెవరినీ అలా చూడలేదు.

అసహ్యం, తృణీకారం నిండిన ఆ చూపు అర్థంకాక ఈ పిల్లలిద్దరూ అయోమయంలో పడ్డారు.

సుధ కొంతసేపు అలా చూడటానికి ప్రయత్నం చేసింది. సరిగా కుదరలేదు.

ఇంతలో జయ ''నువ్వలా చూస్తే నేను నీ జట్టు ఉండను'' అంది.

సుధ ఆ ప్రయత్నం మానేసింది. ఇద్దరూ కలిసి ఆలోచించి అట్లా చూస్తే 'నేను మీ జట్టు ఉండను' అని అర్థమని చెప్పుకుని సంబరపడ్డారు. రాజకుమారితో స్నేహం కుదరదని తెలి




శాక వాళ్ళ దృష్టి తోటలో పూలమీద పడింది. ఎలాగైనా చెరొక్క గులాబీని కోసుకోవాలి. ఆ ఇంట్లో నౌకర్లని అడగటానికి కూడా ఈ పిల్లలకు ధైర్యం చాలలేదు.

రోజులతరబడి ఆ గేటు దగ్గర నిలబడి పూలను చూసీచూసీ చివరికోరోజు గేటు దాటారు. గేటు ఎందుకో గాని తాళం పెట్టిలేదు. పైగా ఓరగా తీసి వుంది.

ఇద్దరూ నెమ్మదిగా అదురుతున్న గుండెల్ని లెక్కచెయ్యకుండా లోపలికి నడిచారు.

పూలన్నిటినీ తనివితీరా చూశారు.

ఇంతలో ఆ రాజమహల్లోంచి రాక్షసి బైటికొచ్చింది. రాజమహల్లో రాక్షసి వుంటుందని అనుకోకపోవటంతో వీళ్ళు ఆమెను చూస్తూనే బిక్కచచ్చిపోయారు. ఆమె వీళ్ళు గులాబీల కోసం వచ్చారని తెలిసి భీకరంగా గర్జించింది.

వీళ్ళు పిల్లిపిల్లల్లా బయటకు పరిగెత్తారు.

గులాబీలు అడిగితే ఆ రాక్షసి చచ్చినా యివ్వదని వాళ్లకు అర్థమైంది.

కానీ యిపుడు గులాబీలను వాళ్ళు దగ్గర్నించి కూడా చూశారు.

పట్టులా మెత్తగా వున్న ఆ పూలను ఒక్కసారి చేతుల్లో పట్టుకోవాలని ఆ చిన్ని మనసులు ఒకటే అల్లరి చేస్తున్నాయి.

ఆ కోరికను అదుపులో పెట్టటం అసాధ్యంగా ఉంది. అరచేయి వెడల్పున వికసించిన తెల్ల గులాబీలు వీళ్ళను పిలుస్తున్నట్టే కనిపిస్తున్నాయి.

ఒక ఆదివారంనాడు మిట్టమధ్యాహ్నం రోడ్డంతా నిర్మానుష్యంగా వున్న సమయంలో జయ, సుధ ఇల్లు దాటి రోడ్డెక్కారు. పక్కనున్న బంగళా చుట్టూ నాలుగుసార్లు తిరిగారు అంతా నిశ్శబ్దంగా ఉంది.

సాయంత్రం వరకూ ఆ నిశ్శబ్దం చెదరదని పిల్లలకు తెలుసు.

గేటు తాళం వేసివుంది.

ఇద్దరూ మళ్ళీ బంగళా చుట్టూ తిరిగి గోడ ఎక్కటానికి ఎక్కడ అనువుగా వుందో చూశారు. సరిగ్గా కుడివైపు గోడ దగ్గరే తెల్ల గులాబీగుత్తులున్నాయి. అక్కడే గోడ ఎక్కటానికా అన్నట్లు ఎత్తుగా సిమెంటుదిమ్మె ఉంది.

ముందు సుధ గోడ దూకింది.

జయ గోడమీదకెక్కింది గానీ దూకటానికి ఆ పిల్లకు ధైర్యం చాలటంలేదు.

"పోనీ నువ్వక్కడే వుండు. నేను పూలు కోసి యిస్తాను"

అంటూ సుధ గులాబీలవంక చూసింది.

ముళ్ళు గుచ్చుకుంటున్నా గీసుకుపోతున్నా లెక్కచెయ్యక పూలు కోస్తోంది.

పెద్దపెద్ద పూలు ఎంచి ఆరు పూలు కోసింది.

"ఇంక చాల్లేరా" జయ తొందరచేసింది.

"ఇంకొక్క నాలుగు, అక్కడికి పదవుతాయి"

సుధ అన్నిటికన్నా పెద్ద పువ్వు కోసం వెతుకుతోంది.

ఇంతలో రాక్షసి వచ్చింది. ఈసారి రాక్షసి భీకరంగా గర్జించలేదు. పిల్లిపిల్లలా చప్పుడు లేకుండా వచ్చి సుధ జుట్టుపట్టుకుంది.

జయ గబుక్కున గోడదూకేసింది.

సుధ ఆ రాక్షసి పట్టునుంచి విడిపించుకోలేక గిజగిజలాడింది.

జుట్టు వూడొచ్చేలా పట్టుకుని వూపింది. చర్మం వూడేలా బుగ్గలు పిండింది.

సుధ ఇల్లెక్కడో చెప్పించుకుని పెద్దవాళ్ళను పిల్చుకురమ్మని నౌకర్ని పంపింది.

సుధ తండ్రి కంగారుపడుతూ వచ్చాడు. ఆ రాక్షసి పెద్దాయన, టీచరు అని కూడా చూడకుండా పిల్లల్ని దొంగలుగా తయారుచేసి బతికే సుబ్బారావు వంటి దరిద్రుల్ని బతకనివ్వకూడదని చెబుతూ మళ్ళీ యిలాంటి పని జరిగితే సుధను పోలీసులకు అప్పగిస్తానంటూ అప్పటికి మాత్రం సుబ్బారావుగారికి అప్పగించింది.

జీవితంలో ఎన్నడూ ఎరగని ఈ అవమానానికి సుబ్బారావుగారు నిలువునా మండిపోయారు. ఆ మంటలకు చిన్ని సుధ ఆహుతయింది. ఒళ్ళంతా తట్లు తేలేలా కొట్టాడు.

తల్లీ, అక్కలూ ఎలాగైనా సుధను రక్షిద్దామని విఫలయత్నం చేశారుగానీ కుదరలేదు.

సుధ దెబ్బలకు తట్టుకోలేక సొమ్మసిల్లి

పడిపోయింది. నాలుగు రోజుల తర్వాత దెబ్బల గుర్తులూ, వాపులూ, నొప్పులూ కాస్త తగ్గాక సుధ కోసం జయ వచ్చింది.

సుధను చూసి ఏడ్చింది.

ఇద్దరూ బడికి బయల్దేరారు.

బడివైపు పదడుగులు వెయ్యగానే బంగళా కనిపించింది.

గులాబీలు ఉదయపు గాలికి హుషారుగా తలలూగిస్తున్నాయి.

జయ, సుధ ఆగిపోయారు.

ఎందుకు చూస్తున్నారో తెలియకుండా అయిదు నిమిషాలపాటు ఆ పూలవంక చూస్తూ నిలబడ్డారు. సుధ గట్టి నిశ్చయంతో మాట్లాడుతున్నదానిలా అంది, "నేను పెద్దయ్యాక నా ఇంటిముందు ఇంతకంటే పెద్ద గులాబీతోట వేస్తాను. రంగురంగుల గులాబీలు పూయిస్తాను"

"అప్పుడవి అందరికీ యిస్తావు గదూ" జయ సంతోషంగా అడిగింది.

"ఇవ్వను... ఎవరికీ యివ్వను. ఒక్క పువ్వు కూడా యివ్వను" కచ్చితంగా, కఠినంగా కోపంగా పలికింది సుధ.

★ ★ ★

"నాకు నువ్వెప్పుడు గుర్తొచ్చినా ఆ మాటలు అంటున్నప్పటిలాగే గుర్తొస్తావు. అప్పటి నీ ముఖాన్ని నేను మర్చిపోలేకపోతున్నా"

జయ నవ్వుతూ అంది.

"నేనూ మర్చిపోలేకపోతున్నా. ఈ తోట యిలా వుందంటే ఆ మాటలు నిత్యం నాకు వినిపించబట్టే" కాసేపు తోట చూసి యిద్దరూ లోపలకు వెళ్లారు.

హైస్కూలు చదువు తర్వాత జయ గుంటూరు ఒదిలి విశాఖపట్నంలో మేనమామ గారింట్లో వుండి చదివింది. మొదట్లో యిద్దరూ ఉత్తరాలు రానుకున్నారు గానీ రానురాను తగ్గిపోయాయి.

ఆరేళ్ళ తర్వాత సుధ పెళ్ళికి వచ్చినపుడు సుధ ఏమీ మారలేదు అనుకుంది జయ.

ఇప్పుడు సుధ చెబుతున్న మాటలు వింటున్నకొద్దీ సుధ చాలా మారాలి అనిపించింది జయకు. కట్నం తీసుకోకుండా పెళ్ళాడాడంటే సుధ భర్త మంచివాడనుకుంది గానీ సుధను యిలాగే వుంచాడంటే అతనూ యిలాంటివాడేనేమో అనుకుంది జయ.

ఒక గంటకు లయ స్కూలునుంచి వచ్చింది. లయను చూస్తూనే ముచ్చటపడింది ఇద్దరు మగపిల్లల తల్లి జయ.

"నీ అంతప్పుడు మీ అమ్మా నేనూ స్నేహితులం" అని పరిచయం చేసుకుంది.

"అమ్మ మా గులాబీతోట చూపించిందా ఆంటీ" అడిగింది లయ.

"చూపించింది. చాలా బాగుంది"

నా గది చూపించిందా? ఇంకా బాగుంటుంది"

లయ గది చూసి ఆశ్చర్యపోయింది జయ. పదేళ్ళ పిల్లకు యింత మంచి అభిరుచులు సుధ నేర్పలేదు. సుధ భర్త వసయివుంటుంది.

మరి సుధనలాగే ఉంచేశాడేం? మార్చటం కుదరదా? "మీ అమ్మ ఈ పాటలన్నీ వింటుందా?"

అక్కడున్న కాసెట్లు చూస్తూ అడిగింది జయ.

"ఊహూ... అమ్మకిష్టంలేదు. డబ్బు దండగ పనులంటుంది. నేనూ మా నాన్నా వింటాం"

లయ కబుర్లు వింటున్నకొద్దీ జయకు లయమీద యిష్టమూ శ్రీకాంత్‌మీద గౌరవమూ కలిగాయి.

సుధ వంట ముగించే వరకూ లయతోనే మాట్లాడుతూ కూర్చుంది.

శ్రీకాంత్ వచ్చాక సుధ జయను పిల్చి పరిచయం చేసింది. "నాకు మీ అమ్మాయిని ఎత్తుకుపోదామనిపిస్తోందండీ" అంది జయ.

శ్రీకాంత్ గర్వంగా నవ్వాడు.

"ఎత్తుకుపో తల్లీ- మాకు బోలెడంత ఖర్చు తప్పుతుంది" అని నవ్వేసింది సుధ

శ్రీకాంత్‌కు సుధ లయ ముందు అలా మాట్లాడటం నచ్చదు. అందువల్ల వెంటనే మాట మార్చేసి జయ గురించిన వివరాలు అడగటం మొదలుపెట్టాడు.




రాత్రి తొమ్మిది గంటలకు జయను వాళ్ళ బాబాయిగారింట్లో దింపాడు శ్రీకాంత్.

★ ★ ★

ఆదివారం మధ్యాహ్నం భోజనాలయ్యాక సుధ సూదీ, దారం తీసుకుని ఊడిపోయిన గుండీలు హుక్సు కుడుతూ కూర్చుంది.

లయ శ్రీకాంత్ దగ్గరచేరి కథ చెప్పమని వేధిస్తోంది. శ్రీకాంత్ నిద్రొస్తోందమ్మా రాత్రికి చెబుతానంటూ లయను బతిమాలుతున్నాడు.

ఇంతలో ఏదో పెద్ద చప్పుడు వినిపించింది. ఏం చప్పుడో అర్థం కాలేదు గానీ ముగ్గురూ లేచి నిలబడ్డారు. ఇంతలో ఆ చప్పుడు యింకా స్త పెరిగింది. ముగ్గురూ వరండాలోకి పరిగెత్తారు.

అక్కడ్నించి కనిపిస్తున్న దృశ్యానికి ముగ్గురూ నిశ్చేష్టులై నిలబడిపోయారు.

పక్కన మాణిక్యవల్లిగారింట్లో మామిడి చెట్టు విరిగిపడుతోంది. దానంతటది కాదు. ఎవరో విరగ్గొడుతున్నారు. సుధ గబగబా గోడదగ్గరికి వెళ్ళి చూసింది. అక్కడ కనపడిన దృశ్యం మరింత బీభత్సంగా వుండి సుధ పెద్దగా కేకవేసింది.

లయ, శ్రీకాంత్ పరిగెత్తుకుని వచ్చారు.

లయ కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తోంది. అక్కడ తోటంతా సర్వనాశనమైపోతోంది. విరగ్గొడుతున్నది మామిడిచెట్టునే కాదు. తోటలో ప్రతి చెట్టూ ప్రతి మొక్కా విధ్వంసానికి గురైంది. ఇష్టం వచ్చినట్లు నరికేశారు. పీకి పడేశారు. ఘోరమైన హత్యాకాండ సాగిన ప్రదేశంలా ఆ ఇంటి ముంగిలంతా భయంకరంగా ఉంది. ఎవరు వీళ్ళు? ఎందుకిలా చేస్తున్నారు? మాణిక్యవల్లిగారేమయ్యారు? ఇంట్లోవాళ్లంతా ఏమయ్యారు? అందరినీ చంపెయ్యలేదు గదా- అప్రయత్నంగా లయను దగ్గరకు తీసుకున్నాడు శ్రీకాంత్. పట్టపగలు ఈ దారుణం ఎట్లా జరిగింది?

"నీ వెళ్ళి చూసొస్తానుండు" అంటూ బయల్దేరాడు.

"అమ్మో వెళ్లకండి. మాకు భయం" సుధ కూడా బాగా భయపడుతోంది.

నిజానికి మరో రెండు రోజుల్లో మాణిక్యవల్లిగారు ఈ ఊరునుంచి వెళ్ళిపోతున్నారు. ఆయనకు ట్రాన్స్‌ఫర్ వచ్చింది. ఇంతలో ఈ ఘోర కలి ఏమిటి అనుకుంది సుధ. శ్రీకాంత్ ఆ ఇంటివైపు నాలుగడుగులు వేశాడో లేదో మాణిక్యవల్లి ఇంట్లోనుంచి బైటికొచ్చి నుంచుంది. ఆమెలో భయంలేదు. ముందు కనిపిస్తున్న దృశ్యానికి ఒణికిపోలేదు.

"త్వరగా కానివ్వండి. అన్నాలు పెడతాను" అంది నింపాదిగా.

సుధకు ఏదో అనుమానం వచ్చింది.

"మాణిక్యవల్లిగారూ- ఏంటండీ ఇదంతా" అని అడిగింది.

"మేం వెళ్లిపోతున్నాం కదమ్మా- రేపే ప్రయాణం" అనలేమీ జరగనట్టు, తనకేమీ కనిపించనట్టు అన్నది. "అది సరే- తోటంతా యిట్లా-"

"మరేం చెయ్యమంటావమ్మా- పన్నెండేళ్ళు పెంచాం. ఈ మొక్కలన్నీ మేం నాటి పెంచినవే. కొత్తగా కట్టిన ఇంట్లో దిగాం. అప్పుడొక్క మొక్క లేదు. స్వంత ఇల్లన్నట్టు తోట వేసుకున్నాం. ఇప్పుడు ఒదిలివెళ్ళాలంటే మనసొప్పుతుందీ? మా కష్టమంతా ఎవరో ఎందుకు అనుభవించాలి. మేం వచ్చినప్పుడెట్లా వుందో అట్లాగే చేసి వెళ్తాం. ఎవరు వస్తారో వాళ్ళు పెంచుకుంటారు కావాలంటే. నా కష్టం మాత్రం యింకొకరికి దక్కనివ్వను" మాణిక్యవల్లి మాటలు శూలాల్లా తగులుతుంటే భరించలేక లయను తీసుకుని లోపలకు వెళ్ళాడు శ్రీకాంత్.

కాసేపు మాట్లాడి సుధ లోపలకి వచ్చింది.

"ఏమైనా అద్దె యిళ్ళల్లో మొక్కలు పెంచకూడదండీ. ఒదిలిపోవాలంటే కష్టమే" అంది శ్రీకాంత్ ఎదురుగా కూర్చుంటూ.

"అందుకని మొక్కలన్నీ పీకేస్తారా? మనుమలా పశువులా ఛీ! ఛీ!" చీదరించుకున్నాడు.

"బాగుంది మరేం చేస్తారు?"

"సుధా- నాకు చాలా కోపంగా వుంది. నువ్వు ఆవిడమీద ఏ కొంచెం సింపతీ చూపినా నేను భరించలేను. ఏం చేసేదేమిటి? మొక్కల్ని చంపుతారా? ఇంకొకరు తింటే, అనుభవిస్తే

ఏమవుతుంది? ఇంకొకళ్ళ సుఖం అంత భరించలేనిదా? ఈ బుద్ధి ఎంత భయంకరమో నీకు తెలియకపోతే, నీకు అర్థంకాకపోతే నిన్ను చూస్తే కూడా నాకు అసహ్యమేస్తుంది'' శ్రీకాంత్‌కు ఆ మాణిక్యవల్లిని తన్నాలన్నంత కోపంగా ఉంది.

''మధ్యలో నేనేం చేశాను?''

''ఏం చెయ్యటం కాదు. అద్దె యిళ్ళల్లో మొక్కలు పెంచకూడదన్నావు. అది ఘోరమైన మాట. మొక్కల్ని ఎక్కడ వీలైతే అక్కడ పెంచాలి. అవి మన స్వంతం కాదు. వాటి బతుకు వాటికుంది. నీకు తెలియదు- అర్థంకాదు లవలూటియా అడవుల్లో పూలమొక్కలు పెంచిన పెద్దమనిషి గురించి నీకు తెలియదు. ఆ అడవుల్లో ఎవరూ ఉండరు. ఎవరికీ చెందవు. అయినా సరే పనిగట్టుకుని ఆ అడవంతా పూలతీగలు వేసి అవి పుష్పిస్తే సంతోషించిన మనుషులున్నారు దేశంలో- నువ్వు వాళ్ళ గురించి తెలుసుకోవు. తెలుసుకోకపోతే పోయావు. ఈ మాణిక్యవల్లిలాంటి వాళ్లను సమర్థించకు. వీళ్ళు భస్మాసురులు. మొత్తం దేశాన్ని సర్వనాశనం చేసేస్తారు. తమకు సాధ్యమయితే ఈ ప్రపంచంలో సర్వప్రాణికోటినీ నాశనం చేసి తామే బతకాలని చూస్తారు. వాళ్ళను అసహ్యించుకోకపోతే, వాళ్ళను వెలివెయ్యకపోతే వాళ్ళనీ ప్రపంచం నుండి తరిమెయ్యకపోతే ప్రపంచం మిగలదు. సర్వనాశనం చేస్తారు. నువ్వు ఇంకొక్కసారి అద్దె యిళ్ళల్లో మొక్కలు పెంచకూడదన్నావో...''

''నాన్నా-'' లయ భయంగా తండ్రి చేయి పట్టుకుని ఊపింది.

లయను తీసుకుని గదిలోకి వెళ్ళి తలుపువేసుకున్నాడు. అతనికి బాగా ఏడవాలనివుంది. లయను చూసి దుఃఖాన్ని కంట్రోలు చేసుకున్నాడు.

లయ తండ్రి చేయి ఒదలకుండా పట్టుకుంది.

తండ్రి కోపాన్నీ ఆవేశాన్నీ ఎలా తగ్గించాలా అని ఆలోచిస్తోంది. శ్రీకాంత్ గదిలోనే అసహనంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. పక్కనే లయ కూడా తిరుగుతుంది.

''నాన్నా!'' మెల్లగా పిలిచింది.

శ్రీకాంత్ ఆగాడు. బిక్కముఖం వేసుకుని వున్న లయను చూస్తే జాలేసింది. లయను ఎత్తుకుని

''ఏంటమ్మా! బయపడ్డావా?'' అనడిగాడు.

లేదన్నట్టు తల అడ్డంగా ఆడించి ''అడవిలో పూలమొక్కలు పెంచింది ఎవరు నాన్నా? ఎందుకు పెంచారు?'' తండ్రికి ఏ మాటలు యిష్టమో లయకు బాగా తెలుసు. చటుక్కున లయను ముద్దుపెట్టుకుని కిందకు దించాడు. బీరువాలోంచి ''వనవాసి'' పుస్తకం తీసి లయ కిచ్చాడు.

''ఇందులో ఆ కథంతా ఉంటుంది. మనం చదువుకుందామా?''

''నువ్వు చదివితే నేను వింటాను'' లయ ముద్దుగా అంది.

''సరే- నువ్వు పది పేజీలు, నేను పది పేజీలూ చదువుదాం సరేనా''

ఇద్దరిమధ్యా అంగీకారం కుదిరింది.

లయ సన్నని తియ్యని గొంతుతో మెల్లగా చదువుతుంటే అశాంతితో మండుతున్న శ్రీకాంత్ హృదయం నెమ్మది నెమ్మదిగా చల్లబడింది.

సుధ మాత్రం తన అశాంతికి కారణం తెలియకా, మాణిక్యవల్లిని పూర్తిగా వ్యతిరేకించలేకా, పూర్తిగా ఆమోదించలేకా శ్రీకాంత్ మాటల సారాంశం తెలియకా అయోమయంగా కూచుంది. కాసేపటికి తలనొప్పి అని పించి వెళ్ళిపడుకుని నిద్రపోయింది.

తోటంతా స్మశానం చేసిన మాణిక్యవల్లి మర్నాడు ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయింది.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలవుతోంది. లయ ఇంకా స్కూలునుంచి రాలేదని శ్రీకాంత్, సుధా ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు. సామాన్యంగా ఐదు గంటలకల్లా లయ స్కూలు నుంచి వచ్చేస్తుంది. స్కూల్ బస్ లయ ఇంటివరకూ రాదు. అమీర్‌పేటలో స్కూల్ బస్ దిగి అక్కడే మరో సిటీబస్ ఎక్కిరావాలి. ఆ బస్‌లు చాలా




ఎక్కువగానే ఉంటాయి. తేలికగానే దొరుకుతాయి. ఎన్నడూ లేనివిధంగా ఆలస్యం కావటంతో శ్రీకాంత్ అమీర్‌పేట దాకా వెళ్లి చూస్తానని స్కూటర్ తీస్తున్నాడు, లయ వచ్చేసింది.

శ్రీకాంత్ హాయిగా నిట్టూర్చాడు. సుధ కోపంగా లయ ఆలస్యానికి కారణం అడిగింది.

లయ సమాధానం చెప్పకుండానే లోపలకు నడిచింది. సుధ కోపంగా అనే మాటలను వినిపించుకోలేదు. ఎవరూ చెప్పకుండానే స్నానం చేసింది.

ఏమీ మాట్లాడకుండా డల్‌గా కూచున్న లయను చూస్తే భార్యాభర్తలిద్దరికీ ఆందోళన కలిగింది.

శ్రీకాంత్ లయ పక్కనే కూచుని...

"ఏంటిరా, ఎందుకట్లా దిగులుగా కూచున్నావు?" లయ తలెత్తి తండ్రికేసి చూసింది.

"చెప్పు నువ్వు చెప్పకుండా అలా కూచుంటే మాకూ దిగులుగా వుంటుంది"

"నాకు ఫస్టురాంకు వచ్చింది" లయ నీరసంగా చెప్పిన తీరుకి శ్రీకాంత్, సుధ ఇద్దరూ ఫక్కున నవ్వారు.

"ఓసి పిచ్చిదానా ఫస్టురాంకు వస్తే అట్లా నీరసంగా కూచోమని ఎవరు చెప్పారు. ఫస్టురాంకు రావటం నీకిదే మొదటిసారిగదా! చక్కగా సంతోషంగా ఉండాలి" సుధ సంతోషంగా నవ్వింది.

శ్రీకాంత్ అసలు విషయం ఏమిటో చెప్పమన్నట్లు లయను చూసి తలాడించాడు.

"కవితకు ఫిఫ్త్ ర్యాంకు వచ్చింది"

శ్రీకాంత్‌కు లయ దిగులెందుకో అర్థమయిందిగానీ సుధకు అర్థం కాలేదు.

"కవితకు ఫిఫ్త్ ర్యాంకయితే నీకేమయిందే"

"మా ఇద్దరికీ ఎప్పుడూ ఒకటే ర్యాంకు వస్తుంది. ఇపుడు కవితకంటే నాకు ఎక్కువ మార్కులొచ్చాయి. పాపం కవిత తను వెనకబడిపోయానని ఏడుస్తోంది. నాన్నా నాకు ఫస్టు ర్యాంకు ఒద్దు. కవితలా ఫిఫ్త్ రాంకు వస్తే చాలు"




వింటున్న సుధకు ఒళ్లు మండిపోయింది. దీనికంతటికీ శ్రీకాంత్ కారణమని సుధకు తెలుసు. ఎప్పుడూ దాన్ని సరిగా చదవనివ్వడు. క్లాసులో అందరికంటే ముందుండాలని నూరిపొయ్యడు. ఇవాళా రేపూ తల్లిదండ్రులు పిల్లలకి ఎట్లా చదువు చెప్పుకుంటున్నారు. రాత్రింబగళ్లు పిల్లలతోపాటు కూచుని చదివిస్తున్నారు. అతను చెప్పడు, తనను చెప్పనివ్వడు. ఈ పోటీ పద్ధతిలోకి పిల్లను లాగనివ్వనంటాడు. ఇవాళ ఈ పిల్ల ఎంత పిచ్చిదయిందంటే ఫస్టుర్యాంకు రావటంపాపంలా ఏడుస్తుంది. అందరూ నేను ఫస్టంటే నేను ఫస్టని పరిగెత్తుతుంటే తన కూతురు పరిగెత్తకుండా నిలబడిపోయి నేను లాస్టంటూ మురిసిపోయేలా చేస్తున్నాడు. తెలివితేటల్ని సర్వనాశనం చేస్తున్నాడు.

సుధ కోపంగా శ్రీకాంత్‌వంక చూసింది. శ్రీకాంత్ లయను ఓదార్చటంలో నిమగ్నమయ్యాడు. ఈసారి కవితకు కూడా ఫస్టుర్యాంకు వస్తుందని హామీ ఇచ్చాడు. "ఈసారి కవితకే ఫస్టురాంకు వస్తుందనుకో. నీకు ఏ టెన్త్ రాంకో వస్తుందనుకో నువ్వు ఏడుస్తావా? కవితకు ఫస్టొచ్చిందని సంతోషించవా?"

లయ ఆలోచనలో పడింది. ఎంత ఆలోచించినా కవితకు ఫస్టురాంకు వస్తే తనకు సంతోషంగానే వుంటుందనిపించింది.

"మరి నీకు ఫస్టువస్తే కవితకు మాత్రం సంతోషంగా ఉండదా?"

నిజమేననిపించింది లయకు.

మీరిద్దరూ స్నేహితులుగాబట్టి ఒకే రకంగా వుండాలని వుంటుందనుకో! అలా వుంటే మంచిదే కానీ ఎప్పుడన్నా ఒకరు ముందుంటే రెండోవాళ్లు సంతోషించాలిగానీ బాధపడకూడదు. తను కూడా ముందుకొచ్చే ప్రయత్నం చేయాలి"

"వెనుకబడ్డ స్నేహితురాలికి ముందున్న స్నేహితురాలిని చూస్తే సంతోషమే కానీ ముందున్న అమ్మాయికి తన ఫ్రెండు వెనకబడిందే అని దిగులు వుండదా?"

లయ తన దిగుల్ని సమర్థించుకుంది. శ్రీకాంత్‌కి ఏం చెప్పాలో తెలియలేదు.

"దిగులుపడి ఏం చేస్తావు" శ్రీకాంత్ లేచి తన గదిలోకి వెళ్లాడు.

జేబులోంచి సరికొత్త పెన్ను తీసుకొచ్చి లయకిచ్చాడు.

"ఈ పెన్ను కవితకివ్వు. ఈ పెన్నుతో రాస్తే ఫస్టురాంకు వస్తుందని చెప్పు. బాగా చదివి రాయమను. అప్పుడు నీ దిగులు పోతుంది"

లయ ముఖం వెలిగిపోయింది. కవితకు పెన్ను ఇస్తానన్న సంతోషంలో అన్నీ మర్చిపోయింది.

సుధకు వీళ్లిద్దరి వరసా ఎప్పుడూ నచ్చదు. ఫస్టురాంకు వచ్చిన కూతురికి ఏదన్నా ప్రెజెంటేషన్ ఇచ్చామంటే అర్థవుంది. కూతురి ఫ్రెండుకి ఫిఫ్త్ రాంకు వచ్చినందుకుగాను పెన్ను ఇవ్వటం ఏంటి బడాయి కాకపోతే.

తనకిదేమీ నచ్చనట్లు అక్కడ్నించి లేచింది. అప్పుడే ఆమె మనసులో హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. చిరునవ్వుతో పెదాలు విచ్చుకున్నాయి.

"కూతురికి బహుమతి నేనిస్తాను" అనుకుంది సుధ.

మర్నాడు ఉదయం లయకు జడలు వేస్తూ "లయా! ఫస్టురాంకు తెచ్చుకున్నందుకు నీకో బహుమతి ఇస్తాను. ఏంటో చెప్పుకో" అనడిగింది ప్రేమగా. లయ సంతోషం పట్టలేక వెనక్కు తిరిగి వేస్తున్న జడ పాడు చేసుకుని ఒక మొట్టికాయ తిన్నది.

"ఇదేనా నీ బహుమతి" అంది తల తడుముకుంటూ.

సుధ నవ్వి "రెండు జడలూ వేశాక ఇస్తాను" అంది. జడలువేశాక లయను కళ్లుమూసి తెరవమంది. లయ కళ్లు తెరిచేసరికి కళ్ల ముందు పెద్ద తెల్లగులాబీ.

లయ కళ్లు ఆశ్చర్యంతో మరింత పెద్దవయ్యాయి.

"అమ్మా! గులాబీ పువ్వు కోశావా?"

"ఊఁ ఇలారా జడలో పెడతాను"

నల్లని లయ జడలో నక్షత్రంలా అమరింది గులాబీ. సుధ గులాబీని ముద్దుపెట్టుకుంది. లయ అద్దంలో చూసుకుని మురిసిపోయింది. కూతురి మురిపెం చూసి తల్లి మనసు కాస్త కరిగింది.

"పోనీ రోజూ ఓ గులాబీ పెట్టుకోవే బోలెడు పూస్తున్నాయిగా" అంది.

తల్లి ఔదార్యానికి లయ సంతోషంగా నవ్వింది.

"పద పద స్కూలుకి టైమవుతోంది" అని వంటింట్లోకి వెళ్లింది సుధ.

లయ పుస్తకాలు పట్టుకుని సుధ దగ్గరకు వచ్చింది.

ఏదో కావాలని అడుగుతున్నట్లున్నాయి ఆ అమ్మాయి కళ్లు.

"ఏంటి? ఏం కావాలి?" సుధ తన హడావుడిలో తనుంది.

"అమ్మా! ఇంకొక్క తెల్లగులాబీ ఇవ్వవూ?"

సుధ అంత హడావుడిలోనూ ఆగి లయ ముఖం చూసింది.

"ఎందుకు? రెండు జడల్లోనూ పెట్టుకుంటే బాగుండదు. మోటుగా ఉంటుంది"

"నాకు కాదమ్మా, కవితకు"

"కవితకా? ఏమొద్దు... వెళ్లు"

"ఇద్దరం పెట్టుకుంటే బాగుంటుంది. నేనొక్కత్తినే పెట్టుకుంటే కవిత బాధపడుతుంది"

"ఇవాళ కవిత, రేపు లావణ్య, ఎల్లుండి సుజన ఇక వరసగా అందరూ బాధపడతారు. నువ్వు తోటలో పూలన్నీ పందారం చేసిరా, అదేం కుదరదు. పిచ్చి వేషాలెయ్యకుండా వెళ్లు"

"అమ్మా ప్లీజ్!"

"ఏమీ లాభంలేదు. అరచి గీపెట్టినా పువ్వు ఇవ్వను. వెళ్లు" సుధ కఠినంగా అంది.

లయ విసురుగా బయటకు నడిచింది. తల్లి మీద కోపంగా వుంది.

తనొక్కత్తే గులాబీ పువ్వు పెట్టుకెళ్తే ఏం బాగుంటుంది? కవిత ఆశగా చూస్తుంది. ఛీ అమ్మకేం తెలియదు. స్నేహితులకు ఇవ్వకుండా ఎట్లా.

కవిత దగ్గరకు గులాబీ పువ్వు లేకుండా వెళ్లాలన్పించలేదు. బస్‌స్టాపు వరకూ నడిచినా లయ కోపం తగ్గలేదు. బస్‌స్టాపులో ఒక చిన్న పిల్ల తప్ప ఎవరూ లేరు. ఆ పిల్ల మురికిగా వుంది. వాళ్లమ్మ అక్కడ కూచోపెట్టి ఎక్కడకో

వెళ్లినట్టుంది. బిక్కుబిక్కుమంటూ లయకేసి చూస్తోంది.

లయ ఆలోచిస్తున్నదల్లా ఒక్కసారి చెయ్యి పైకి లేపి జడలో గులాబీ నెమ్మదిగా తీసింది. ఒకసారి వాసన చూసింది. దూరంగా బస్సు వస్తోంది. లయ ఆ గులాబీ తీసి ఆ పిల్ల చేతిలో పెట్టింది. ఆ పిల్ల భయంభయంగా చూసింది.

"తీసుకో ఫరవాలేదు తీసుకో" నవ్వింది లయ.

ఇంతలో బస్సు వచ్చి ఆగింది. లయ గబగబా బస్సెక్కి కూచుంది. బస్సు కిటికీ లోంచి ఆ పిల్లను చూస్తూ స్నేహంగా చెయ్యి ఊపింది.

మర్నాడు ఉదయం సుధ లయకు జడలు వేస్తోంది. హఠాత్తుగా లయ దృష్టి ఫ్రిజ్ మీద వున్న గులాబీ మీద పడింది. ఆ పువ్వును చూసి ముఖం చిట్లించి "అమ్మా నాకా పువ్వు పెట్టొద్దు" అంది.

"ఏం? ఎందుకని?" సుధ ఆశ్చర్యంగా అడిగింది.

"నేనొక్కదాన్నే పెట్టుకోవటం నాకిష్టం లేదు. నువ్వు కవితకు ఇవ్వవు. నాకూ ఒద్దు"

"నువ్వొక్కదానివే ప్రత్యేకంగా వుండాలిగానీ అందరితో నీకెందుకు?"

"నాకిష్టం లేదు"

"నువ్విట్టి తెలివి తక్కువ మొద్దువి. మీ నాన్న నిన్నిట్లా తయారు చేస్తున్నాడు. నువ్విట్లా గే పెరిగితే ఎందుకూ పనికిరావు. నువ్వు క్లా సులో ఎప్పుడూ ఫస్టున రావాలి. అన్నింటిలో ముందుండాలి. అందరిలో ప్రత్యేకంగా గొప్పగా ఉండాలి. అందరూ నీ గురించి గొప్పగా చెప్పుకోవాలి"

లయ అనహనంగా తల అడ్డంగా ఊపింది.

"నాకు ఇష్టంలేదని చెబుతుంటే వినవేం"

"నేను చెప్పే మాటలు నువ్వు వినవేం. నేను నీకంటే పెద్దదాన్ని పెద్దవాళ్లు ఒకమాట చెప్తే వినే పనిలేదా?"

"నాన్న నీకంటే పెద్దాడు. నేను నాన్న మాటలు వింటాను. నువ్వే పెద్దాళ్ల మాట వినవు. నాన్న మాట నువ్వు కూడా విను" లయ కచ్చితంగా చెబుతుంటే సుధకి ఎందుకో కోపం రాకపోగా నవ్వు వచ్చింది.

"లయా! నీకో మంచి కథ చెప్పనా? చిన్నప్పుడు మా నాయనమ్మ చెప్పిన కథ"

తల్లికి కథలు చెప్పటం వచ్చని లయకు తెలియదు. అనుమానంగా తలాడించింది చెప్పమన్నట్లు.

"అనగా అనగా ఒక వూర్లో ఒక సోమరిపోతు సోమయ్య ఉండేవాడు. ఆ సోమయ్యకు ఏ పనీ చేతకాదు. చేతనైన చిన్నచిన్న పనులు చెయ్యటానికి కూడా విపరీతమైన బద్ధకం. సోమయ్యకు తండ్రిలేడు. తల్లి కష్టపడి పని చేసి తెచ్చి పెడుతుంటే సోమయ్య తిని బద్ధకంగా మంచంలో పడుకునేవాడు. కొన్నాళ్లకు తల్లికి కూడా వినుగు పుట్టింది. ఎన్నాళ్లని ఈ గాడిదను మేపాలి అనుకుంది. ఓరోజు కొడుకును పిల్చి నదికి వెళ్లి చేపలు పట్టుకొస్తే తప్ప తిండి పెట్టనని కచ్చితంగా చెప్పింది. ఒట్టి చేతులతో ఇంటికి రావద్దని గట్టిగా చెప్పి పంపింది.

తల్లిపోరు పడలేక నది దగ్గరకు వచ్చాడు గానీ సోమయ్యకు చేపలు పట్టడం రానేరాదు. రెండు గంటలసేపు గాలం వేసి కూచున్నా ఒక్క చేపా చిక్కలేదు. ఐతే నది ఎగువనుంచి ఒక అందాల తామరపువ్వు కొట్టుకొచ్చి సోమయ్య కాళ్ల దగ్గర ఆగింది. సోమయ్య ఆ తామరపువ్వు దొరికిందే చాలనుకుని దాన్ని తీసికెళ్లి కోమటింట్లో ఇచ్చి బెల్లం, శనగపప్పు పెట్టించుకుని తిన్నాడు. కోమటాయన ఆ పువ్వుని చాలా ప్రియంగా తన కూతురి తలలో పెట్టాడు. ఆ పువ్వు పెట్టుకుని బడికి వెళ్లిన ఆ అమ్మాయిని అందరూ సంభ్రమంగా చూశారు. పంతులుగారయితే ఆ అమ్మాయిని ఒళ్లో కూచోబెట్టుకుని పాఠం చెప్పారు. ఆ అమ్మాయి ఎంతో గర్వంగా అందరివంకా చూసింది. మిగిలిన అమ్మాయిలంతా బిక్కముఖాలతో చూశారు. రైతు కూతురికి చాలా ఉక్రోషం వచ్చింది. పంతులు గారు అందర్నీ చిన్నచూపు చూసి తామరపువ్వు పెట్టుకున్నందుకు ఆ అమ్మాయిని అందలం ఎక్కించారుగదా అని ఆవేశ





పడుతూ బడినుంచి వెంటనే ఇంటికి వెళ్లిపోయింది. అప్పుడు తామరపువ్వుపెట్టుకున్న అమ్మాయి గర్వంగా నిలబడి...

"అమ్మా!" లయ మధ్యలో ఆపేసింది.

సుధ జడవెయ్యటం కూడా ఆపి ఏమిటన్నట్లు చూసింది.

"నాకీ కథ ఏమీ బాగోలేదు. నేను వినను" లయ చెవుల్లో వేళ్లు పెట్టుక్కుంది.

"నువ్వొట్టి మొండిపిల్లవి. నీ ఇష్టం వచ్చినట్లు ఏడువు" సుధ గబగబా జడలు అల్లి లయను పంపించేసింది.



చలికాలం ఐదు గంటలకే చీకటి ముసురుతోంది. లయ బస్‌స్టాప్‌నుంచి కాళ్లీడ్చుకుంటూ ఇంటికి వచ్చింది. ఇల్లు తాళం పెట్టివుంది.

అమ్మ ఆలస్యమవుతుందని చెప్పిందిగా. పక్కింట్లో తాళం ఇస్తానంది. ఇచ్చిందో మర్చిపోయిందో అనుకుంటూ గేటు దగ్గరకు వచ్చింది. పుస్తకాల సంచీ వరండాలో పెట్టి తాళం చెవి తెచ్చుకుందామనుకుంటూ లోపలకు నడిచింది.

తోటలో సత్తెమ్మ తిరుగుతోంది. రోజూ లయ వచ్చేసరికే సత్తెమ్మ వెళ్లిపోతుంది. సుధ కాలేజీనుంచి రాగానే సత్తెమ్మకు రెండు రూపాయలిచ్చి పంపేస్తుంది. ఎప్పుడన్నా శలవరోజుల్లోనే సత్తెమ్మను చూస్తుంది లయ. ఇవాళ సత్తెమ్మతో పాటు తోటలో తిరుగుదామని వెళ్లింది లయ.

ఆశ్చర్యంగా సత్తెమ్మ ఎవరితోనో మాట్లాడుతోంది. అక్కడ ఎవరూ లేరు. లయ చప్పుడు చేయకుండా వెళ్లి సత్తెమ్మ వెనకాలే నిలబడింది.

సత్తెమ్మ పూలతో మాట్లాడుతోందని గ్రహించటానికి లయకు రెండు నిమిషాలు పట్టింది.

"ఆ ఎర్రరంగు పువ్వు నీతో మాట్లాడదంట. నువ్వు ఒక్కరోజు కూడా అటు చూడమాకు. అప్పుడు ఆ పువ్వుకి కోపం వస్తుందేమో చూద్దాం. అయ్యో నిన్న నీకు అన్నం సరిపోలేదా? ఇవాళ ఎక్కువ పెడతాలే. మా అమ్మ చానా అన్నం పెట్టింది. మా అమ్మ దగ్గర నా డబ్బులు చానా ఉన్నాయి. నిజం. రేపు తెచ్చి చూపిచ్చేదా?"

సత్తెమ్మకు ఏదో అనుమానం వచ్చి వెనక్కు తిరిగింది.

లయను చూసి సిగ్గుపడిపోయింది.

లయ నవ్వుతూ "సత్తెమ్మా పూలతో మాట్లాడుతున్నావా?" అంది.

సత్తెమ్మ తలదించుకుని ఔనన్నట్లు తలాడించింది.

"పూలు కూడా నీతో మాట్లాడతాయా?"

సత్తెమ్మ తల ఇంకా వంగిపోయింది.

"నాక్కూడా పూలతో మాట్లాడాలనివుంది. ఎట్లా మాట్లాడాలి?"

సత్తెమ్మ తలెత్తి అయోమయంగా చూసింది.

లయ నవ్వి సత్తెమ్మ చెయ్యిపట్టుకుంది.

"పూలతో ఒద్దు, నీతోనే మాట్లాడతా. నువ్వు నా జట్టుంటావా? నాతో మాట్లాడతావా?"

సత్తెమ్మ సిగ్గుసిగ్గుగా నవ్వింది.

తర్వాత చాలాసేపు సత్తెమ్మా లయా ఎన్నో కబుర్లుచెప్పుకున్నారు. సత్తెమ్మ తోటలో మొక్కల్ని గురించి చెబితే లయ స్కూల్లో స్నేహితుల్ని గురించీ ముఖ్యంగా కవిత గురించీ చెప్పింది.

ఆరు గంటలవుతుండగా లయకు ఆకలేసింది.

"మా అమ్మ ఆలస్యంగా వస్తుందివాళ. కాలేజీలో ఏదో మీటింగుంది. పోనీ నువ్వు ఇంటికెళ్లిపోరాదూ?"

లయకు చీకటిపడుతున్నా ఇంటికి వెళ్తాన నని సత్తెమ్మ మీద జాలేసింది.

"అమ్మగారొచ్చాకనే వెళ్తా"నంది సత్తెమ్మ.

ఐతే నేను తాళం తీసి తింటానికిఏమన్నా తెస్తానని లయ పక్కింటికి వెళ్లి తాళం చెవి తెచ్చింది. తాళం తీసి వంటింట్లో డబ్బాలు వెతుకుతోంది.

చివరకు ఓ డబ్బాలో కారప్పూస కని పించింది. రెండు ప్లేట్లు తీసి రెండింటిలో సమంగా కారప్పూస పోసి రెండూ పట్టుకుని మెల్లిగా నడిచివస్తోంది.

హాలుదాటి వరండాలోకి అడుగుపెట్టింది. సుధ ఆటోలోంచి దిగి లోపలకు వచ్చింది.

సుధను చూస్తూనే సత్తెమ్మ సుధ దగ్గరకు పరిగెత్తింది.

"ఇవాళ ఆలస్యం అయిందే ఇదుగో నీ డబ్బులు" సుధ పర్సులోంచి రెండు రూపా యల కాగితం తీసిచ్చింది. సత్తెమ్మ చెయ్యి చావలేదు రోజూలా.

"ఏంటీ? తీసుకోవేం" విసుగ్గా అడిగింది సుధ.

ఆలస్యమైనందుకూ, ఆటోలో రావాల్సివచ్చి నందుకూ ఆమెకసలే కోపంగా ఉంది.

సత్తెమ్మ మెల్లగా చెయ్యిచాపి కాషాయి రంగులో అరవిచ్చిన పూలకేసి చూపింది.

సుధకి ఒక్కక్షణం ఏమీ అర్థంకాలా. తర్వాత అనుమానంగా "ఆ పూలు కావాలా?" అనడిగింది.

సంతోషంగా తలాడించింది సత్తెమ్మ.

సుధ చాచిపెట్టి సత్తెమ్మ చెంపమీద కొ ట్టింది.

లయ చేతిలో కారప్పూస పళ్లాలు కిందప డ్డాయి.

సత్తెమ్మ చెంపను చేత్తో అదుముకుంటూ నుంచుంది. కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి.

"పనిముండవి, నీ కళ్లు గులాబీపూలమీద పడితే పూలు బతుకుతాయా? ఎంత ధైర్యం నీకు. ఇంకొక్కసారి పూలు అడిగినా, చెప్ప కుండా కోసినా చంపేస్తాను. పాపిష్టిదానా డబ్బులు తీసుకుని వెళ్లు"

రెండు రూపాయలు బలవంతంగా సత్తెమ్మ చేతిలో పెట్టి సత్తెమ్మను ముందుకు నెట్టింది.

ఒకచేత్తో చెంప పట్టుకునే పరిగెత్తింది సత్తె మ్మ. సుధ గేటు వేసుకుని ఇంట్లోకి వచ్చేసరికి లయ వరండాలో అట్లాగే నిలబడి వుంది.

కింద విరజిమ్మినట్లున్న కారప్పూస చూడ గానే సుధ కోపం తారాస్థాయికి చేరింది.

"ఒక్కపూట ఇంటికి ఆలస్యంగా వస్తే యిల్లు పీకి పందిరేస్తావేం. సరిగ్గా ప్లేట్లో పోసుకు తినలేవూ. ముందవన్నీ ఎత్తిపారేసి ఆ స్కూలుడ్రస్ విప్పు"

అరుస్తూనే లోపలకు నడిచింది.

లయ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ కార ప్పూస ఎత్తి పారబోసింది. బట్టలు మార్చుకుని పుస్తకాలు ముందేసుకుని కూచుందిగానీ లయ కళ్ళముందు సత్తెమ్మ ముఖమే కదులుతోంది. కదిలినప్పుడంతా లయ కళ్ళల్లో నీళ్ళు తిరు గుతున్నాయి. సుధ వంట ముగించి స్నానం చేసేసరికి ఎనిమిదయింది. ఆరోజు అనుకో కుండా శ్రీకాంత్ కూడా ఆలస్యంగానే వచ్చాడు. రాగానే స్నానం చేసి భోజనానికి కూర్చున్నాడు.

సుధ పళ్ళాలూ, గ్లాసులూ టేబిల్‌మీద పె డుతుంటే శ్రీకాంత్ లయను పిలవటానికి గదిలోకి వెళ్ళాడు.

"అబ్బో! సీరియస్‌గా చదువుతున్నావే. చదివింది చాల్లేగాని అన్నం తిందాం రా" అని పిల్చాడు.

లయ తండ్రిని చూసి నవ్వకుండా పుస్తకం మూసి లేచి టేబుల్‌దగ్గరకు వెళ్ళింది.

శ్రీకాంత్ తను ఆలస్యంగా వచ్చినందుకు అలిగిందని నవ్వుకుంటూ లయ వెనకాలే వెళ్ళాడు.

నెమ్మదిగా బతిమాలుకోవాలి బంగారుత ల్లిని అనుకున్నాడు. అన్నం కలుపుకుని రెండు ముద్దలు తిని "గోంగూర పచ్చడి బలే బావుందికదురా లయా!" అని లయవంక చూసి నివ్వెరపోయాడు.

లయ అన్నం కలుపుకోకుండా అలాగే కూచుంది.




"ఏంట్రా నాన్నా అన్నం తినవేం?" ఆందోళనగా అడిగాడు.

సుధ కూడా తలెత్తి ఏంటన్నట్లు చూసింది. లయ పంతంగా "నేను అన్నం తినను" అంది.

"ఎందుకని?" శ్రీకాంత్ లయ వీపుమీద చేయివేసి లాలనగా అడిగాడు.

"అమ్మ సత్తెమ్మను కొట్టింది!"

సుధ చివ్వున తలెత్తి లయను కోపంగా చూసింది.

"సత్తెమ్మను ఎందుకు కొట్టాలి? రెండు గులాబీ పూలిస్తే ఏంపోయింది? సత్తెమ్మ వాటికి రోజూ కావలా కాయటంలా? నీళ్ళు పొయ్యటంలా? నాన్నా సత్తెమ్మ మంచిది. గులాబీ పూలతో మాట్లాడుతుంది. అమ్మ సత్తెమ్మను ఎందుకు కొట్టాలి?" లయ దుఃఖాన్ని ఆపుకోలేక ఏడ్చింది.

"ఏంటి సుధా! సత్తెమ్మను కొట్టావా?" శ్రీకాంత్ తీవ్రంగా అడిగాడు.

ఐతే ఏమిటన్నట్లు నిర్లక్ష్యంగా చూసింది సుధ.

"సుధా! నీకు రోజురోజుకీ మతి పోతోంది. ఆ పూలకోసం పసిపిల్లను పట్టుకు కొడతావా? నువ్వు మనిషివేనా? రెండు పూలు ఆ పిల్లకిస్తే చచ్చిపోతావా?"

సుధకి ఒళ్ళు తెలియని కోపం వచ్చింది.

"అందరూ నా పూలమీద పడి ఏడుస్తారేం? నేను లక్షసార్లు చెప్పాను. మరో లక్షసార్లు చెప్తాను. వినండి. ఆ తోట నాది. ఆ పూలు నావి. అవి ఎవరికీ యివ్వను. ఈ విషయంమీద యింకొక్కసారి ఎవరైనా నోరెత్తారో చంపేస్తాను"

తింటున్న కంచంముందునుంచి లేచి వెళ్ళిపోయింది సుధ. లయ తల దించుకుని నిశ్శబ్దంగా కన్నీళ్ళు కారుస్తోంది. శ్రీకాంత్‌కి పిచ్చెక్కినట్లనిపించింది.

లయ కళ్ళు తుడిచి అన్నం తినిపించబోయాడు. ఎంత బతిమాలినా లయ వినలేదు.

"అమ్మని అన్నం తినమను. అమ్మ తింటే నేనూ తింటాను" అంది వెక్కిళ్ళు పెడుతూ.

శ్రీకాంత్ వెళ్ళి చూస్తే సుధ కూడా ఏడుస్తోంది.

"సుధా! లే! నువ్వు తింటేగాని లయ తిననంటోంది. పసిపిల్లను పస్తు పడుకోబెడతావా?"

"నేను రాక్షసిని. పసిపిల్లను పస్తు పడుకోబెట్టటమేంటి? చంపి తినేస్తాను"

"సుధా! నేను తొందరపడి ఏదో అన్నాను. నువ్వూ తొందరపడి సత్తెమ్మను కొట్టావు. మనిద్దరి మూలానా లయ అన్నం తినకుండా..."

"ఒక్కరోజు మాడితే దానికీ బుద్ధొస్తుంది. పెద్దవాళ్ళ వ్యవహారాల్లో కలగజేసుకోటం మానేస్తుంది"

"సుధా! ప్లీజ్... లయ అన్నం తినకుండా ఆకలితో పడుకోవటం నేను భరించలేను"

శ్రీకాంత్ సుధను బలవంతంగా లేపి టేబిల్‌దగ్గరకు తెచ్చాడు.

లయ తల దించుకునే ఉంది.

ముగ్గురూ మాట్లాడకుండా భోజనాలు చేశారు.

లయ, సుధ నిద్రపోయారుగానీ శ్రీకాంత్‌కు నిద్రపట్టలేదు. 'సుధలో ఈ పూలపట్ల యింత పొజెసివ్‌నెస్ ఎందుకు? స్వార్థపరురాలే. సందేహంలేదు. కానీ మిగిలిన విషయాల్లో కాస్త అటూ యిటూగానన్నా వుంటుంది. ఈ గులాబీల విషయంలో యిదేంపిచ్చి? ఎవరన్నా సైకియాట్రిస్ట్‌కి చూపిస్తే... సుధ ఒప్పుకుంటుందా? కానీ సుధ యిట్లా ప్రవర్తిస్తుంటే లయ ఏమవుతుంది? తల్లిని ప్రేమించలేకా ద్వేషించలేకా ఆ చిన్నారి హృదయం ఎంత యాతనపడుతుంది? లయను సున్నితంగా పెంచటంలో తను పొరపాటు చేశాడా? తల్లితోనే యింత సంఘర్షణ పడుతున్న పిల్ల పెద్దదయ్యాక సమాజంతో ఎంత స్ట్రగుల్ పడాలి? తన పాప సుఖపడదా? సుఖం అంటే ఏమిటి? కళ్ళముందు ఏం జరుగుతున్నా పట్టించుకోకుండా తింటూ నిద్రపోతూ వుండటమే సుఖమా? కళ్ళ ఎదుట జరుగుతున్న అన్యాయాన్ని ప్రశ్నించటంలో ఎదిరించటంలో ఏమీ సుఖంలేదా? దానివల్ల ఆనందం రాదా? అదే అచ్చమైన ఆనందం కాదా? అలాంటి

ఆనందం లయకు దొరుకుతుంది. ఏ కొంచెం మాంసం కూడా లేని ఎముకను నిరంతరం కొరుకుతూ అందులోనే ఆనందం కనిపెట్టిన కుక్కలాగా లయ తిండితో, నిద్రతో, బట్టలతో, నగలతో, చౌకబారు సినిమాలతో, షికార్లతో శున కానందం పొందకపోతే ఏం? నిజమైన ఆనందంకోసం అన్వేషిస్తూ తనలాగా రాజీపడ కుండా ఒక మనిషిలా జీవిస్తుంది. తనకు చేతనైతే సుధను మార్చాలి. లయ పెంపకాన్ని కాదు. దేశంలో మనుమలందరూ లయలాగే పెరగాలి. తన పెంపకం తప్పుకాదు' ఇలా ఆలోచిస్తూ ఏ తెల్లవారుఝాముకో నిద్రపోయా డు.

మర్నాడు కూడా తల్లీకూతుళ్ళు మౌనంగా ఎవరిపని వాళ్ళు చేసుకుని ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు. సుధ కాలేజీకి వెళ్ళాక రాత్రి సంగతి మర్చిపోయి రొటీన్‌లో పడింది. ఆమె రాత్రి జరిగినదంతా లయ మొండి తనం మూలంగాననే నమ్మింది. ఈ మొండి పిల్లను మార్చి కాస్త మనుమల్లో పడెయ్యాలని నిర్ణయించుకుంది. ఆ తర్వాత ఆమెనావి షయం బాధించలేదు.

మొదటి పిరియడ్ క్లాసు తీసుకుని స్టాఫ్ రూంలో కూర్చుని జయకోసం ఎదురుచూ స్తోంది. ఇంతలో ప్రిన్సిపాల్‌గారు రమ్మంటు న్నారంటూ అటెండరు వచ్చాడు.

ప్రిన్సిపాల్ చెప్పిన విషయం విని ముఖం చిట్లించింది సుధ. యూనివర్సిటీవాళ్ళు ప్ర పంచ ఆరోగ్యసంస్థ అభ్యర్థనమేరకు కొన్ని గ్రామాలలో న్యూట్రిషన్ సర్వేలు జరుపుతున్నా రట. ఒక పది టీములుగా ఏర్పడి కొన్ని గ్రామాలు తిరగాలి. ఈ పది టీములకూ ఒక కన్వీనర్ ఉన్నాడు. యూనివర్సిటీ లెక్చరర్లతో పాటు కొన్ని కాలేజీల లెక్చరర్లను కూడా తీసు కున్నారు.

"మన కాలేజీనుంచి మీ పేరు పంపుతున్నా ను" అన్న ప్రిన్సిపాలు మాటకు గుండెల్లో రాయిపడింది సుధకు. లేనిపోని తలనొప్పి. తనకెందుకొచ్చింది?

"నాకు కుదరదు సార్! మరెవర్నయినా పంపండి!"

"అందరూ యిలాగే అంటున్నారు. పైగా అందరూ ఏదో ఒకసారి ఏదో ఒక టీములో వెళ్ళారు. మీరు యింతవరకూ కనీసం ఎలక్షన్ డ్యూటీ కూడా చెయ్యలేదు. ఈసారి మీరు వెళ్ళక తప్పదు"

ముఖం మాడ్చుకుని ప్రిన్సిపాల్‌ని తిట్టు కుంటూ వచ్చేసింది. 'పదిహేను రోజుల తర్వాత ఒక ఆదివారం ధ్వంసం. ఒళ్ళు హూనం చేసుకుని ఆ పల్లెటూళ్ళన్నీ తిరిగి రావాలి. ఇంతజేస్తే రెమ్యునరేషన్ ఏమన్నా యిస్తారోలేదో! గాడిద చాకిరీ' అనుకుంటూ వచ్చింది.

జయ "ఏంటలా వున్నావు" అని అడి గింది.

లెక్చరర్లచేత ఏదో ఒక అదనపు చాకిరీ చేయించకపోతే మన ప్రిన్సిపాల్‌కి నిదరపట్ట దుగా"

"ఇప్పుడు ఏం చెయ్యమన్నాడు?"

"ఏదో సర్వే అంట. కాలేజీల్లో పాఠాలు చెప్తున్నాం చాలదూ?"

"ఏం పాఠాలు చెప్తున్నాం సుధా! ఈ వారంలో నువ్వెన్ని క్లాసులు తీసుకున్నావు?"

"బాగుంది. స్టూడెంట్స్ రాకపోతే నేనేం చెయ్యను?"

"నువ్వనేకాదు. మనం ఎవరమైనా పిల్ల లకు కావాల్సినట్లు వాళ్ళు యిష్టపడేలా పాఠా లు చెప్తున్నామా? అలా చెబితే వాళ్ళు వస్తారనే నా నమ్మకం"

"వాళ్ళకు గ్రేడ్లు చాలండీ. మనం చెప్పేది అక్కర్లా" వీళ్ళ మాటలు వింటున్న తెలుగు లెక్చరర్ ప్రసాద్ అన్నాడు.

"ఇంతకూ అసలు విషయం ఏమిటంటే మనం చెప్పే పాఠాలు వాళ్ళకు ఉపయోగప డవు"

ఇంకొకరెవరో అన్నారు.

"మొన్న యూనివర్సిటీకి వెళ్ళాను నా పి.హెచ్‌డి విషయంలో ప్రొఫెసర్‌గారిని కలు ద్దామని. వెళ్ళేసరికి డిపార్ట్‌మెంటంతా యుద్ధ రంగంలా వుంది. స్టూడెంట్లు ఏమడుగుతున్నా రో తెలుసా? వాళ్ళు ఏం రాసినా ఎలా రాసినా, అసలు రాయకపోయినా 60 మార్కులు




యిచ్చితీరాలట. అలా యివ్వకపోతే అసలు డిపార్ట్‌మెంట్‌నే లేపేస్తారట. చివరికి లెక్చర ర్లందరూ ఒప్పుకున్నారు''

''సబ్జెక్టు రాకుండా మార్కులేం చేసుకుంటా రు?''

''వాళ్ళు చదివిన సబ్జెక్టుకూ, వాళ్ళకొచ్చే ఉద్యోగాలకీ సంబంధం ఉండదు''

''అన్నిచోట్లా అది నిజంకాదు. టీచర్లుగా, లెక్చరర్లుగా సబ్జెక్టు రానివాళ్ళు వచ్చి పిల్లల కేం చెబుతారు? ఇవాళ పిల్లల చదువులందు కే అలా తగలడుతున్నాయి''

''ఆ మాట కాలేజీల్లోకొచ్చేసరికి యింకా పెద్ద దవుతోంది. మంచి ఖరీదైన స్కూళ్ళల్లో రెసిడె న్షియల్ కాలేజీల్లో చదవగలిగిన వర్గం మళ్ళీ అలాంటివాళ్ళకు ఉపయోగపడుతుంది. ఇప్పు డిక్కడ ప్రభుత్వ పాఠశాలల్లో, కాలేజీల్లో పనికి మాలిన చదువు చదువుకున్నవాళ్ళు ఎందుకూ పనికిరాకుండా పోతున్నారు. అసలు చదువురాని పల్లెటూరి రైతులకూ, పనిచేసుకు నేవాళ్ళకూ కాస్త కామన్‌సెన్సు అన్నా వుంటుంది. వీళ్ళ కామన్‌సెన్సుని కూడా నాశ నంచేస్తాయి ఈ చదువులు''

''ఈ చదువులు ఎందుకూ పనికిరావటంలే దని అందరికీ తెలుసుగదా! ఎందుకని ఈ పద్ధతి మార్చుకుందామని అనుకోరు?''

''ఎందుకంటే ఎన్ని విషయాలు తెలిసినా మనలాంటివాళ్లం ఈ పద్ధతి మూలాన లాభప డుతున్నాం. ట్యూషన్లమూలానా బిజినెస్‌లు చేసుకునీ డబ్బు సంపాదించుకోవటం మనకు సుఖంకాదూ? సిస్టమ్ అంతా మారితే ఈ వెసులుబాటు ఉండదుగదా!''

''మీరు మరీ అలా మాట్లాడకండి. పిల్లలు శ్రద్ధగా వింటే చక్కగా పాఠాలు చెప్పటానికి మనందరం సిద్ధమే''

''పిల్లలకు శ్రద్ధ లేదుగాబట్టి చెప్పటంలే దని మనం, మాస్టర్లు చెప్పటంలేదుగాబట్టి మాకు శ్రద్ధ లేదని పిల్లలు. అసలు సమస్య అది కాదనుకుంటాను''

అందరూ గోలగోలగా మాట్లాడటం మొద లుపెట్టారు. ఎలాగోలా మనతప్పు లేదని అందరూ ఆత్మసమర్థన చేసుకునేవరకూ ఆ గోల అణగలేదు. ఆ తర్వాత మన ఒక్కళ్ళవ ల్లా ఏమవుతుంది? అంతా సరిగా వుంటే మనమూ సరిగా వుంటాం అనుకుని శాంతిగా ఇళ్ళకు వెళ్ళిపోయారు.

అసలీ చర్చంతా ఎక్కడ ఎందుకు మొదల యిందా అని ఆలోచనలో పడింది జయ.

★ ★ ★

సుధకు ఆరోజు యూనివర్సిటీనుంచి వివ రంగా నోటీసు వచ్చింది. రంగారెడ్డి జిల్లాలో వీళ్ళు సర్వే చెయ్యాల్సిన గ్రామాల పేర్లూ, ఎప్పుడు బయల్దేరాల్సిందీ, ఎలా వెళ్ళేదీ, ఎప్పుడు తిరిగొచ్చేదీ వివరంగా రాశారు.

సుధ అది చదువుకుని ప్రపంచంలో ఎవరి కీ రాని కష్టం తనకే వచ్చినట్లు ఫీలవుతూ కూచుంది.

జయ వచ్చి ఏమిటని అడిగితే ఆ కాగితం ఆమెచేతిలో పెట్టింది. జయ అదంతా చదివి - ''ఈ సర్వేకెళ్ళటానికి యింత గొడవ చేస్తు న్నావు. నాకూ రావాలని వుంది. కుదురు తుందా?'' అంది.

''పోనీ నా బదులు నువ్వెళ్ళు. వెళ్తావా?'' అంది సుధ ఆశగా.

''అలా వద్దు. నువ్వు వెళ్ళాల్సిందే. నిజంగా చాలా బాగుంటుంది. ఊళ్ళకు వెళ్ళటం అక్కడ జనంతో మాట్లాడటం మనకా అవకాశం మామూలుగా ఉండదుగదా! మీ జీపులో చోటుంటే నేనూ వస్తాను. లేకపోతే రాను. నువ్వు తప్పకుండా వెళ్ళు''

''జీపులో చోటెందుకుండదు. టీములో ఐదు గురేగదా వుంది. జీపులో ఎనిమిదిమంది తేలి గ్గా వెళ్ళొచ్చు. నువ్వొస్తే నాకు బోరు కొట్టకుండా నన్నా వుంటుంది... రా'' అంది సుధ.

జయ మరొకసారి ఆ నోటీసు చదివి, టీములో వున్నవాళ్ళెవరో చూసి ''ప్రొఫెసర్ రామారావుగారంటే ఎకనామిక్స్ ప్రొఫెసరేనా?''

''ఔననుకుంటా''

''ఆయనే అయితే మనం చాలా అదృష్ట వంతులం'' జయ ఆనందంగా అంది.

''అదేంటి?'' అంది సుధ జయ ఆనందం ఎందుకో అర్థంగాక.

''ఆయన మనదేశంలోనే పెద్ద ఆర్థిక శాస్త్రవే

త్త. ఆయనన్నడిగి చాలా విషయాలు తెలుసుకో వచ్చు. నేను ఆయన రాసిన వ్యాసాలు చాలా చదివాను''

''ఎందుకు చదువుతావు అవన్నీ'' సుధకు జయను చూస్తే అప్పుడప్పుడూ ఆశ్చర్యం.

ఇద్దరు పిల్లల తల్లి. ఎప్పుడూ పిల్లల చదువు గురించి మాట్లాడదు. వాళ్ళ అల్లరి గురించి మాట్లాడదు. వాళ్ళకోసం సంపాదించాలనుకోదు. పొదుపు చెయ్యాలనుకోదు. ఇల్లు కట్టుకోవటం గురించో, ఇన్స్యూరెన్సు చేయటం గురించో మాట్లాడదు. తన సబ్జెక్టు బాటనీగదా, ఆ విషయాలు చదివి వూరుకోదు. రాజకీయాలు, ఆర్థిక పరిస్థితి, విద్యావిధానం... ఇవే గొడవ. చిన్నప్పటికీ యిప్పటికీ చాలా మారింది అనుకుంటుంది సుధ.

సుధకు తెలిసినట్లు డి.ఎ., హెచ్చార్ఏ, పి.యఫ్. విషయాలు జయకు తెలియవు. కొత్తగా ఉద్యోగంలో చేరిందిగదా యివన్నీ చెబుదామని సుధ ప్రయత్నిస్తే జయ బుర్రకెక్కించుకోలేదు.

''నీ జీతం సంగతి నువ్వు పట్టించుకోవు. దేశం సంగతి నీకెందుకూ?'' అంటుంది సుధ.

''నాకు జీతం రావటానికి దేశంలో ఒక పద్ధతి వుంది. ఆ పద్ధతిలో పొరపాట్లు జరిగితే పోట్లాడటానికి యూనియన్లు వున్నాయి. యూనియన్ వాళ్ళమీద నాకు నమ్మకముంది. కానీ ఈ దేశంలో ఒక పద్ధతి లేకుండా అనేక పనులు జరుగుతున్నాయి. అక్కడ ఒక పద్ధతి ఏర్పడాలంటే మనలాంటివాళ్ళందరం ఆలోచించాలి'' అంటుంది జయ.

ఆ పద్ధతిలేని పనుల లిస్టుకి అంతూ పొంతూ ఉండదు. జయ దృష్టిలో ఏదన్నా బాగున్నదంటూ ఉంటుందా అని ఆశ్చర్యపోతుంది సుధ.

జయ కాలేజీలో చేరాక సుధకు కూడా ఎంత వద్దన్నా ఏదో ఒక విషయంమీద ఆలోచించక తప్పటంలేదు. కానీ ఎంత ఆలోచించినా 'ఎవరిలాభం ఎవరు మానుకుంటారు? ఎందుకు మానుకుంటారు? ఊళ్ళోవాళ్ళకు ఉపకారం చేసి ఎవరు ఉపవాసం ఉంటారు? మనబాగు మనం చూసుకోవాలి. మనం సంపాదించాలి, అనుభవించాలి. ఇతరులకోసం ఆలోచిస్తూ కూచుంటే మన సంగతేం కావాలి? తనకుమాలిన ధర్మం మొదలుచెడ్డ బేరం అన్నారు' అంటుంది.

''మనం బతకాలి నిజమే... కానీ మనతోపాటు యితరులూ బతకాలిగా''

''అది వాళ్ళు చూసుకుంటారు. ఇతరుల గురించి ఆలోచిస్తే ముందు మనం మునిగిపోతాం''

ఇద్దరిమధ్యా వాదన తెగేదికాదు.

''ఇవాళ రాత్రి మా యింటికి రా. అక్కడే పడుకొని పొద్దున్నే లేచి యూనివర్శిటీకి వెళ్లాం'' అంది సుధ.

''మీ లయను చూడాలని వుంది. వస్తాను'' అంది జయ.

వీళ్ళిద్దరూ వెళ్ళేసరికి శారద, సావిత్రమ్మ వచ్చివున్నారు. వాళ్ళను చూసి ఎందుకో తెలియకుండా నిట్టూర్చింది సుధ. లయ శారదత్తతో తెగ కబుర్లు చెప్పేస్తోంది.

తన కూతురు తనతోకంటే మేనత్తతో ప్రేమగా ఉంటుందనిపించి సుధ మనస్సు చివుక్కుమంది. హఠాత్తుగా సుధకు తను చాలా ఒంటరిదాన్ననిపించింది. ఎవరున్నారు తనకు? శ్రీకాంత్‌కు తనకంటే ప్రపంచంలో అన్ని విషయాలూ ముఖ్యమే. లయంటే ప్రాణం ఒదులుతాడు. లయ కూడా తండ్రిని విడవకుండా తిరుగుతుంది. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటారు. నవ్వుకుంటారు. తను? ఇంటాబైటా చాకిరీ చేస్తుంది. డబ్బు పైసాపైసా కూడబెట్టి ఇల్లు కట్టించింది. ఈ ఇల్లుమాత్రమే తనది. శారద, శ్రీకాంత్, లయ అందరూ ఒకటి. తనతో కలవరు. తనకేం కావాలి? ఇల్లేనా? తోటేనా? ఇవాళెందుకు లయ శారదతో ప్రేమగా ఉంటే తనకిలా బాధగా వుంది?

వంటచేస్తున్నదేగానీ సుధ మనసు పొయ్యితో సమానంగా మండుతోంది. ఇక పొయ్యి దగ్గర వుండలేకపోయింది. హాల్లోకి వచ్చింది. అందరూ మాటలు ఆపేశారు.

''నాకు తలనొప్పిగా వుంది. వంట చెయ్యలేను'' అంది కాస్త కటువుగా.

శారద వెంటనే లేచి సుధ చెయ్యిపట్టుకుని




చూసింది. "జ్వరం లేదు"

సుధ ముఖం పరిశీలనగా చూసి

"బాగా అలిసిపోయినట్లున్నావు. నేను టాబ్లెట్ యిస్తాను వేసుకుని పడుకో. వంటదేముంది నేను చేస్తాను" అంది.

టాబ్లెట్ యిచ్చి సుధను పడుకోబెట్టి వచ్చింది. జయకు యిదంతా చాలా యిబ్బందిగా అనిపించింది. ఇంతసేపూ తను వంటగదిలోకి వెళ్ళకుండా లయతో, శారదతో మాట్లాడుతూ కూచుంది. సుధ పాపం ఒంటరిగా ఫీలైందేమో! కానీ ఏం చెయ్యాలి. సుధ మాటలకంటే తనకు లయ మాటలే బాగుంటాయి.

జయ తప్పనిసరై సుధతో పాటు గదిలోకి వెళ్ళి కూచుంది. సుధ కళ్ళు మూసుకుని పడుకుంది.

"నిద్రపోతావా?" అడిగింది జయ.

"ఇప్పుడేం నిద్ర?"

"ప్రయత్నించు- రేపు మళ్ళీ చాలా తిరగాలి గదా"

"ఊఁ" అని మూలిగి కళ్ళు మూసుకుంది సుధ. జయ కాసేపు కూచుని వంట గదిలోకి వచ్చింది. శ్రీకాంత్ శారదలు ఒకరితో ఒకరు పోటీపడి వంటయింట్లో పనిచేస్తున్నారు.

చిన్నప్పుడు వాళ్ళిద్దరూ కలిసి ఎట్లా వండేవారో గుర్తుకుతెచ్చుకుని నవ్వుకుంటున్నారు. సావిత్రమ్మా వాళ్ళిద్దరి అల్లరి గురించీ లయకు చెబుతుంటే లయ ఆనందంగా చప్పట్లు కొడుతూ నవ్వుతోంది. ఐదు నిమిషాల్లో జయ కూడా ఆ వాతావరణంలో కలిసిపోయింది. కొత్తలేకుండా శారద, శ్రీకాంత్‌తో మాట్లాడేస్తోంది.

"నాన్నా- రోజూ మనం యిట్లాగే వంట చేసుకుందాం నాన్నా" లయ సంబరంగా అంది.

"అమ్మ మనల్ని రానివ్వదురా" శ్రీకాంత్ నవ్వాడు.

"మనమే అమ్మని రానివ్వద్దు" లయ అనేసింది.

శ్రీకాంత్ ముఖం వాడిపోయింది. ఈ పదేళ్ళలో వంట గదిలో ఏనాడూ లయను సంబరంగా గడపనివ్వని సుధ ఏం పోగొట్టుకుందో శ్రీకాంత్‌కు కాక మరెవరికి అర్థమవుతుంది?

వంట చేయటం పూర్తయ్యాక జయ వెళ్ళి సుధను లేపింది.

"మీరు తింటూ వుండండి నేను స్నానం చేసి వస్తాన"ని వెళ్ళింది సుధ.

శ్రీకాంత్ సహాయంతో లయ టేబిల్ మీద ప్లేట్లూ, గ్లాసులూ సర్దింది.

అందరూ భోజనాలకు కూర్చున్నారు. సుధకు అసహనంగా వున్నా దానిని ఎట్లా బయట పెట్టాలో అర్థంకాలేదు. వంకపెట్టటానికి లేకుండా కుదిరాయి కూరలన్నీ. శారద మెల్లిగా అప్పుడు చెప్పింది

"సంతోష్‌నగర్ చివర్న ఒక స్లమ్ ఉంది. అక్కడ చిన్న క్లినిక్ తెరుస్తున్నాను. ఇవాళ ఉద్యోగానికి రిజైన్ చేశాను. సరిగ్గా వచ్చే శనివారంనాడు ఆ క్లినిక్ ఓపెనింగ్. లయా... నువ్వే చెయ్యాలి"

శ్రీకాంత్ సంతోషంతో అన్నం తింటున్నానని మర్చిపోయి చప్పట్లు కొట్టేశాడు.

లయ "నేనా!" అంటూ సిగ్గుపడిపోయింది.

"మీ అక్కా, తమ్ముళ్ళలాగా దాన్ని కూడా పనికిరాకుండా చెయ్యండి" సుధ ఆ మాటలు అనకుండా తనను తాను కంట్రోలుచేసుకోలేకపోయింది.

శారద, శ్రీకాంత్‌లు తెల్లబోయారు.

"ఏం మాటలు సుధా అవి. శారదగారు అంత మంచిపని చేస్తుంటే" అంది జయ.

"మంచి పని... హుఁ" నిరసనగా నవ్వింది సుధ.

ఈ సంభాషణ ఎలాగైనా ఆగిపోతే బాగుండుననుకుంటున్నాడు శ్రీకాంత్. లయ వింటుండగా సుధ యిలా మాట్లాడటం గురించి శ్రీకాంత్ ఈమధ్య బాగా భయపడుతున్నాడు.

"మంచిపనికాక ఏమిటి? ఈ రోజుల్లో ఎవరు తమ సుఖం చూసుకోకుండా బీదవాళ్ళకోసం ఆలోచిస్తారు? అది మంచిపని కాదా?"

"తెలివితక్కువ పని. సుఖాన వున్న ప్రాణాన్ని కష్టపెట్టుకోవటం. ఐనా నాకెందుకు"



''పోన్లే సుధా నేను తెలివితక్కువదాన్నే. ఒదిలెయ్'' అంది సుధ సంగతి తెలిసిన శారద.

అందరూ మౌనంగా భోజనాలు ముగించా రు. చేయి కడుక్కోటానికి లేస్తూ లయ అంది

''వంట ఎంతబాగా చేసుకున్నామో తినటం మాత్రం సీరియస్‌గా తిన్నాం. ఏం బాగోలా''

''ఏం బాగోలేదే నీకు? వాగుడెక్కువ యింది'' అంది సుధ చిరాగ్గా.

''నువ్వట్లా చిరాకుపడటమే బాగోలా. నువ్వు లేకుండా వంట హాయిగా చేసుకున్నాం. ఇప్పు డు నువ్వు అత్తను తిట్టి అంతా పాడుచేశావు''

''నేను అత్తను తిట్టానా'' సుధ విస్తుపో యింది.

''చిన్నపిల్ల దానికి తెలియదులే సుధా. లయా! నీకేం తెలియదు పూర్కో'' శారద సర్దబోయింది.

''అది చిన్నపిల్లకాదు. నాకు పెద్ద శత్రు వులా తయారయింది. తండ్రీ కూతుళ్ళిద్దరూ అంతే. ప్రతిదానికీ నామీదే ఒంటికాలిమీద లేస్తారు. నేనేం చేశాను. పెళ్ళయిన దగ్గర్నించీ ఏం సుఖపడ్డాను. రాత్రీ, పగలూ కష్టపడి సంపాదించి ఈ ఇల్లు కట్టించాను. ఇప్పుడు ఈ ఇంట్లో చేరి నాకే ఒంకలు పెడుతున్నారు. నాకెవరూ లేరు'' సుధ తనేం మాట్లాడుతుందో తనకే తెలియకుండా మాట్లాడుతోంది.

ఇంటి విషయం అందరిముందూ సుధ అలా అంటుంటే శ్రీకాంత్‌కి చాలా కష్టమని పించింది.

''అయితే ఏమంటావు- నీ ఇల్లు యిది. మమ్మల్ని వెళ్ళి పొమ్మంటావా?''

''ఏం మాటల్రా అవి? సుధా... నీకు ఒంట్లో బాగోలేదుగానీ వెళ్ళి పడుకో. శ్రీ...నువ్వు లయ ను తీసికెళ్ళి నిద్రపుచ్చు. ఫో ముందు'' శ్రీకాంత్‌ని గద్దించింది తల్లి.

''సుధా- రా- ఈ టాబ్లెట్ వేసుకుని పడుకో హాయిగా నిద్రపడుతుంది'' అంటూ సుధను లాక్కెళ్ళింది శారద. లయ తనతోపాటు సావి





త్రమ్మను కూడా లాక్కెళ్ళింది. తండ్రి కోపాన్ని నాయనమ్మ తగ్గిస్తుందనుకుంది. జయ ఒక్కతే డైనింగ్‌హాల్లో నిలబడిపోయింది. హఠాత్తుగా ఉరుమూ మెరుపూ కూడా లేకుండా వచ్చిన గాలివాన అంత హఠాత్తుగానూ మాయమ యింది. ఈ మొత్తం గొడవలో నా పాత్రేమిటి? నేనెందుకు? ఇవాళ అసలు యిటెందుకొచ్చా ను. ఇదంతా నా కళ్ళముందు జరిగినందుకు సుధ రేపట్నించీ నాతో ఎలా వుంటుంది? మా సంబంధం ఎలా మారుతుంది? అసలు సుధ ఎందుకిలా వుంది? పదేళ్లపాటు స్వంత ఇంటి కోసం సర్వశక్తులూ ధారపోసి చివరకు ఆ ఇంట్లో యింత అశాంతిగా ఉంటోందా? ఇల్లంటే ఏమనుకుంది? బలమైన గోడలూ, ఖరీదైన ఫ్లోరింగూ, గట్టి రూఫు, ఇంటినిండా ఫర్నీచరు, ఇంటిముందు అందమైన తోట. ఇదేనా ఇల్లంటే? ఒకరికి దూరంగా ఒకరు బతకలేని మనుషులు మెసిలేచోటు కదూ ఇల్లంటే,

ఆ మనుషులమధ్య సంబంధాలు కదూ ఇల్లంటే- ఆ సంబంధాలు యిలావుంటే-

లయవంటి కూతురితో ప్రేమగా వుండలేని తల్లి- ఇది కాదు యిల్లని సుధకు చెబితే బాగుండు. ఆలోచిస్తూ జయ హాల్లోకి నడిచి అక్కడున్న సోఫాలో కూచుంది.

బహుశ సుధకు కూడా అందుకేనేమో అశాంతి- 'ఇన్నాళ్ళూ ఇంటికోసం భర్తతో, కూతురితో సంబంధాల గురించి పట్టించుకోలే దు. ఇప్పుడు ఇల్లు ఏర్పడ్డాక వాళ్ళతో సరైన కమ్యూనికేషన్ లేక, ఎట్లా ఏర్పరుచుకోవాలో తెలియక అల్లాడిపోతోందేమో- సుధ సమస్య ఏమిటో? ఆమె మనసు ఎవరికీ తెలియకుండా దాచేసింది. ఆమె అశాంతిని వివరంగా కను క్కుని విశ్లేషించి పోగొట్టే మానసిక వైద్యుడు కావాలేమో' సుధమీద జాలివేసింది జయకు.

అంతలో శారద హాల్లోకి వచ్చింది. ఆమె వెనకాలే శ్రీకాంత్, సావిత్రమ్మా వచ్చారు.

''లక్కీగా నా బ్యాగ్‌లో కాంపోజ్ మాత్రలు న్నాయి. తొందరగానే నిద్రపోయింది. ఎందుకో యివాళ చాలా యాజిటేటెడ్‌గా వుంది. లయ మీద కోపంగా వుంది ఎందుకు?''

శారద మాటలకు విషాదంగా నవ్వాడు శ్రీకాంత్.

"ఆమె సంగతి నీకు తెలియనిదేముంది? ఆ స్వభావం అంతే"

"స్వభావం అంతేగానీ ఇవాళ మరీ చిత్రంగా ప్రవర్తించింది. ఇంతకుముందెప్పుడూ లయపట్ల యిలా ద్వేషంగా మాట్లాడలేదు"

"పదిహేను రోజులక్రితం పెద్ద గొడవ జరిగింది" సత్తెమ్మను సుధ కొట్టిన విషయం, లయ తల్లిమీద పోట్లాడటం వివరంగా చెప్పాడు శ్రీకాంత్.

"మితిమీరిన స్వార్థంతో సుధకు ఏం చెయ్యాలో తెలియటంలేదేమో అనిపిస్తుంది. మగాడైతే ఏ వ్యాపారమో చేసి డబ్బు సంపాదనలో పడి తనన్నా శాంతిగా బతికేవాడేమో- సుధకిప్పుడు ఆ గులాబీతోటను రక్షించటం తప్ప మరో పనిలేదు. ఆ పని చాలటంలేదు. ఇక నన్నూ లయనూ రానురాను బాగా విసిగిస్తుందేమో అనిపిస్తోంది" శ్రీకాంత్ భారంగా అన్నాడు.

జయ తన వునికిని తెలియజేస్తూ మెల్లిగా దగ్గింది. శ్రీకాంత్ ఉలిక్కిపడ్డాడు. సుధ స్నేహితురాలి ముందు ఆమె గురించి యిలా మాట్లాడటం పద్ధతేనా?

"సారీ జయగారూ- మా గొడవలతో మిమ్మల్ని బాగా యిబ్బంది పెట్టినట్లున్నాం. మీరు పడుకుంటారా?"

"పడుకుంటాను గానీ- సుధ గురించి మీకెవరికీ తెలియని సంగతి నాకు తెలును. మీరది వింటే సుధ గురించి కొంచెం అర్థమవుతుందేమో- సుధకి మనం సహాయపడగలమేమో"

అందరూ ఆసక్తిగా జయవంక చూశారు.

సావిత్రమ్మ హఠాత్తుగా కలగజేసుకుని "మనం లేనిపోనివన్నీ వూహించుకుంటున్నామేమో అనిపిస్తోందర్రా. పాపం సుధ తప్పేమిటి? ఈ రోజుల్లో అందరూ అట్లాగే వుంటున్నారు. మీలాగా ఎవరూ ఉండరు. శ్రీకాంత్ మీ పక్కింటి మాణిక్యవల్లి సంగతి నువ్వే చెప్పావుగా- శారదా మన యింటివెనక ఆనందలక్ష్మి అత్తామామల్ని ఎట్లా తరిమేసింది- అత్తా, మొగుడూ కలిసి కిర్సనాయిలు పోసి తగలేస్తే ఒళ్ళు కాలి నీ దగ్గరకెంతమంది రాలేదూ? మన సుధ వాళ్ళతో పోలిస్తే ఎంతో మంచిది. మన బాగు మనం చూసుకుందామంటుంది. ఒక్క పిసరు స్వార్థం వుంటే తప్పులేదు. అది లేకపోతే ఈ రోజుల్లో బతకలేం"

"నిజమేగాని అమ్మా- సుధ దురదృష్టంకొద్దీ నేను భర్తగా దొరికాను. లయ మా కూతురిగా పుట్టింది. అది కూడా సాధ్యమైనంతవరకూ వాళ్ళమ్మను ప్రేమించాలనే అనుకుంటుంది. రానురానూ సుధ మాటలూ, చేష్టలూ అది భరించలేకపోతోంది. వాళ్ళిద్దరిమధ్యా ఎడాన్నీ ఆ ఎడంవల్ల లయపడే బాధనూ నేను భరించలేకపోతున్నాను" శ్రీకాంత్ ఆవేదనగా అన్నాడు.

"జయగారు ఏదో చెప్తానన్నారు" శారద వాళ్ళిద్దరినీ ఆపి గుర్తుచేసింది.

శ్రీకాంత్ సిగ్గుపడుతూ "సారీ- చెప్పండి" అన్నాడు.

జయ యిబ్బంది పడుతూనే మొదలెట్టింది. ఒక్కసారి తన చిన్నతనంలోకి వెళ్ళింది. తనూ, సుధా కలిసి గడిపిన రోజుల్ని కష్టపడి గుర్తుకు తెచ్చుకుంది. తమ కుటుంబాల దారిద్ర్యం, ఆ దరిద్రాన్ని పట్టించుకోకుండా తాము కన్న కలలూ, ఆడిన ఆటలూ, పాడిన పాటలూ చెప్పింది. అందరితో కలసిమెలసి వుండే సుధను, తనతో ప్రాణస్నేహం చేసిన సుధనూ అందరికీ పరిచయం చేసింది. లేమివల్ల కుటుంబంలో అక్కచెల్లెళ్ళమధ్యా, అన్నా చెల్లెళ్ళమధ్యా అనివార్యంగా జరిగే పోట్లాటలు ఎలా వుండేవో చెప్పింది. వీటన్నిటిలోంచి వాళ్ళ యింటిపక్కన వెలిసిన బంగళా గురించీ, అందులోని రాకుమారి గురించీ, రాక్షసి గురించీ, ఇంటిముందు మనోహరమైన గులాబీ తోట గురించీ చెప్పింది. ఒక్క గులాబీని సొంతం చేసుకోవటం కోసం రోజుల తరబడి వాళ్ళు పడిన ఆరాటాన్ని గురించీ, చివరకు తప్పనిసరై చేసిన దొంగతనాన్ని గురించీ, ఆ దొంగతనంవల్ల పొందిన శిక్ష గురించీ చెప్పింది.

ఆ బాల్యపు రోజులలోకి వెళ్లి చూస్తున్న జయ - సుధ తిన్న దెబ్బలను గుర్తుచేసుకుని



మళ్ళీ మరోసారి సుధకోసం కంట తడిపె ట్టింది.

శారదా శ్రీకాంత్‌లు చలించిపోయారు.

"జరిగిన అవమానానికీ, ఎన్నడూ చేయి ఎత్తని తండ్రి కొట్టిన దెబ్బలకూ సుధ మనను కరడుగట్టి పోయిందని నా నమ్మకం. ఆ దెబ్బ లు తగ్గాక మొదటిసారి బడికి వెళ్తూ ఆ బంగళావంక సుధ చూసిన చూపూ, 'నేను ఇల్లు కట్టించుకుని యింతకంటే పెద్ద గులాబీ తోట పెంచుతా'నని పంతంగా, కక్షగా సుధ పలికిన మాటలూ నేనెప్పుడూ మర్చిపోలేదు. సుధ గుర్తొచ్చినప్పుడల్లా ఆమె కళ్ళల్లో ఆనాడు కనిపించిన కసి, కోపం, ఆశ, పొజెసివ్‌నెస్ అన్నీ నాకు కళ్ళకు కట్టినట్లు కన్పిస్తాయి.

ఆ అనుభవమే సుధనింత పిచ్చిదానిగా చేస్తోందేమో ఆలోచించండి. ఎవరినన్నా సైకి యాట్రిస్ట్‌ని సంప్రదించాలేమో! శారదగారూ మీరు ఆలోచించండి. మీలాంటి మంచి మను షులమధ్య వున్న సుధ బాధపడగూడదు. జీవి తాన్ని అశాంతిమయం చేసుకోకూడదు. రకర కాల పరిస్థితుల్లో రకరకాల మనుషులతోటి సంబంధాల్లో మనుషులు కరడుగట్టిపోతున్నా రు. కానీ అన్నీ అనుకూలంగా వుండి సుధ కరడుగట్టటం ఎందుకు? లయకోసమైనా మీ రు ఆలోచించండి. సుధకు సహాయపడండి"

చాలాసేపు అందరూ నిశ్శబ్దంగా ఆలోచిస్తూ కూర్చుండిపోయారు.

"మీరీవిషయం చెప్పటం ఎంతో మంచిద యింది. నిజానికి సుధకు సహాయం మొదల యినట్లే. ఆలోచిద్దాం ఏం చెయ్యాలో'

శారద రిలీఫ్ ఫీలవుతూ అన్నది "పడు కుందాం పదండి. పొద్దున్నే మీరు ఊరెళ్లాలి కూడా" అంటూ లేచింది సావిత్రమ్మ.

శారదకూ, సావిత్రమ్మకూ హాల్లో పక్కలు వేశాడు శ్రీకాంత్.

జయ లయగదిలో పడుకుంది.

శ్రీకాంత్ తన గదిలోకి వెళ్లాడు. మంచంమీద సుధ ఆదమరచి నిద్రపోతోంది. కిటికీలోంచి పడుతున్న చంద్రకిరణాల కాంతిలో ఆమె ముఖం ఎన్నడూలేనంత కరు ణాపూరితంగా కనిపించింది శ్రీకాంత్‌కు.

ఆమె పక్కనే పడుకుని ఆమె ముఖంలోకి చూశాడు. నుదుటిమీద చిన్నగా ముద్దుపెట్టు కున్నాడు. సుధ చిన్నతనం గురించి తెలిశాక శ్రీకాంత్‌కి ఆమెమీద అంతులేని జాలి కలి గింది.

చిన్ననాడు ఆమె మనసులో ఏర్పడిన గడ్డు నూ, దాని తాలూకు బాధనూ ఎలాగైనా తుడిచి వేయాలని అతని మనసు ఆరాటపడింది.

గరుకుగా తగులుతున్న ఆమె అరిచేతుల్ని మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు.

'ఇల్లు... ఇల్లు... ఇల్లు అని ఆరాటపడు తుంటే యింత చిన్న వయసులో ఎందుకింత తాపత్రయం, దానికోసం ఎందుకింత కష్టప డటం?' అని సుధమీద కోపం తెచ్చుకున్నాడు. చిన్నతనంలో ఆమెకు తగిలిన దెబ్బల సంగతి తెలిస్తే తనూ ఆమె కష్టాన్ని పంచుకునేవాడు కదూ! సుధ చెప్పుకోలేదు. అప్పటికే యితరు లకు ప్రవేశం లేకుండా ఆమె హృదయాన్ని మూసేసుకుంది. తనిపుడు ఆ హృదయాన్ని తెరవాలి. దానికి ఏం చెయ్యాలి? ఎవరన్నా యిలా చెయ్యమని చెబితే ఎంత బాగుండు. సైకియాట్రిస్టు దగ్గరకు రమ్మంటే సుధ ఒస్తుందా? ఆ ట్రీట్‌మెంట్ తీసుకుంటుందా? నమ్మకం లేదు. ఎలా? ఏం చెయ్యాలి? శారద క్క సహాయం చేస్తుంది! భారమంతా శారద మీద వెయ్యాలనే నిర్ణయంతో, తేలికపడిన మనసుతో నిద్రపోయాడు శ్రీకాంత్.

★ ★ ★

ఉదయం ఆరు గంటలకే నిద్ర లేచింది సుధ. రాత్రి జరిగిన సంఘటనంతా ఒక్కసారి గుర్తొచ్చింది. జయ యిక్కడే వుందని కూడా గుర్తొచ్చింది.

"వెధవ గొడవ జయ వున్నప్పుడే జరగాలా! ఏమనుకుంటుందో' లేచి జయకోసం వెది కింది. లయ గదిలో లయ పక్కనే పడుకుని వుంది జయ. లయ జయ మెడమీద చెయ్యి వేసి నిద్రపోతోంది. అమాయకంగా నిద్రపోతు న్న లయను చూస్తే సుధకు జాలీ, ప్రేమా పొంగుకొచ్చాయి.

"అనవసరంగా పిల్లని తిట్టాను. నిన్న ఏంటో పిచ్చి పట్టినట్లయింది" అనుకుని




వంటింట్లోకి నడిచింది. లయ తనకంటే యిత రులను ప్రేమిస్తున్నందుకు తనకు లయ మీద కోపంగా వుందనీ, లయ ప్రేమ పొందా లనీ అపుడే ఈ అశాంతి పోతుందనీ సుధకు తెలియదు.

ఎనిమిది గంటలకంతా యూనివర్సిటీకి వెళ్ళాలి. ఆ పల్లెటూళ్ళలో ఏం దొరుకుతాయో ఏం దొరకవో మనం ఇళ్ళ దగ్గర్నించి తింటాని కి ఏదన్నా తీసుకుని వెళ్ళాలని నోటీసులో రాసింది గుర్తుకువచ్చింది.

పూరీలూ, కూరా చేసుకువెళ్దామనుకుని పిండి కలుపుతుంటే శ్రీకాంత్ లేచి వచ్చాడు.

"మీరు తొందరగా వెళ్ళాలేమోగా- బయట హొటల్లో ఏదన్నా తినరాదూ? ఇప్పుడింత మందికి టిఫిన్ చెయ్యాలంటే టైము చాల దేమో" అన్నాడు.

"ఫరవాలేదు. పూరీలు చేస్తాను. టిఫిన్‌కనే కాదు మేం కూడా పట్టుకెళ్ళాలి" అంది సుధ.

"ఐతే నేను కూరలు తరిగిపెడతాను. ఒద్ద నకు" అంటూ కత్తిపీట తీసి నేలమీద మఠం వేసుకుని కూచున్నాడు.

"ఏమేం తరగాలో తెచ్చిచ్చి, ఎలా తరగాలో వివరంగా చెప్పు" తమాషాగా అంటున్న అత న్ని చిత్రంగా చూసింది సుధ.

"సుధా- రాత్రి జరిగిందానికి నేను చాలా బాధపడుతున్నా" బంగాళాదుంపలు ఇవ్వటా నికి ఒంగిన సుధ భుజంమీద చేయివేసి లాలనగా చెప్పాడు శ్రీకాంత్.

సుధ అతని చెయ్యితీసి "తమాషాలు చాల్లెండి. పని కానివ్వండి" అంది.

సుధ మళ్ళీ విసురుగా ఏదో ఒకటి అనకపో వటమే చాలన్నట్లు గబగబా బంగాళదుంప లు, టమాటాలు, ఉల్లిపాయలూ తరిగేశాడు శ్రీకాంత్.

సుధ పూరీలు ఒత్తుతుంటే తను నూనెలో వేయించాడు. ఇంతలో లయ కూడా లేచింది. ఒక్కొక్కర్నే లేపింది. రాత్రి జరిగినదేమీ గుర్తు లేనట్లే అందరూ సందడిగా మాట్లాడసాగారు.

జయా, సుధా స్నానంచేసి బయల్దేరారు. టిఫిన్ కారియర్లో పూరీలూ, వాటర్‌బ్యాగ్‌నిండా చల్లటి మంచినీళ్లతో బస్‌స్టాపుకు బయల్దేరా రు.

"జయా ఆంటీ- నువ్వు సాయంత్రం మళ్లీ రావాలి" అంది లయ వాళ్ళకు చేయివూపు తూ.

శారద కూడా తనకు పదిగంటలకు ఆపరేష ను వుంది వెళ్లితీరాలని బయలుదేరింది. ఆమెతోపాటు సావిత్రమ్మ. ఇంట్లో శ్రీకాంత్, లయ ఇద్దరే మిగిలారు.

యూనివర్సిటీ దగ్గర జీపు సిద్ధంగా ఉంది. జయా, సుధా వెళ్లి అక్కడున్న నలుగురు లెక్చరర్లకూ తమను తాను పరిచయం చేసుకు న్నారు. జయ తను రావటం వాళ్లకేమీ ఇబ్బంది కాదుగదా? అని అడిగింది. వాళ్లు ఇబ్బంది లేకపోగా ఇలా సర్వేకోసం ఆసక్తిగా వచ్చేవాళ్లున్నారంటే చాలా సంతోషంగా వుందని చెప్పారు. ఇలా సర్వేల కోసం తమంత టతాము వచ్చేవాళ్లను చూడటం ఇదే మొదటి సారని కూడా చెప్పారు.

ఆ నలుగురిలో కృష్ణమూర్తీ, యాదయ్యా పొలిటికల్ సైన్సు డిపార్టుమెంటుకి చెందినవా రు. జయరావు, కాంతారావూ సోషియాలజీ డిపార్ట్‌మెంట్ నుంచి వచ్చారు. వీళ్లిద్దరూ సై న్సు అని తెలునుకుని.

"మన భాషలు వేరేమోనండీ" అన్నాడు జయరావు. నలుగురిలో అతనే మాటకారి.

"ఒకరి భాష ఒకళ్లు నేర్చుకుందాం" అంది జయ సమన్వయను తీరున్తున్నట్లు.

"మన పేర్లు మాత్రం ఒకటిగానే వున్నాయి. మీ హజ్బెండ్ పేరు చివరగాని రావు లేదు గదా" అడిగాడు జయరావు.

"ఉంది- కేశవరావు" నవ్వింది జయ.

"ఐతే మీరు మిసెస్ జయరావు నేను ఉత్తి జయరావు" అందరూ నవ్వారు.

అందరూ ఎకనామిక్స్ ప్రొఫెసర్ రామారావు గారి కోసం ఎదురుచూస్తూ నిలబడ్డారు.

"ఎన్ని వూళ్లు తిరగాలండీ" జయ ఆసక్తిగా అడిగింది.

"ఎన్నో వూళ్లు- మచ్చుకి ఒకటి. శాంపిల్ సర్వే అంతే. మీరు ఈ ఒక్కరోజులోనే రంగారె డ్డి జిల్లా గ్రామపరిస్థితులన్నీ తెలుసుకుందా

మని ఆశపడుతున్నారేంటి?''

"మరీ ఒక్క ఊరేనా?'' జయ నిరాశప డింది.

"ఆ ఊరు వెళ్ళటానికి రెండుగంటల ప్ర యాణం- మనం తొమ్మిదిలోపు బయలుదే రలేం. అంటే పదకొండుగంటలకు చేరతాం. ఆరింటివరకూ సర్వే చేద్దామనుకున్నా మనకు ఏడుగంటలు మాత్రమే వుంటుంది. ఓ గంట భోజనం, విరామం వీటికిపోతే ఆరుగంటలపా టు ఎన్నివూళ్లు తిరగగలమంటారు?'' కృష్ణ మూర్తి అడిగాడు.

"నిజమేలెండి'' అంగీకరించింది జయ.

ఆదివారం కావటాన యూనివర్సిటీ నిశ్శ బ్దంగా ఉంది. వీళ్లు మాట్లాడుకుంటూనే రామా రావుగారి కోసం ఎదురుచూడటంలో అసహనా న్ని పెంచుకుంటున్నారు.

"ప్రొఫెసర్‌గారికి అసలివాళ ఈ ప్రోగ్రాం ఉందని గుర్తుందా? లేకపోతే పొద్దున్నే లేచి రైలెక్కి ఇంకో వూరేదన్నా వెళ్లిపోయారా?'' కాంతారావు జోక్ చేశాడు.

"రామారావుగారు ఆ అర్థంలో ప్రొఫెసర్ కాదు. చాలా జ్ఞాపకశక్తి వుంది. సామాన్యంగా ఆలస్యం చెయ్యరు. ఇవాళ ఏమయిందో మరి'' అన్నాడు కృష్ణమూర్తి. అంతలో ఓ స్కూటర్ వచ్చి వాళ్ళముందే ఆగింది. రామా రావుగారు దిగి ఆలస్యానికి వీళ్ళకు క్షమాపణ లు చెప్పారు.

స్కూటర్ నడిపిన వాళ్లబ్బాయిని వీళ్లకు పరిచయంచేసి పంపేశారు.

సుధ, జయ ఇద్దరే రామారావుగారికి అస లు పరిచయం లేనిది.

జయ తను 'అతిథి'గా వస్తున్నాని చెప్పి పరిచయం చేసుకుంది.

"మీరు రాసిన ఆర్టికల్స్ చాలా చదివా నండీ. ఈ టీములో మీరున్నారని తెలిశాక రాకుండా వుండలేకపోయాను'' అంది.

ఆయన మొహమాటంగా నవ్వేశారు.

"ఇంకా ఆలస్యం ఎందుకు? బయల్దేరదాం పదండి'' అంటూ అటూ ఇటూ చూస్తే డ్రైవర్ కనిపించలేదు. టీ కోసం వెళ్ళాడేమో నేను పిల్చుకొస్తానంటూ'' జయరావు వెళ్లాడు.

పది నిమిషాల తర్వాత జీపు బయల్దేరింది. ముందు రామారావుగారూ, జయరావూ కూర్చు న్నారు. మిగిలిన ఐదుగురూ వెనకాల ఎక్కారు. మెహదీపట్నం దాటిన దగ్గర్నించీ రోడ్డు బాగుంది. చల్లటి గాలి. ప్రయాణం సుఖంగా జరుగుతుందని అందరికీ నమ్మకం వచ్చింది.

నెమ్మదిగా మాటలు మొదలుపెట్టారు. యూనివర్సిటీ గొడవలూ, స్టూడెంట్ల అరాచక త్వం గురించి కబుర్లూ కథలూ ప్రవాహంలా బైటికి వస్తున్నాయి.

రామారావుగారు ఈ మాటల్లో జొరబడ కుండా ఆయన తెచ్చుకున్న పుస్తకమేదో చదు వుకుంటున్నారు. జయ మెల్లిగా ముందుకూ ర్చున్న జయరావుని పిల్చింది.

"ఈ కబుర్లు మనకి కొత్తా కాదు. ఇవాళతో అయిపోయేవీ కాదు. ప్రొఫెసర్‌గారు ఏవన్నా చెబితే బాగుంటుంది. మీరాయన్ని మాటల్లో దించరాదూ?'' నెమ్మదిగా గొణిగింది.

జయరావు సరేనన్నట్లు నవ్వాడు.

"సార్- పుస్తకాలు మీరెప్పుడూ చదువుతూనే వుంటారు. ఇవాళ్టికి మాతో కబుర్లు చెప్పండి'' అన్నాడు సరదాగా.

రామారావుగారు పుస్తకం మూసి నవ్వి "ఏం కబుర్లు కావాలి. మీక్కావాల్సిన కబుర్లు నేను చెప్పలేనేమోనని నా భయం''

"అంటే- మేం ఏం కబుర్లు కావాలంటామ నుకున్నారు?''

"ఏమో- ఈ కొత్తతరం వాళ్లంతా సినిమాల కబుర్లూ, క్రికెట్ కబుర్లూ, లేదా షేర్ మార్కెట్ కబుర్లూ చెప్పుకుంటుంటారు. నాకా మూడింటి లోనూ ఆసక్తిలేదు''

"మాక్కూడా వాటిలో ఆసక్తి లేదండీ'' అందరూ ఏకగ్రీవంగా చెప్పేశారు.

"మరి మీకేం కావాలో అడగండి''

"ఏంలేదు సార్- ఏదన్నా కొత్త సంగతులు తెలుసుకుందామని- అంతే- ఇప్పుడు ప్రభు త్వం కొత్త ఆర్థికవిధానం ఏదో ప్రకటించింది గదా- దాన్ని గురించి మాకు కాస్త తెలుసు. పేపర్లలో ప్రముఖులు రాసిన వ్యాసాలూ, చర్చ లూ చూస్తూనేఉన్నాం. ఈ విధానంవల్ల దేశానికి




ఏమీ మేలు జరగదని చాలామంది చెబుతున్నారు. అది నిజమేనేమో. కానీ దీనివల్ల కనీసం ప్రభుత్వానికైనా కొన్ని ప్రయోజనాలున్నట్లు చూపించాలిగదా''

జయరావు మాటల్ని కృష్ణమూర్తి ఆపేశాడు. ''జయరావూ- నువ్వు పిల్లలతో మాట్లాడినట్లు డొంకతిరుగుడుగా మాట్లాడకు. ఉన్న సందేహమేదో సూటిగా అడుగు'' చిరాకువడ్డాడు.

ఆ చిరాకుకి అందరూ నవ్వేశారు.

''అరే- నేను అడగటానికి నా పద్ధతంటూ ఒకటి ఉంటుందయ్యా- నీలాగా నేను ఎట్లా అడుగుతాను''

''అయ్యో! ఈ పోట్లాట మాని అసలు విషయంలోకి రండి'' జయకు మాటలు పెరుగుతాయని భయం వేసింది.

జయరావు అడగాల్సింది గుర్తుకు తెచ్చుకుంటున్నట్టు ఒక నిమిషం మౌనంగా ఉండి

''ఇంతకుముందువరకూ ఎన్నికల్లో ప్రజల ఓట్లు కాజెయ్యటానికి ప్రభుత్వానికి ఏవో కొన్ని నినాదాలుండేవి. చెయ్యటానికి కొన్ని వాగ్దానాలుండేవి. వాటితో పేదప్రజల ఓట్లు పడేవి. ఉదాహరణకు గరీబీ హటావో, కొన్నాళ్లు భూసంస్కరణలు, పేదప్రజలకు ఇళ్లు, పిల్లలకు మధ్యాహ్నభోజనాలు, కిలో రెండురూపాయల బియ్యం ఇలా ఏదో ఒక ఆశ చూపించేవారు. ఇక ఈ ఆర్థిక విధానంలో ఆశలు చూపించే వెసులుబాటు కూడా లేదుగదా- సబ్సిడీలన్నీ రద్దు చెయ్యాలి. పరిశ్రమలు ప్రైవేటు వ్యక్తుల పరం ఇంకా చెప్పాలంటే విదేశీయుల పరం అవుతాయి. రిట్రెంచిమెంట్లు పెరిగిపోతాయి. కార్మికులు బజార్న పడతారు. పనిచేసే కార్మికుల హక్కులు కూడా క్రమంగా హరించుకుపోతాయి. ప్రజాహిత కార్యక్రమాలకూ, సబ్సిడీలకూ బడ్జెట్‌లో చోటుండడానికి ఐ.ఎం.ఎఫ్.గానీ, ప్రపంచ బ్యాంకుగానీ ఒప్పుకోవు. ఇవాళ మన బడ్జెట్ వాళ్ళ ఆమోదం లేనిది అంగుళం కదలటం లేదంటున్నారు గదా. మరి తమకోసం ఏదో ఒక రాయితీ కనీసం ప్రకటనల్లోనన్నా లేకపోతే జనం ఓట్లేస్తారా? అసలు సహించి ఊరుకుంటారా? దీని గురించి ప్రభుత్వం ఏం ఆలోచిస్తోంది. తన క్షేమం అన్నా తను చూసుకోవాలిగదా?''

''అమ్మయ్యా- అయిందా నీ ప్రశ్న. కొండ వీటి చాంతాడంటే ఏంటో నాకిప్పుడు తెలిసింది'' కృష్ణమూర్తి జయరావుని ఒదలదల్చుకోలేదు.

అందరూ పరిహాసంగా నవ్వారు. ఆ నవ్వులు అణిగాక రామారావుగారు అన్నారు.

''ప్రభుత్వం ఏం చేస్తోందో మీకు తెలియటంలేదూ? ప్రజల దృష్టిని తమ రోజువారీ సమస్యలనుండీ, నిత్యావసరాలనుండీ తప్పిస్తుంది. కృత్రిమమైన సమస్యలను పెంచి పోషిస్తోంది. మతకలహాలు రోజురోజుకీ పెరుగుతున్నాయిగదా- దేశంలో అరాచకం పెరిగితే నేనే సుస్థిరతను నెలకొల్పగలనన్న ప్రచారంతో ఎన్నికలలోకి వస్తుంది. మరీ పరిస్థితి చేతులు దాటిపోతోందనుకుంటే నిర్బంధాన్ని పెంచుతుంది. ఎన్నికలే జరపదు. జరిపినా వూహించలేనంత స్థాయిలో రిగ్గింగులు చేయిస్తుంది. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలనే మాట ఎప్పుడూ విన్లేదా?''

''కానీ మనదేశంలో ఆ నిర్బంధాన్ని ఎక్కువ కాలం కొనసాగించలేరు సార్. జనంలో చైతన్యం పెరుగుతుంది. ఉద్యమాలు పెరుగుతాయి'' అప్పటివరకూ నిశ్శబ్దంగా వింటున్న యాదయ్య గంభీరంగా అన్నాడు.

''ఔను- ప్రపంచ బ్యాంకుకీ, ఐ.ఎం.ఎఫ్. వాళ్ళకూ మనదేశం గురించి అదే భయం. విదేశీయులకు చాలామందికి కూడా ఆ భయం వుంది. అందుకే ప్రభుత్వం ఆశించినట్లు విదేశీయులు హడావుడిగా మనదేశంలో పెట్టుబడి పెట్టటానికి ముందుకు రావటంలేదు''

''ఐ.ఎం.ఎఫ్. అంటే ఏంటసలు?'' సుధ అనుకోకుండా ప్రశ్నించి తన అజ్ఞానానికి అందరూ నవ్వుతారేమోనని సిగ్గుపడింది.

ఎవరూ నవ్వలేదుగానీ అందరూ తెల్లబోయారు. ఒక కాలేజీ లెక్చరరు, ఫిజిక్సు లెక్చరరు ఐ.ఎమ్.ఎఫ్. అంటే తెలియకుండా వుంటుందని వాళ్ళనుకోలేదు.

సుధ తరపున జయ వివరణ ఇచ్చింది.

మా సుధకు తను చదువుకున్న ఫిజిక్సు



పాఠాలను మళ్ళీ ఇంటర్ పిల్లలకు చెప్పటం తప్ప ప్రపంచం తెలియదు సార్- ఏదీ పట్టించుకోదు. ధరలు పెరిగిపోతున్నాయని ఆందోళన పడటం, పొదుపు చెయ్యాలని ప్రయత్నించటం తప్ప దానికి కారణం ఏమిటని ఆలోచించని లక్షలాది మధ్యతరగతి స్త్రీలకు ప్రతినిధి మా సుధ''

జయ హాస్యంగా చెప్పిన వివరణకు అందరూ ఆనందించారు. యాదయ్య మాత్రం ''చదువుకున్న ఇల్లిటరేట్స్'' అని తనలోతను గొణుక్కున్నాడు. సుధ చిన్నబుచ్చుకున్న మొహంతో నిశ్శబ్దంగా కూచుంది. ఎదుట అద్దంలో సుధ ముఖం చూసిన రామారావుగారు ఏదో ఒకటి చెప్పాలనుకుని తడుముకుంటూ మాట్లాడటం మొదలుపెట్టారు. ఎంతో తెలిసినవాళ్లకు కూడా ప్రాథమికమైన విషయాలు చెప్పటం చాలా కష్టంగా ఉంటుంది. యూనివర్సిటీలో పి.హెచ్‌డీ చేసేవాళ్లకు అనర్గళంగా పాఠాలు చెప్పే ప్రొఫెసర్లను ఒకటోతరగతి పిల్లలకు పాఠం చెప్పమంటే చెప్పలేరు. ఆ పిల్లల్ని చూస్తే వీళ్ల నోరు పెగలదు. రామారావుగారి పరిస్థితి కూడా అదే అయింది. మాటలు కూడదీసుకుంటూ తను జయించితీరాలనే పట్టుదలతో చెప్పాడు. ''ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచ ఆర్థిక విషయాలమీద పెత్తనంచేసే ధనికదేశాల కాపలా కుక్క ఇది! ఇవాళ మొత్తం ప్రపంచ ఆర్థిక పరిస్థితంతా అమెరికావంటి పాశ్చాత్య దేశాలలోని ప్రైవేటు బ్యాంకులమీద ఆధారపడివుంది. వాళ్ళ సేవ కోసం ఈ అంతర్జాతీయ ద్రవ్యనిధి ఉపయోగపడుతుంది. ఆ బ్యాంకులు బీదదేశాలకు పెట్టే అప్పుల్ని తీర్చిపెట్టేలాగా బీదదేశాలమీద ఒత్తిడి తీసుకురావటం దీనిపని. అంటే మార్వాడీ దగ్గర గుమస్తా లేకపోతే గూండా. మీలో ఎవరన్నా షావుకారు సినిమా చూశారా? అందులో ఎస్వీ రంగారావు పాత్రన్నమాట. అట్లాగే ఈ ధనికదేశాలు అదే- అమెరికాలాంటి దేశాలు వాళ్లు వాళ్లదేశంలో పారిశ్రామిక రంగంలో చేసిన తప్పుల్ని జాగ్రత్తగా తెచ్చి బీదదేశాలమీద రుద్దగలిగిన శక్తివున్న సంస్థ. దీనికి ఒక చిన్న ఉదాహరణ చెప్తానుండండి- మా ఇంట్లో మా ఆవిడ ఒద్దన్నకొద్దీ నాలుగు సొరపాదులు పెంచింది. ఒక్కపాదు సరిగ్గా కాస్తే మాకు ఎక్కీ తొక్కీ అట్లాంటిది నాలుగుపాదులూ విపరీతంగా కాశాయి. ఏం చేస్తుంది- మా ఇంట్లో పనిచేసే ఆమెకూ, పక్కింట్లో పనిచేసే ఆమెకూ, నా కోసం మా ఇంటికొచ్చే రిసెర్చి స్కాలర్స్‌కూ, ఇళ్లపక్కల వాళ్ళకూ విపరీతంగా పంచిపెట్టింది. వాళ్లు సొరకాయలు వూరికే తీసుకోలేరు. డబ్బులిస్తే మా ఆవిడ తీసుకోదు. వాళ్లు బదులుగా ఏవేవో తెచ్చియిచ్చారు. పనివాళ్లు అదనంగా పనిచేశారు. కానీ రోజూ సొరకాయకూరంటే వాళ్లు మాత్రం ఎలా తింటారు? వాళ్లకు సొరకాయంటే విరక్తి పుట్టించింది మా ఆవిడ- అట్లాగే అమెరికా అర్థం పర్థం లేకుండా తను చేసిన పనికిమాలిన ఉత్పత్తుల్ని ఆయుధాలతోసహా బీదదేశాలకు అంటగడుతుంది. వాళ్లు వాటిని చచ్చినట్టు కొంటారు. అవి సొరకాయలు కాదుగదా తిన్నంత తిని అవతల పారెయ్యటానికి. వాటి కోసం మళ్ళీ బోలెడు ఖర్చు పెట్టాలి. ఆయుధాలిస్తే అవి తుప్పట్టకముందే పొరుగుదేశాలతో యుద్ధమన్నా చెయ్యాలి. లేకపోతే తన ప్రజల మీదికే ఎక్కుపెట్టాలి''

ప్రొఫెసర్‌గారు మంచి ఫాంలోకి వచ్చారు. ఉత్సాహంగా ఇక ఎక్కడా బండికి బ్రేకుపడదన్నట్టు చెప్పుకుపోతున్నారు.

''అసలీ ద్రవ్యనిధి 1944లో ఏర్పడ్డప్పుడు అంతర్జాతీయ వ్యాపారాన్ని అభివృద్ధి చెయ్యటానికి ఏర్పడ్డదని చెప్పారు. అందరూ అబ్బో ఎంత మేలు చేస్తుందో ఇది అని హారతులు పట్టటానికి సిద్ధమయ్యారు. కానీ అసలు కిటుకూ మెలికా అందులోనే ఉంది. వ్యాపారాన్ని ఎట్లా అభివృద్ధి చేస్తావు? ప్రపంచంలో దేశాలన్నీ ఒకేరకంగా లేవే- కొన్ని ధనికదేశాలు. కొన్ని బీదదేశాలు. బీదదేశాలకెంతసేపు దిగుమతులేగాని వాళ్లు చేసే ఎగుమతులుండవు. మరి అన్నీ దిగుమతి చేసుకోడానికి డబ్బెక్కడిది? అప్పు చెయ్యాలి. అప్పు చెయ్యకపోతే కొనుగోలు చెయ్యలేరు. కాబట్టి ధనిక దేశాలు తమ సరుకు బీదదేశాలకు అమ్మాలంటే ముందు వాళ్లకు అప్పివ్వాలి. సరుకు కొనిపించాలి. అప్పు ఇచ్చిన డబ్బు వడ్డీతోసహా కక్కించాలి. కొత్త అప్పులు చేయించాలి. దీనికంతా తట్టుకోలేని బీదదేశాలు కొన్నుంటాయి. వాళ్లకి కొన్నా




ళ్లకు ఎక్కడా అప్పు పుట్టదు. అప్పుడాదేశం ఐ.ఎం.ఎఫ్. దగ్గరకు వెళ్లి పాదాభివంద నంచేసి దాంట్లో మెంబరయ్యి కొత్త అప్పులు చేసుకునే శక్తి సంపాదించుకుంటుంది. ఇందులో మెంబరైన దేశానికి ఎవరైనా ధై ర్యంగా అప్పిస్తారు. ఎందుకంటే ఇది ఆ బీదదేశం అప్పు తీర్చటానికి అనేకానేక మార్గా లు ఉపదేశిస్తుంది. ఓసి పిచ్చి ప్రభుత్వమా రెండు రూపాయలకు కిలోబియ్యం అమ్మితే నువ్వెట్లా అప్పులు తీరుస్తావు? సారాయి అమ్మితే తీర్చగలుగుతావు? సబ్సిడీలన్నీ రద్దు చెయ్యి. నీకు అప్పు పెట్టే దేశాలను నీ దేశంలో పెట్టుబడులు పెట్టనివ్వు. అప్పుడు నీ అప్పు తీరుతుంది. అని చెబుతుంది. ఇట్లాంటి అమూల్యమైన సలహాలు, ఆ దేశప్రజల రక్తం పీల్చే సలహాలు ఇచ్చే శకుని మామ పాత్రనిది పోషిస్తుంది. మాయాబజార్ సినిమాలో సియ్యా స్సార్‌లాగా అన్నమాట. దీని అనుమతి లేకుండా బీదదేశాలకు రూపాయి కూడా అప్పు పుట్టని కారణంగా ఆ ప్రభుత్వాలు దీని మాట చచ్చినట్లు వింటాయి''

''సార్- నాకొక్క సందేహం'' కృష్ణమూర్తి వెనకనుంచి అరిచాడు.

''ఇదిగో కృష్ణమూర్తీ ఇందాక నన్ను వెక్కి రించావుగదా. నా ప్రశ్న కొండవీటి చాంతాడని. ఇప్పుడు నువ్వు మూడు ముక్కల్లో ప్రశ్న అడ క్కపోతే నీ తల వెయ్యిచెక్కలవుతుంది'' జయరావు ముందునుంచి శపించాడు.

''మూడు ముక్కలు కాదుగానీ మూడు వాక్యాల్లో అడుగుతా''

''ఒక వాక్యం ఐపోనే ఐపోయింది''

''ఆఁ- అది ప్రశ్నలో భాగంకాదు'' కృష్ణమూ ర్తి కంగారుపడ్డాడు.

''రెండు వాక్యాలయిపోయాయి'' జయ రావు రెచ్చగొట్టాడు.

''అబ్బబ్బ- మీ అల్లరేమిటండీ. ముందు ఆయన్ని అడగనివ్వండి'' జయ సున్నితంగా మందలించింది.

''మీరు చెప్పిందంతా బాగానే వుందిగానీ ఈ తతంగమంతా నడవాల్సిందేగదా సార్. అప్పులేకుండా పొట్ట గడవదుగదా! మనం మాత్రం అప్పులు చేసి వడ్డీతో సహా తీర్చు కుంటున్నామా లేదా? మన శక్తికి మించి ఖర్చు పెట్టినపుడు అప్పులపాలవుతాం. చచ్చినట్లు తీరుస్తాం. అప్పిచ్చేవాడిది తప్పంటే ఎట్లా, ఇచ్చాక వసూలు చేసుకోక చస్తాడా''

''నీ ప్రశ్నలోనే సమాధానం వుంది కృష్ణమూ ర్తీ! శక్తికిమించి ఖర్చు అదొక విషయం. ఎవరు ఎవరి శక్తికి మించి ఖర్చు పెడుతున్నారు. ఎందుకు పెడుతున్నారు? మన ప్రభుత్వం పెట్టే ఖర్చుల్లో జనానికి కావాల్సినవి ఎంత? వాళ్ల స్వార్థం కోసం వాళ్లు పెట్టేవి ఎంత?''

''మరట్లాంటప్పుడు అనవసరంగా ఖర్చు పెంచే ప్రభుత్వానిది తప్పుగానీ అప్పిచ్చేవాడి దేం తప్పు?''

''నిజమే... అలాగే అనిపిస్తుంది. తార్కి కంగా ఆలోచిస్తే అది నిజమేనన్నట్లు కని పిస్తుంది గానీ అంతా నిజంకాదు. ప్రభుత్వా లది తప్పే కానీ డబ్బు ఎవడి దగ్గరుంటే వాడి మాట చెల్లుతుందా లేదా? డబ్బిచ్చేవాడు నిజంగా తను అప్పుయిస్తున్న దేశ ఆర్థిక పరిస్థితి బాగు పడాలంటే అక్కడ సమానత్వం ఉండాలని గుర్తించి అలా ప్రజలందరికీ సమా నావకాశాలు లభించే పనులు చెయ్యమని చెప్పాలిగదా! అప్పుడు కూడా వాడి అప్పు తీర్చగలుగుతారుగదా! ఈ సంస్థ అలా చెప్ప దు సరిగదా అలాంటి మంచి పనులు చేస్తార నుకుంటే వాళ్లకసలు అప్పు ఇవ్వనంటుంది. ఇదిగో ఫలానా పనులు చేస్తేనే డబ్బు ఇస్తా నంటుంది. గుండమ్మ కథలో సూర్యకాంతం అనుకో తన సొంత కూతురుకు తగలెయ్యటా నికైతే డబ్బులిస్తుందిగానీ పని మనుమలకు సరిగా తిండిపెట్టని తత్త్వం. ఆ ఫలానా పను లు చెయ్యటంవల్ల జరిగేదేమిటయ్యా అంటే ఆ దేశాలలో ముందు కరెన్సీ విలువ పడిపో తుంది. ప్రజాహిత కార్యక్రమాలు ప్రభుత్వం ఆపెయ్యాల్సి వస్తుంది. గవర్నమెంటు సంస్థల న్నీ ప్రైవేటు వాళ్ల చేతుల్లోకి పోతాయి. అన్ని ధరలూ పెరిగి పోతాయి. ధరల మీద కంట్రో లు ఎత్తేస్తారు''

''అవన్నీ అనుభవిస్తున్నాం గదండీ... తెలు సు''

కాంతారావు బిట్టర్‌గా అన్నాడు.

సుధకు ఇదంతా సగం అర్థమయ్యీ సగం అర్థం కాకుండా వుంది. ఆమెకు అప్పుల నంగానే ఇల్లు కట్టటానికి చేసిన అప్పులు గుర్తొచ్చాయి. ఎల్.ఐ.సి.లోనుగాక ఇంకా యాభై వేల రూపాయల అప్పుంది. రెండు రూపాయల వడ్డీ. అంత తక్కువ వడ్డీకి అప్పు దొరకటం అదృష్టమన్నారు. తన తమ్ముడి స్నేహితుడొకడు అతడి పుణ్యమా అని అప్పిచ్చి ఆదుకున్నాడు. అదే శ్రీకాంత్‌కైతే ఐదు రూపాయల వడ్డీకి కూడా అప్పుపుట్టేదిగాదు. నెల నెలా వడ్డీ కడుతూ యాభైవేల రూపాయల చిట్టీ కడుతోంది. ఎల్.ఐ.సీలోనుకీ దీనికి కలిపి దాదాపు జీతం అంతా అయిపోతుంది. శ్రీకాంత్ జీతం ఎంతో పొదుపుగా వాడితే ఇంటి ఖర్చులకు అస్తుబిస్తుగా సరిపోతుంది. ఒకో నెల అప్పు చెయ్యాల్సి వస్తుంది. ఈ గులాబీ తోట అనవసరం, డబ్బు ఖర్చు అంటారుగానీ తను బతికేదే దానికోసం అని ఎవరికి తెలుస్తుంది? సుధ తన ఆలోచనల్లో తను కొట్టుకుపోతూనే ఉంది.

"సుధగారూ ఇంతకీ మీకేమన్నా అర్థమయిందాండీ" రామారావుగారు అడిగారు.

సుధ సిగ్గుపడుతూ "అర్థమయిందండీ థాంక్సు. నా కోసం చాలా శ్రమపడ్డారు" అన్నది.

అందిగానీ ఏమర్థమయిందని అడిగితే చచ్చేపని ఔతుందే, అని భయపడుతూ కూచుంది.

ఎవరూ సుధని పరిక్షించే పని పెట్టుకోలేదు. రామారావుగారు చెప్పిన విషయాలను గురించి ఎవరి మనసుల్లో వాళ్లు ఏదేదో ఆలోచించుకుంటున్నారు.

"డ్రైవర్ డ్రైవర్ ఆపు" హఠాత్తుగా కేకేశాడు జయరావు.

అందరూ ఏమయిందా అని కంగారుపడ్డారు. జీపు ఆగింది.

"బుర్రలన్నీ వేడెక్కిపోయాయి. కాస్త టీ తాగుదాం దిగండి" తను ముందు దిగేశాడు జయరావు.

మిగిలిన వాళ్లు కూడా జయరావుని అనుసరించారు. అదొక పల్లెటూరు. చిన్న చాయ్ దుకాణం వుంది. నాలుగు చెక్కబల్లలేసి వున్నాయి. రేడియోలోంచి సినిమా పాటలు జోరుగా వినపడుతున్నాయి.

"ఈ పాట ఏమిటో ఎవరన్నా కాగితం మీద రాస్తే పది రూపాయలిస్తాను" అన్నాడు కాంతారావు ఆ పాట జాగ్రత్తగా వింటూ.

"మా ఇంటికొచ్చి ఈ మాట అను. మా అబ్బాయి క్షణంలో నీ పది రూపాయలు కాజేస్తాడు" అన్నాడు కృష్ణమూర్తి.

"నిజమేనయ్యా మా అబ్బాయికీ అర్థమవుతాయి. మనకి ఎందుకు అర్థం కావటం లేదంటావూ?" జయరావు ఆశ్చర్యపోయాడు.

"వెనకబడిపోయాం. జనరేషన్ గ్యాప్"

"చెప్పొద్దూ... మా నాన్నగారికి ఇష్టమైన నాగయ్యగారి పాటలు కూడా నాకు చప్పున అర్థంకావు. చాలా కష్టపడి వినాలి. "పసుపు కుంకుమా బాలా నీ జన్మహక్కు గదా" అన్న వాక్యం అర్థం చేసుకోటానికి ఒక రోజంతా పట్టింది"

"నాకు అప్పటి పాటలూ ఇప్పటి పాటలూ అన్నీ అర్థమవుతాయయ్యా నేను వెనకబడలేదన్నమాట. ఈ పాట నేను కాగితం మీద రాస్తాను. పది రూపాయలు పైకి తియ్యండి" రామారావుగారి మాటలకు అందరూ నోళ్లు తెరిచారు.

ఆయన సీరియస్‌గా పెన్ను తీసి న్యూస్‌పేపర్‌లో ఒక అంచున ఆ పాట రాసి చూపించారు.

ఆయన రాసింది చదివాక పాట పల్లవి వింటే అర్థమైనట్లే వుంది.

కృష్ణమూర్తి సిగ్గుపడుతూ పది రూపాయలు జేబులోంచి బైటికి తీశాడు. రామారావుగారికి ఇవ్వటానికి మొహమాట పడుతున్నాడు.

రామారావుగారు అది గమనించి చిన్నగా నవ్వి "ఈ టీ బిల్లు మీరు ఇచ్చెయ్యండి. ఐతే అది నేను ఇప్పించినట్లు. ఇప్పుడు నేను ఐ.ఎమ్.ఎఫ్‌కంటే పెద్ద మనిషి తరహాలోనే ప్రవర్తించినట్లు లెక్క. కాంతారావుగారూ ఇలా పందాలు కాయటం మానెయ్యమని నా ఉచిత సలహా"




"అందరూ నవ్వుతూ లేచారు. కాంతారావు సంతోషంగా బిల్లు చెల్లించాడు.

మగవాళ్లందరూ సిగరెట్లు వెలిగిస్తే జయా, సుధా జామపళ్ల బుట్టల దగ్గరకు వెళ్లారు. పెద్దపెద్ద పళ్లు ఒక డజను కొనుక్కుని వచ్చారు.

"ఏదో పిక్నిక్కుకి వెళ్తున్నట్లు వుందిగానీ సర్వేకి వెళ్తున్నట్లు లేదు" అన్నాడు జయరావు జామకాయలు చూస్తూ.

జీపు మళ్లీ ప్రయాణం మొదలెట్టింది. కాసేపు అందరూ జామకాయలమీద పడ్డారు.

జామకాయలన్నీ అయిపోయాక జయ మళ్లీ మెల్లగా జయరావుని పిలిచింది.

"ఏంటండీ! ఈ నిశ్శబ్దం, ఇంకో గంటలో మనం పనిలో పడిపోతాం" అంది.

"పాపం ప్రొఫెసర్‌గారిని కాస్త విశ్రాంతిగా కూర్చోనివ్వరా" కాంతారావు అన్నాడు.

"ఆయన విశ్రాంతిగా కూర్చుంటే ఏ సినిమా పాటలో విని ఎప్పుడో మళ్లీ మిమ్మల్ని ఓడించి డబ్బు గుంజుతారు. ఏదో ఒకటి మాట్లాడటమే మేలు" అంది జయ నవ్వుతూ.

"సార్ పుస్తకం మూసెయ్యండిసార్" జయరావు అడిగాడు.

"మూయించండయ్యా నాదేముంది"

"అంటే..." జయరావు అయోమయంగా అడిగాడు. అంటే మీరేదన్నా ప్రశ్న అడిగితే రామారావుగారు ఆటోమేటిగ్గా పుస్తకం మూస్తారన్నమాట" జయ నవ్వింది.

జీపు గతుకుల రోడ్డు మీద నేర్పుగా నడుపుతున్నాడు డ్రైవరు.

"సార్ దేశం ఎలావుంది సార్" జయరావు అడిగాడు. హఠాత్తుగా జీపు ఓ గోతిలో దిగబడి పైకి లేచింది. అందరి నడుములూ విరిగినంత పనయింది.

"ఇదిగో ఇలాగే వుందయ్యా దేశ పరిస్థితి. అచ్చం ఈ రోడ్డు లాగానే" నడుము సవరించుకుంటూ అన్నారు రామారావుగారు. అందరూ నవ్వారు.

"కాస్త జాగ్రత్తగా చూసి పోనివ్వు బాబూ" డ్రైవర్ని హెచ్చరించారు.

"మనదేశం కూడా పీకల్దాకా అప్పుల్లో కూరుకుపోయిందిగదా! అసలు ఆ అప్పులెలా తీరుస్తారు సార్"

"తీర్చరు... తీరుస్తారు. తీర్చిన వాటికంటే పెద్ద మొత్తాలు అప్పు తెస్తారు. అప్పులు తీర్చటానికి వడ్డీకి అప్పులు తెస్తారు. వడ్డీలు కట్టటానికి మళ్లీ అప్పు తెస్తారు. శిష్యా ఇది అనంతం"

"మరి ఎన్నాళ్లిలా వాళ్లు వూరుకుంటారా?"

"ఊరుకోదల్చినన్నాళ్లు ఊరుకుంటారు, ఊరుకోదల్చని రోజు ఆక్రమిస్తారు" తాపీగా చెప్పారు రామారావు.

"యుద్ధమే..." నోరు తెరిచారు జయరావు. "అమెరికాతో యుద్ధమంటే మజాకా కాదు గదా"

"ఛ... పిచ్చివాడా! యుద్ధమెందుకు? అప్పిచ్చినవాడు యుద్ధం చేస్తే ఏం మిగులుతుంది? బూడిద! యుద్ధానికి మళ్లీ ఖర్చుపెట్టద్దూ? గోటితో పోయేదానికి గొడ్డలెందుకు? దర్జాగా వచ్చి దేశంలో ఏది కావాలంటే అది వేలం పాడేసుకుంటాడు. ఉదాహరణకు ఢిల్లీ విమానాశ్రయం కావాలనుకుంటారనుకో. దానికి పాటపెట్టించి కొనుక్కుని జమజేసుకుంటారు. విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ మీద అప్పిచ్చినవాడి కన్ను పడిందనుకో అదీ జమ చేసుకుంటారు. యుద్ధం ఎందుకు? యుద్ధం అప్పులిచ్చిన వాళ్లమీద చెయ్యరు. తమ ఎరలకు లొంగని దేశాలమీద చేస్తారు"

"ఇదంతా నిజమేనంటారా సార్?"

వింటున్న ఆరుగురిలో ఒక్కరికి కూడా అది నమ్మబుద్ధికాలేదు. రామారావుగారు హాస్యంగా మాట్లాడుతున్నారనుకున్నారు.

"మరీ అన్యాయం సార్. అలా చేస్తారా ఎక్కడైనా? అవి జాతి సంపదలుగదా?" ఇంత పచ్చికలి హాస్యానికైనా ఈయన ఎలా చెబుతున్నాడని వాళ్లకు కాస్త కోపం కూడా వచ్చింది.

"జాతీ, దేశం అంతా తాకట్టులోనే ఉందిగదయ్యా"

"ఉంటే మాత్రం అలా వేలం పాడేసుకోటానికి వాళ్లది గుండా! చెరువా?" అమ్మో అంత పని చేస్తావా అని పసిపిల్లను గద్దించినట్లు

గద్దించబోయాడు కాంతారావు.

"గుండె సంగతి నాకు తెలియదుగానీ లాటిన్ అమెరికా దేశాల్లో అలాగే జరుగుతోంది. మనదేశానికి ఇప్పట్లో ఆ గతి పట్టకుండుగాక! ఆమెన్'

బొలీవియాలో విమానాశ్రయం, రోడ్లూ, ఫాక్టరీలూ అన్నీ వేలం పాడి కొనేశారు. అంతెందుకు రెండేళ్ల క్రితం మన బంగారం తరలించుకుపోలేదూ?"

వింటున్న వాళ్ల గుండెలు చెరువులవుతున్నాయి.

"నిజంగా అలా చేస్తారా? చెయ్యొచ్చా? అన్యాయం కదూ?"

"అన్యాయమేముంది? అప్పు తీసుకున్నాక తీర్చొద్దా? అప్పిచ్చినవాడు తగిన గ్యారంటీ లేకుండా అప్పిస్తాడా? మనం ఎవరికైనా అప్పిస్తే నోటు రాయించుకోమా? తీర్చకపోతే కోర్టుకి వెళ్లమా? ఆస్తులు స్వాధీనం చేసుకోమా? అప్పిచ్చే దేశాలూ అంతే. ఎగ్గొడితే వూరుకుంటారా? అమెరికా ట్రెజరీకి సెక్రటరీ ఏమన్నాడో తెలుసా? అప్పుతీసుకున్న దేశాలు మేం తీర్చం పొమ్మనే అవకాశాలున్నాయి. అప్పుడు వెంటనే ఆ దేశానికి ప్రపంచంలో ఎక్కడ ఆస్తులున్నా ఆ విదేశీ ఆస్తులన్నిటినీ స్వాధీనం చేసుకుంటాం. ప్రతి రేవు పట్టణంలోనూ వాళ్ల ఎగుమతుల కోసం వెతికి స్వాధీనం చేసుకుంటాం. వాళ్ల జాతీయ విమానాలేవీ నడవకుండా చేస్తాం. వాళ్లకు అత్యవసరంగా కావాల్సిన ఆహారపదార్థాల ముడి సరుకులు, స్పేర్ పార్టులు ఇవేవీ ఆ దేశాలకందకుండా చేస్తాం, అన్నాడు. పద్మవ్యూహంలో ఇరికించేశాడన్న మాట. ప్రపంచమొక పద్మవ్యూహం అని శ్రీశ్రీ గారు అన్నమాటకు ఇంత అర్థముందని ఇప్పటికైనా తెలుసుకోండి"

"మేం నమ్మలేకపోతున్నాం సార్" దీనాతిదీనంగా అన్నాడు జయరావు.

"నేను నమ్ముతాను. వాళ్లంత పనీ చెయ్యగలరు" యాదయ్య గట్టిగా అరిచాడు.

"ఏమో ఇదంతా ఏదో సస్పెన్సు క్రైమ్ థ్రిల్లర్ లాగుందిగానీ నమ్మశక్యంగా లేదు"

"నమ్మకపోతే మీ ఖర్మ! నమ్మి చెడినవాడు లేడు. అవతల ఆ మెక్‌నమారా గాడంటున్నాడు... లాటిన్ అమెరికాదేశాల్లో ఏ దేశంగానీ అప్పు ఎగ్గొట్టిందా మెరుపు వేగంతో ఆ దేశపు ఆస్తుల్ని భూ, జల, వాయు సంపదల్ని సీలు చేసి పారేస్తాం. ఆ దేశ పౌరులందరి బ్యాంక్ ఎకౌంట్లన్నీ బ్లాక్ చేయించేస్తాం..."

"పౌరుల బాంక్ ఎక్కౌంట్లా" కాంతారావుకి అన్నిటికంటే ఇది అన్యాయంగా కనపడింది. నేనేం పాపం చేశానని నా బ్యాంక్ ఎకౌంటు బ్లాక్ చేస్తారు అని హడలిపోసాగాడు.

"ఆఁ అందరి ఎకౌంట్లూ క్లోజే. ఒక్క షిప్పూ కదలదు. ఒక్క విమానం ఎగరదు. ఎగిరి దేశం దాటిందా చచ్చిందే గొర్రె ఖబడ్దార్" అని వాడు రంకెలు వేసి మరీ చెబుతుంటే, నేను నమ్మను. మా అమ్మమ్మ పెట్టిన పాత చింతకాయ పచ్చడే తింటాను అంటే నేనేం చేసేది?"

"ఎలా సార్?" కాంతారావుకి చాలా దడగా వుంది.

"ఇంకా వుంది విను. ఒక దేశంలో డయాబిటిక్ పేషంట్లందరికీ ఇన్సులిన్ సప్లయి నిల్పిపోతే ఆ దేశపు ప్రెసిడెంటు గతేమవుతుందో ఆలోచించండి అన్నాడయ్యా వాడు. రహస్యం ఎందుకూ? మెక్సికో గురించి అన్నాడా మాట"

"అంటే?" జయ భయంగా అరిచింది.

"అంటే ఏముంది? అత్యవసరమైన మందుల సరఫరా ఆపేస్తాడు. జనం చచ్చిపోతారు. అన్యాయంగా చచ్చిపోతారు" రామారావుగారి కంఠంలో కూడా సీరియస్‌నెస్, విషాదమూ చోటు చేసుకున్నాయి.

"ఆపండి!" భరించలేనట్లు అరిచింది జయ.

"ఆగాల్సింది నేను కాదు. ఆ దశకు-దిగజారకుండా మనదేశం ఆగాలి. మనందరం కలిసి ఆపాలి. లేకపోతే జనం చచ్చిపోతారు. నల్లులు మాడినట్లు మాడిపోతారు. ఇప్పటికే చచ్చిపోతున్నారు. ఈ దరిద్రపు ఆర్థిక విధానాలూ, ఈ అర్థంలేని అభివృద్ధి కార్యక్రమాలూ అదుపులేకుండా ఇట్లాగే కొనసాగితే ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికా దేశాల్లో ఎంత మంది జనం చచ్చిపోతారో మీరూహించగలరా? ఊహించలేరు. ఎవరి ఊహకూ అందేది




కాదు ఆ సంఖ్య. ప్రతి సంవత్సరం 15 నుంచి 20 మిలియన్ల దాకా జనం చచ్చిపోతారు. అంటే ప్రపంచంలో రెండు రోజులకో హిరోషిమా జరుగుతుంది. నిశ్శబ్దంగా ఎవరికీ అంతు చిక్కని విధంగా ఈ హత్యాకాండ సాగిపోతుంది''

అందరూ భయంతో ఆశ్చర్యంతో నివ్వెరపోయి వింటున్నారు. ప్రొఫెసర్ కంఠంలోని గద్గదమైన ధ్వని వాళ్ల కళ్లల్లో నీరు తెప్పిస్తోంది.

చాలాసేపు ఎవరికీ మాట్లాడే సాహసం లేకపోయింది. ఎవరికి వాళ్లు ఆ భయంకర పరిస్థితిని ఊహించుకుంటూ ఉండిపోయారు. ఇదంతా అబద్ధం, ఈ ప్రపంచంలో ఇదేమీ జరగటం లేదు, ప్రొఫెసర్‌గారు అన్నీ అబద్ధాలు చెబుతున్నారు, అని ఎవరైనా చెబితే బాగుండునన్నట్లు ఎదురు చూస్తున్నారు. అసలీ చర్చంతా ఎందుకు తెచ్చాం. ఈ క్షణాన్నుంచీ ఈ భారం కూడా మొయ్యాలిగాబోలు భగవంతుడా అన్నట్లు తలలు వంచి భుజాలు జార్చి కూర్చున్నారు. జీపు వేగం తగ్గింది. పక్కనే ఉన్న పెద్ద చెరువులో తెల్లని తామరలు వికసించి నేత్రానందంగావున్నా ఎవరి దృష్టీ అక్కడ నిలవలేదు. వాళ్లు విన్న దారుణమైన విషయాల నేపథ్యంలో సౌందర్యానికి అర్థమేలేనట్లు అయిపోయింది.

ఇరవై నిముషాలపాటు భయంకరమైన నిశ్శబ్దంలో గడిపాక ఇక ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయింది జయ. ఇంత కఠిన వాస్తవాలను విని వూరుకుంటే ఎలా? ఏదో ఒక ఆశ, ఇదంతా ఇలా జరగకుండా ఆపొచ్చనే మాట, మరీ పరిస్థితులు వక్రిస్తే తప్ప ఈ స్థితి రాదులే, అలా వక్రించకుండా చేసుకునే శక్తి మనకుందిలే అనే ఓదార్పు, నమ్మకం ఏమీ లేకుండా ఈ విషాదాన్నిలా మోసుకు తిరగటం అసాధ్యమనిపించింది. జయ ఏదో అడగబోతుండగా కాంతారావు అడ్డుపడ్డాడు.

''దీనికేం విరుగుడు లేదా సార్?'' కాంతారావు అడిగేశాడు.

''పాముకుంటి దానికి విరుగుడుంది. వంతులు కుండదా'' అని ''ఎందుకుండదూ ఉంటుంది''

అందరు ఒక్కసారి నిట్టూర్చారు, నెత్తిమీద నుంచి పెద్ద బరువు దించుకున్నట్లు తలలు విదిలించుకున్నారు.

''అసలీ అప్పుల రొంపిలోకి దిగకుండా బతకలేమా సార్''

''బతకొచ్చు. అప్పు చెయ్యకుండానూ బతకొచ్చు. చేసిన అప్పులు తీర్చనూ వచ్చు. కానీ దేశంలో పెరిగిపోతున్న స్వార్థం, అవినీతి ఇవి దేశాన్ని రోజురోజుకీ రొంపిలోకి లాగుతున్నాయి. ఎవరికీ దేశం గురించి చింతలేదు. రాజకీయ నాయకుల సంగతి ఒదిలెయ్యండి. వాళ్లు బరితెగించి పోయారు. స్వార్థం, ఎలా డబ్బుపోగు చేసుకోవటం అన్న ఆలోచన తప్ప మరొకటి లేదు.

''ఒక ప్రాజెక్టు కోసమో, కొత్త యంత్రాలు కొనటం కోసమో అప్పు చేస్తాం. ఆ యంత్రాలు ఎలా కొంటామో తెలుసా? ఒక యంత్రాన్ని అమెరికా 50 వేల డాలర్లకు అమ్ముతానంటుందనుకొండి. అదే యంత్రాన్ని బ్రిటన్ 55 వేలకూ, ఫ్రాన్సు 75 వేలకూ అమ్ముతానంటే మనం ఎవరి దగ్గర కొంటాం?''

''అమెరికా దగ్గర'' జయరావు ఉత్సాహంగా చెప్పాడు.

''కాదు ఫ్రాన్సు దగ్గర, ఫ్రాన్సు 75 వేలకు ధర నిర్ణయించిందంటే అందులో 10, 15 వేలు లంచాలకు ఖర్చు పెట్టాల్సి వస్తుందనే అలా నిర్ణయించింది. దాంతో కొనేప్పుడే 25 వేల డాలర్లు నష్టం మనకి. ఆ డాలర్లు మనవాళ్లు లంచం తీసుకుని ఏ బాంకు అప్పిచ్చిందో ఆ బ్యాంకులోనే దాస్తారు. చివరకు ఆ యంత్రం చేత పని చేయించరు. టెక్నికల్ నాలెడ్జీ సరిపోదు. తుప్పు పట్టిస్తాం దానికి. ఈ లోపల ఆ అప్పు పాపంలా పెరిగిపోతుంది.

అసలా ప్రాజెక్టు మనమే నిర్మించుకోలేమా? ఆ యంత్రం మన శాస్త్రవేత్తలే తయారు చెయ్యలేరా? చెయ్యగలరు. కానీ ఈ అప్పులవల్ల లాభపడేవాళ్లు మన శాస్త్రవేత్తల్ని చెయ్యనివ్వరు. వాళ్లు విదేశాలకి వలసపోయి అక్కడ తమ జ్ఞానాన్ని అమ్ముకుంటారు. ఇదంతా ఒక విషవలయం. ఇది రోజు రోజుకీ పెరిగిపోతోంది. అందరికీ ఈ అవినీతి అలవాటై పోయింది.

మామూలై పోయింది. తన స్వార్థం కోసం దేశాన్ని తాకట్టు పెట్టటమంటే తను కూర్చున్న కొమ్మని తానే నరుక్కోవటమనే విషయం కూడా ఎవరికీ అర్థం కానంతగా స్వార్థం కళ్లు కప్పేస్తోంది. అన్నీ నాకే, అంతా నాకే, నేను తప్ప మరొకరు లేరు, వాళ్లకేమీ ఒద్దు, వాళ్లసలు బతకొద్దు. నా కోసం నేనేమైనా చేస్తాను. కనీసవు మానవత్వపు విలువలు పాటించననే రాక్షస ధోరణి ప్రబలిపోతోంది. తన తోటివారి కోసం ఆలోచించటమనే మాట పరిహాసాస్పదమైపోయింది.

మనదేశం అప్పుల్లోంచి బయటపడాలంటే, నిజంగా అభివృద్ధి చెందాలంటే కొన్ని పనులు, చాలా చిన్న పనులు అతి న్యాయమైన పనులు జరగాలి. కానీ అవి జరగవు. నగరాల్లో నివసించే సంపన్నులూ, మనలాంటి మేధావులూ రోజురోజుకీ మానవత్వాన్ని కోల్పోతున్నారు. రాక్షసత్వాన్ని అలవర్చుకున్న మనుషులకు ప్రగతి అక్కర్లేదు. వాళ్ళు వినాశనం వైపే పరుగులు తీస్తారు. భస్మాసురుడిలా వాళ్ళే ఈ దేశం నెత్తిన చేతులు పెడుతున్నారు. దీనికి విరుగుడుందా అని అడిగారు''

''సార్... ఊరు వచ్చేసిందనుకుంటాను'' డ్రైవర్ జీపు నెమ్మదిగా పోనిస్తున్నాడు.

ఊరి చివర పొలాలు పచ్చపచ్చగా ఉన్నాయి. అందరి ముఖాల్లోనూ ఉత్సాహం వచ్చింది. విరుగుడు ఉందో లేదో యిక ఆ సంభాషణ కొనసాగించే శక్తి మాత్రం ఆ మధ్యతరగతి మేధావులకు లేదు. ఎలాగోలా ఈ సర్వే పూర్తిచేసుకుని యిల్లు చేరితే ప్రపంచం దాని సంగతి అదే చూసుకుంటుందనే ధోరణి వాళ్ళకు కొత్తకాదు. ఇంత దారుణమైన దృశ్యం ప్రొఫెసర్ సూటిగా చెబితే, సినిమా చూపినట్లు కళ్ళకు కట్టిస్తే సహజంగానే చలించిపోయారు గానీ వాళ్ళు చాలా దారుణాలే చూసి ఉన్నారు.

తమ ఎదురుగుండా పోలీసులు జనాన్ని పిట్టల్లా కాల్చేస్తుంటే చూశారు. ఢిల్లీలో సిక్కుల మీద మూకుమ్మడి హత్యాకాండ గురించి పేపర్లలో చదివారు.

నిన్నగాక మొన్న బాబ్రీ మసీదు విధ్వంసాన్ని టీవీలో కళ్ళారా చూశారు.

ఆ తర్వాత జరిగిన రక్తపాతాన్నీ సూరత్‌లో స్త్రీల బట్టలు విప్పి వీడియోలు తీసిన వైనాన్నీ విన్నారు. చూశారు. వాళ్ళది చాలా హ్రస్వదృష్టి, చంచలదృష్టి మరో కొత్త దృశ్యం ఏదీ ప్రత్యక్షం కానంతవరకే ప్రస్తుతం చూస్తున్న చిత్రం వాళ్ళ మనసుల్లో ఉంటుంది. జాతీయ సంపదలన్నీ కొల్లగొట్టబడి దేశం పరాధీనమవుతుందనే ఆలోచన కొన్ని నిముషాలపాటు వాళ్ళను భయపెట్టింది. ఐతే ప్రమాదం యివాళ కాకపోతే ఈ పూట కాకపోతే దాన్ని గురించి పట్టించుకోని సగటు భారతీయ మనస్తత్వం వాళ్ళది. ఎప్పుడో కొన్ని సంవత్సరాల తర్వాత దేశ పరిస్థితి గురించి వాళ్ళెందుకు ఆందోళన చెందటం-

ఊరును చూడగానే అందరిలోనూ ప్రయాణం ముగిసిందనే రిలీఫ్ కొట్టొచ్చినట్లు కన్పించింది.

''ఎలా ఎక్కడనుంచి మొదలెడదాం మన సర్వే''

కృష్ణమూర్తి వచ్చినపని గురించి హడావుడి పడటం మొదలుపెట్టాడు.

''ముందు ఈ ఊరి సర్పంచ్‌ని కలుద్దాం. అతని సహాయంతో మనం ఏ వర్గానికి చెందిన కుటుంబాలను కలవాలనుకుంటామో వాటిలో టిపికల్ కుటుంబాలను ఎంచుకోవచ్చు. అది తేలిక అవుతుంది. లేకపోతే మనకు సరైన సమాచారం దొరకదు'' అన్నారు రామారావుగారు.

''సర్పంచ్ ఎవరో అతని యిల్లెక్కడో'' కాంతారావు బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు.

''ముందు కనపడిన యిళ్ళదగ్గర జీపు ఆపి సర్పంచ్ గురించి తెలుసుకుందాం. డ్రైవర్-ఏదన్నా ఇంటిదగ్గర జీపు ఆపు'' రామారావుగారు పుస్తకాలు తన చేతి సంచీలో పెట్టి ఎలర్ట్‌గా కూర్చున్నారు. అందరూ రాబోయే పూరివంక చూస్తూ అక్కడ తమకెదురు కాబోయే అనుభవాల గురించి ఆలోచిస్తున్నారు. ఒక్క సుధ మాత్రమే నీరసంగా నిరుత్సాహంగా ఉంది.

ఎందుకోగాని ఉదయం నుంచీ జరిగిన సంభాషణ ఆమెను బాగా కుంగదీసింది. ఈ రకం సంభాషణ ఆమెకు కొత్త. సగం సగం




అర్థమయింది. అర్థమయినంతవరకూ ఆమెకు విచారమే కలిగింది. ఆ విచారం ఎందుకో గూడా సరిగా తెలియదు. ఒక అస్పష్టమైన గందరగోళమైన ఆలోచన ఏదో ఆమె మనసులో గిరికీలు కొడుతూ ఆమెను కలవరపరిచింది.

జయకు ఆమెను చూస్తే జాలేసింది గానీ యిలాంటి సంభాషణ పదేపదే ఎదురైతేగానీ సుధ తన గూటిని ఒదిలి బైటకు రాదులే అని ఆమెను పట్టించుకోనట్లు కూర్చుంది.



ఊరికి ముందు మాలవల్లి, అన్ని గ్రామాల్లో లాగానే ఆ గ్రామంలో కూడా పూరి గుడిశలతో ప్రత్యక్షమయింది. పదకొండు గంటల పగటి వేళ యిళ్ళల్లో పెద్దగా మనుషుల అలికిడిలేదు. అందరూ పనులకు వెళ్ళినట్లున్నారు. పిల్లలున్న అలికిడి మాత్రం ఉంది. ఎవరి ఇంట్లోంచో ఒక ముసలమ్మ తిడుతున్న తిట్లు గాలిలో ప్రయాణం చేస్తున్నాయి. గుడిసెలకు ముందే ఊరిలోకి ఒక దారి కుడివక్కగా చీలింది. అక్కడ జీపు ఆపేశాడు డ్రైవర్. అందరూ జీపు దిగారు.

"ఆ ఇళ్ళ దగ్గరకు వెళ్ళి కనుక్కుంటే బాగుంటుంది. ఇప్పుడు ఇళ్ళల్లో ఆడవాళ్ళు, పిల్లలు మాత్రమే ఉంటారనుకుంటాను. జయగారూ మీరు వెళ్ళి కాస్త సర్పంచ్ వివరాలు కనుక్కొస్తారా?" కృష్ణమూర్తి అడిగాడు.

"అలాగే రా సుధా వెళ్దాం" ఇద్దరూ ముందుకి నడిచారు. కూచుని కూచుని కాళ్ళు తిమ్మిరెక్కిపోయాయి. నడవనివ్వటంలా. మెల్లగా కుంటుతున్నట్లు నడిచింది సుధ.

"మరీ నువ్వు సుఖానికి అలవాటు పడ్డావు. పెళ్ళయ్యాక పుట్టింటికి కూడా ప్రయాణం చేసినట్లు లేవు" జయ నవ్వింది.

"నిజమే... లయ పుట్టాక యిల్లు కదిలి ఎటూ వెళ్ళలా" ఎదురుగా కనిపిస్తున్న పూరి గుడిశెను ఒకసారి చూశారు. అది కాస్త పెద్ద యిల్లనే చెప్పాలి. కప్పు కొత్తగా నేయించినట్లు శుభ్రంగా పొందికగా వుంది. గుడిశ చుట్టూ కంది కట్టెతో దడిలాగా కట్టారు. అది ఆ గుడిశకు కాంపౌండ్‌వాల్‌లాగా పనిచేస్తోంది. ఒక చిన్న తడికతో తలుపులాగా పెట్టారు.

"ఈ ఇంట్లో కనుక్కుందాం" సుధ తడిక తలుపు నెట్టే ప్రయత్నం చేసింది.

తలుపు తెరుచుకుంది. గుడిశకూ తలుపుకూ మధ్య ఐదారు గజాల ఖాళీస్థలం ఉంది. ఆ ఖాళీ స్థలంలో కుడిచేతివక్కకు చూస్తే కనిపించిన దృశ్యం చూసి సుధ నోరుతెరిచింది. చప్పున జయ చేయి గట్టిగా పట్టుకుంది. అక్కడ అత్యంతాశ్చర్యకరంగా, అద్భుతంగా, అతి మనోహరంగా విరబూసి వుంది పసుపు పచ్చని 'గులాబీ' మొక్క. అక్కడ ఆ మారుమూల కుగ్రామంలో ఆ పేద ముంగిలిలో ఆ మొక్క అతి సహజంగా యిమిడిపోయినట్లు నిల్చుంది.

కాని, సుధకి అదెంతో అసహజంగా కన్పించింది. సుధ కళ్ళు రెప్ప వేయటం మర్చిపోయాయి. ఎలా సాధ్యం యిది? ఇక్కడ ఈ పూరిగుడిసెలో ఈ గులాబీలేమిటి? తన తోటలో లేని పచ్చగులాబీలు ఎట్లా పూశాయో. తన తోటలో ఏ మొక్కా దీనికి సాటిరాదు. సుధ మనసు అసూయతో రాజుకుంది. కాంక్షతో భగ్గుమంది.

అక్కడినుంచి ఒక్కడుగు కూడా ముందుకు వేయటం లేదు. ఆమె చూపులకే శక్తివుంటే, ఆమె మనసుకి ఆమె కోరికనిట్టే నెరవేర్చగల మంత్రమహిమ అబ్బితే ఆ గులాబీ చెట్టు క్షణంలో అక్కడనుంచి మాయమై హైదరాబాదులో సుధ తోటలో చేరిపోయేదే కానీ అదేదీ జరగలేదు. గులాబీలు వెక్కిరింతగా నవ్వుతూ ఆ గుడిశముందే ఉన్నాయి. ఆ చెట్టు ముందు పాతేసుకుపోయినట్లు సుధ నిలబడేవుంది.





ఇంతలో యింట్లోంచి యిద్దరు పిల్లలూ, ఒక మునలాయనా బైటికి వచ్చారు.

జయ వాళ్ళవైపు తిరిగింది కావాల్సిన సమాచారం కోసం. సుధకు వచ్చిన పని జ్ఞాపకం లేదు. ఇది పొరుగూరనే స్పృహపోయింది. ఆమె మనసులో కల్లోలం. తనకు అందని అపురూపవస్తువుని ఎలాగైనా స్వంతం చేసుకోవాలనే కాంక్ష- ఎప్పుడో ఎనిమిదేళ్ళ చిరుత ప్రాయంలో ఆమె మనసు నావహించి బాధించిన కాంక్ష.

మనసు పొరలలో ఒక మచ్చగా, గాయపు గుర్తుగా మాత్రమే మిగిలిపోయిన కాంక్ష క్షణాలలో సజీవమవుతోంది. దాని పుట్టుకా పెరుగుదలా రికార్డు చేసే యంత్రమేదైనా వుంటే చిన్ని మొలక నిముషంలో శాఖోపశాఖలుగా విస్తరించి ఊడలు దించి స్థిరంగా నిలబడటాన్ని అందరికీ భయం గొలిపేలా ముద్రించి వుండేది.

ఇక్కడ ఈ గుడిశముందు గులాబీలేమిటి? వీళ్ళకీ మొక్క ఎక్కడిది? ఏ జాజితీగో, మల్లె అంటో అయితే దొరుకుతాయిగానీ ఈ దరిద్రులకీ గులాబీ ఎక్కడ దొరికింది? ఎవరిస్తారు? ఖరీదుకి దీన్ని వీళ్ళు కొనటం కల్ల. ఎక్కడో కాజేసి ఉంటారు. తనలాగా అపురూపంగా పెంచుకునే ఎవరినో కన్నుగప్పి తవ్వి తెచ్చి వుంటారు.

ఛీ... దరిద్రులు, వీళ్ళకి సంపదేమిటి? తన తోటలో పచ్చగులాబీలకు కరువేమిటి? యిక్కడ కొమ్మకొమ్మకూ కోటి పువ్వులన్నట్లు విరబూయటమేమిటి?

నెమ్మదిగా కాంక్ష కరిగిపోయి ఆ స్థానంలో దిగులు చోటుచేసుకోసాగింది.

ఈ పువ్వులు తనివికావు. తనకు రావు. ఎవరివో. ఎప్పుడూ తనిలా పరాయి యింటి పువ్వులను కళ్ళప్పగించి చూడటమే. వాళ్ళు కోసుకోనివ్వరు. ఒక్క పువ్వు ముట్టుకోనివ్వరు. బంగళా ముందైనా పూరిగుడిశ ముందైనా తనిలా వెర్రిమొహం వేసుకుని నిల్చోవాల్సిందే.

సుధ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

అవతల జయ పని అయిపోయింది. సర్పంచ్ పేరూ అతని యింటికి దారీ వివరంగా కనుక్కుంది. ఆ మునలాయనకు పుట్టెడు చెవుడు. కానీ జయ పిల్లలనడిగి కనుక్కుందామంటే పడనివ్వలేదు. ఇంటికి పెద్ద తనుండగా పట్నం నుంచి వచ్చిన అమ్మలు పిల్లలతో మాట్లాడి వెళ్ళి పోవటం ఆ పెద్దాయన సహించలేడు. ఆయనతో అరిచి జయ గొంతెండిపోయింది. చిన్నిపిల్లాడిని మంచినీళ్ళడిగింది.

ఒక పిల్లాడు చప్పున లోపలకు పరిగెత్తి లోటాతో నీళ్ళు తెచ్చిచ్చాడు.

గొప్పింటి బిడ్డలా కనపడుతున్న ఆ ఆడకూతురు, పెద్ద కులం పిల్లగా కనపడుతున్న ఆ ఆడకూతురు తన యింట్లో మంచినీళ్ళు తాగేసరికి మునలాయినకు గుండె నీరయింది.

వాళ్ళ వూళ్ళో చిన్న టీ దుకాణం వుంది. పొద్దునపూట యిడ్లీలూ, పూరీలు కూడా అమ్ముతారు. అక్కడ మాలపల్లి వాళ్ళకోసం, మాదిగపల్లి వాళ్ళకోసం గ్లాసులూ ప్లేట్లూ వేరే వుంటాయి.

మొన్న మొన్ననే ఆ గ్లాసులు తీసేయాలంటూ అందరికీ ఒకేరకమైన గ్లాసులు ఉండాలంటూ పల్లెలోని యువకులు పెద్ద గొడవ చేశారు.

ఊరి పెద్దలకు కళ్ళెర్రబడ్డాయి. సమస్య యింకా పరిష్కారం కాలేదు. ఆ నేపథ్యంలో జయ చేసిన ఈ చర్య ఆ మునలాయన్ని కదిలించింది. పిల్లల ముఖాలు వెలిగిపోయాయి. ప్రపంచం మారుతుందనే ఆశ ఆ మునలాయినలో కలిగినట్లయి జయను చల్లగా వుండమని ఆశీర్వదించాడు.

జయ వెనక్కు తిరిగి సుధ దగ్గరకు వచ్చింది. సుధ ఈ లోకంలో లేదు. జయను ఒదల్లేనట్లు పిల్లలిద్దరూ వెంటవచ్చారు.

సుధ భుజంమీద చేయివేసి "పద పోదాం" అంది.

"ఎంత బాగున్నాయో చూడు" అంది సుధ చూపు మరల్చకుండా. జయ మళ్ళీ ఒకసారి ఆ పూలను చూసి ఆనందంగా,

"ఔను... బాగున్నాయి" అంది. పదమని

తొందరచేసింది. సుధకు అక్కడ్నించి కదలా లనిపించలేదు. అలాగే రెండు నిమిషాలు ఆ పూలను తదేకంగా చూసి నిస్సహాయంగా నిట్టూర్చి నెమ్మదిగా కదిలింది. నీరసంగా, సర్వశక్తులూ సర్వ ఆనందాలూ ఆ గులాబీకే అప్పగించిన దానిలా నాలుగడుగులు వేసింది.

"ఆ మొక్క వీళ్ళకెక్కడిదో- ఎక్కడో దొంగిలించి వుంటారు" ఈర్ష్యాసూయలు నిండిన గొంతుతో కోపంగా అన్నది.

జయకు ఒక్కక్షణం సుధమీద అంతులేని కోపం అసహ్యం కలిగాయి.

"సుధా... చెత్తగా మాట్లాడకు. ఎందుకు తెలియకుండా వాళ్ళను దొంగలంటావు. నీలాంటి, మీ పక్కింటి మాణిక్యవల్లిలాంటి వాళ్ళెవరో అద్దె యిళ్ళు ఖాళీచేస్తూ పీకిపారేసి వుంటే తెచ్చి పెంచుకుంటున్నారేమో, అస లైనా వాళ్ళకా మొక్క ఎక్కడనుంచి వస్తే నీకెందుకు, చూసి సంతోషించలేవూ?"

జయకు ఒళ్ళు మండిపోతోంది.

ఇంతలో వెనకనుంచి "అమ్మగారూ" అన్న పిలుపు వినబడి జయ ఆగింది. సుధ కూడా ఆగింది.

పిలిచిన పిల్లాడు వీళ్ళ ఎదురుగా సరిగ్గా చెప్పాలంటే సుధకి ఎదురుగా నిలబడ్డాడు. అతనా గుడిశ తాలూకు పిల్లాడు. ఎనిమిదేళ్ళ పిల్లాడు. చింకి పాతల పిల్లాడు, చింపిరితల పిల్లాడు. చీమిడి ముక్కు పిల్లాడు, మురికి పిల్లాడు- వాడి చేతిలో గులాబీల గుత్తి. పది పన్నెండు పువ్వులను ఆకులతో పాటు కోసి గుత్తిగా పట్టుకొచ్చాడు.

వాడి కళ్ళు వచ్చ గులాబీలకంటే కాంతి వంతంగా వెలుగుతున్నాయి. సుధకేసి ఆ గుత్తిని చాచి నిలబడ్డ ఆ చిన్ని పిల్లాడు ఏ బలి చక్రవర్తికీ, శిబి చక్రవర్తికీ తీసిపోకుండా ఠీవీగా ఉన్నాడు.

సుధ ఆశ్చర్యంగా అయోమయంగా ఆ పిల్లాడివంకా పూలవంకా చూసింది. అదంతా ఆమెకో కలలాగా ఉంది.

"ఎందుకు?" అంది అస్పష్టంగా చిన్నగా ఒణుకుతున్న గొంతుతో.

"నీకిష్టంగా... తీస్కో"

పిల్లాడి పెదవులమీద అరవిచ్చిన నవ్వు పచ్చగా గులాబీకంటే అందంగా, గర్వంగా ఉంది.

సుధ కంపిస్తున్న చేతుల్ని గులాబీలుకేసి సాచి "నీకెలా తెల్సు- నాకిష్టమని" అనడి గింది గొంతుక బిగించి.

కిలకిలా నవ్వాడు పిల్లాడు. నీ సంగతి నే కనిపెట్టానులే అంటున్నాయి వాడి కళ్ళు.

"ఆ పూలదిక్కు అట్లనే రెప్పొంచకుండా చూసిన్రూ! తీస్కొమల్ల" గులాబీ గుత్తిని సుధ చేతిలో పెట్టేసి ఆ పిల్లాడు పరిగెత్తుకు వెళ్ళిపో యాడు.

సుధకు తల గిర్రున తిరిగింది. ఆ పిల్లాడు వెళ్లిన దిక్కు చూసింది. లేడు. ఇంట్లోకి మాయ మయ్యాడు. సుధ చేతిలోని గులాబీలవంక చూసింది. నవ్వుతున్నాయి ఆ పిల్లాడిలాగానే.

ఎట్లా నవ్వాడు- ఎంత బాగుంది అతని నవ్వు.

ఎలా యివ్వగలిగాడు, ఆ బీద పిల్లాడు ఎలా యివ్వగలిగాడు? జయకు సుధ మన సులో జరుగుతున్న కల్లోలం అర్థమైంది. హఠా త్తుగా ఆ చిన్నపిల్లవాడు ప్రదర్శించిన మంచి తనానికి ముందు జయ కూడా ఆశ్చర్యపో యింది. ఆశ్చర్యం నుంచి కోలుకుని చూస్తే గులాబీలు గుండెలకు హత్తుకుని షాకు కొట్టి బిగుసుకుపోయిన దానిలా వున్న సుధ! ఈ అనుభవం సుధకు ఎట్లాంటిదో జయకు తప్ప ఈ ప్రపంచంలో మరెవరికీ అర్థంకాదు.

"సుధా..." అని పిలిచింది.

సుధ జయకేసి చూసి నిగ్రహించుకోలేకపో యింది. అంతకు ముందే జయముందు నగ్నంగా బైటపడిన తన హీనత్వం, ఆ పూల ను చూడగానే తన మనసులో చెలరేగిన అసూయ, అణచుకోలేని కాంక్ష, సంవత్సరాల తరబడి మానవుల స్వార్థం గురించి ఆమెలో కరడుగట్టుకుపోయిన అభిప్రాయాలూ అన్నీ కలగాపులగంగా పైకి ఉబికి ఆమెను ఉక్కిరిబి క్కిరి చేశాయి. తన పక్కనే పిడుగుపడినంత దిగ్భ్రమ చెందివుంది సుధ.




జయ ఆమె చేయి పట్టుకుని కది లించింది.

జయా? ఎలా యివ్వగాలిగాడు. ఎందుకి చ్చాడు'' ఆరాటంగా అడిగింది.

''చెప్పాడుగా... నీకిష్టమని యిచ్చాడు'' మృదువుగా అంది.

''నాకిష్టమైతే, నా కిష్టమని యిస్తే అతనికేం లాభం? అతనికేం లాభం? ఎందుకిచ్చాడు'' ఆవేశంగా అడిగింది సుధ.

''నిన్ను సంతోషపెట్టి అతను సంతోషపడ్డాడు. అదే లాభం. హాయిగా మనసు విప్పి నిండుగా నవ్వాడే. ఆ నవ్వే లాభం. ఇంకొకళ్ళకి యివ్వటంలో, యింకొకరిని సంతోషపెట్టడంలో, యింకొకరితో వంచుకోవటంలో వికసించిన మానవతే లాభం. ఆ అనుభూతే లాభం. ఆ పిల్లాడిలా నవ్వటం నీకు చాతనవుతుందా? వంద గులాబీ మొక్కలకు యజమానివైన నీకు చేతనవుతుందా ఆ నవ్వు! సత్తెమ్మక్కూడా ఒక్క పువ్వు యివ్వని నీకు! పూలు ఎవరికీ దక్కకుండా కాపలా కాసే నీ మనసు ఎప్పుడూ అశాంతి, కలవరం, కోపం చిరాకుల తోనే నిండివుంటుందిగానీ అలా ఎన్నడైనా పువ్వులా నవ్వగలిగిందా? ఆ నవ్వే, ఆ ఆనందమే లాభం'' సుధ మనసులో పేరుకుపోయిన కల్మషాన్ని కడిగేయాలనే తపనతో ఆవేశంతో మాట్లాడుతోంది జయ. చేతిలో పువ్వులను చూస్తున్నకొద్దీ సుధ మనసు బరువెక్కుతోంది. జయ మాటలు ఆమె హృదయపు మూలల్లోని చీకటి తావులను వెతికి వెతికి చేరుతున్నాయి. ఇన్నేళ్ళ నగర జీవితంలో ఎక్కడా ఎప్పుడూ ఎవరూ యింత అయాచితంగా, యింత అనామకంగా, యింత స్వార్థరహితంగా తనను సంతోషపెట్టలేదే. ఎందుకా పిల్లాడు తనెవరో తెలియకుండా, తనను జీవితంలో మరోసారి చూసే అవకాశం లేదని తెలిసీ యింత పని చేశాడు. నిజంగా ఆ ఆనందమే లాభమా? ఇవ్వటంలో అంత ఆనందం వుంటుందా? పువ్వులు పొందటంలోనే ఆనందం వుందనుకుని యిన్నాళ్ళూ వెర్రిగా ఆరాటపడింది. పొందింది కూడా కానీ ఆనందం మాత్రం రాలేదు. ఇప్పుడు రెండు నిమిషాల క్రితం వరకూ ఆ పువ్వులను పొందాలనే కాంక్షతో జ్వలించిపోయింది. తీరా అవి చేతిలో పడ్డాక పొందిన తన ఆనందంకంటె యిచ్చిన ఆ పిల్లాడి ఆనందమే విలువైనదిగా కనిపిస్తోంది. నిజంగానే తనవైన ఈ పూలు యిప్పుడు కూడా తనను కాలుస్తూనే ఉన్నాయి.

సుధను బలవంతంగా నడిపిస్తూ జీపు దగ్గరకు తీసుకొచ్చింది జయ.

మగవాళ్ళంతా సిగరెట్లు వెలిగించారు.

''ఏంటండీ బాబూ ఇంతాలస్యం. వాళ్ళింట్లో ఏకంగా భోజనాలు చేసి వస్తున్నారా అనుకుంటున్నాం'' అన్నాడు జయరావు.

సుధ చేతిలో పూలను చూసి కృష్ణమూర్తి నవ్వి చేయిచాపాడు. సుధ వాటిని గట్టిగా గుండెలకు హత్తుకుంది.

''అన్నీ మీకేనాండీ!'' అన్నాడు తమాషాగా.

అయోమయంగా అతన్ని చూసింది సుధ. సుధ ముఖం పరిశీలనగా చూసిన వాళ్ళందరికీ ఏదో అనుమానం వచ్చింది. ఏమని అడగాలో తెలియలేదు. చివరకు కాంతారావు తెగించి అడిగేశాడు.

''అదేంటలా వున్నారు. ఏదో షాకు తిన్నట్లు?''

''తలనొప్పిగా వుంది'' సుధ తడబడుతూ చెప్పింది. సుధ అవస్థను గమనించి,

''ఔను- సుధకు చాలా తలనొప్పిగా వుందట. సుధా నువ్వెళ్లి జీపులో కూర్చో. మేం మాట్లాడుకుని ప్రోగ్రాం నిర్ణయిస్తాం''

సుధ వెళ్లి జీపెక్కి కూర్చుంది.

''ఇవాళ ఎవరూ దయచేసి సుధను ఎక్కువ మాట్లాడించకండి. ఇవాళ ఆమె జీవితంలో చాలా ముఖ్యమైన రోజు- వీలైనంత ప్రశాంతంగా, ఒంటరిగా ఆమెను ఒదలాలి'' అన్నది. అందరూ ఆశ్చర్యపోయారు. అంగీకరించారు.

''ఇంతకూ సర్పంచ్‌గారి సంగతేమిటి?'' రామారావుగారు అడిగారు.

''సర్పంచ్ పేరు రామిరెడ్డి. ఊళ్ళో వున్న ఒక్క మేడా ఆయనదే. జీపు వూళ్లోకెళ్ళగానే మనకు మేడ కనిపిస్తూనే ఉంటుంది'' గబగబా చెప్పింది జయ.



జీపు ఊళ్ళోకి ప్రవేశిస్తుంటే పిల్లలు ఒక్కొక్కరే జీపు వెనక చేరారు. చివరికొక గుంపై జీపుని ఊరేగింపుగా రామిరెడ్డి ఇంటికి నడిపించారు.

ఇంటిముందు కూచున్న ఆడవాళ్ళు జీపును చూడగానే చెల్లాచెదరయ్యారు.

అందరూ జీపుదిగి ఇంట్లోకి వెళ్ళారు. ఇంట్లో సర్పంచ్‌గారి భార్యా, కూతురూ కంగారుపడి కాళ్లు తొక్కుకుని అందరికీ మంచినీళ్లు ఇచ్చారు.

ఆ తర్వాత "రాంరెడ్డి పొలం పొయ్యిండని" చావు కబురు చల్లగా చెప్పారు.

"అయితే పొలం ఎంత దూరం" అనడిగాడు-

"ఉండొచ్చు- కోసెడుదూరం"

ఎవర్నయినా అంతదూరం పంపటం అనవసరం అనిపించింది. తామే వెళ్తే సరిపోతుంది. ఆయన ఒస్తానంటే జీపులో ఎక్కించుకురావొచ్చు. లేదంటే అక్కడే మాట్లాడొచ్చు.

"ఐతే మేం వెళ్ళి మాట్లాడతాం" అన్నాడు కృష్ణమూర్తి.

"మంచిది" అని లోపలకు వెళ్లింది.

మళ్లీ జీపు కదిలింది. కాస్త దూరం వెళ్ళాక పొలందారి గుర్తుల గురించి సందేహం కలిగింది.

జీపు ఆపి ఎవరన్నా ఒస్తున్నారా అని చూశారు. దూరాన పధ్నాలుగేళ్ళ పిల్లాడు నెత్తిన మూటతో ఇటే వస్తూ కన్పించాడు. ఆ పిల్లాడు దగ్గరకొచ్చాడు.

"ఏమోయ్- సర్పంచ్ పొలానికి దారి తెలుసూ?" కాంతారావు అడిగాడు.

"జీపునీ, ఆ మనుమల్నీ వింతగా జూస్తూ-

"ఆ తెలుసు. మా పొలంపొంటే"

"మరి జీపెక్కి మాతోపాటు రారాదూ- మాకు దారి చూపిద్దువుగాని"

"వస్త" సంతోషంగా అన్నాడు.

"నాకు విపరీతంగా ఆకలేస్తోందండీ- ఏదన్నా తినందే బండి కదలదు" అన్నాడు కృష్ణమూర్తి.

"అందరూ టిఫిన్లు తెచ్చారుగా విప్పండి" అన్నారు రామారావుగారు.

"పదండి- ముందు కాస్త టిఫిన్ లాగించి బయలుదేరుదాం" లోపలకు వెళ్ళి సువాసనలు వెదజల్లే ఫలహారాలు పైకి తీశారు.

సుధ పూరీలూ కూరా అందరికీ పంచింది. కృష్ణమూర్తి సేమ్యా పాయిసం పంచాడు. కాంతారావు గారెలూ కొబ్బరిపచ్చడీ తెచ్చాడు. జయరావు బ్రెడ్, అరటిపళ్ళూ తెచ్చాడు. రామారావుగారు తెచ్చిన సొరకాయ పాయసం చూసి అందరూ నవ్వసాగారు.

"మీ సొరకాయలు ఇంకా అయిపోలేదండీ!"

"అవవు- ఈ సంవత్సరమంతా కాస్తూనే వుంటాయి. జన్మజన్మలకూ సరిపడా సొరకాయలు తిన్నాం. ఈ సంవత్సరం"

పాయిసం తను కొంచెమన్నా తినకుండా అందరికీ పంచిపెట్టారు.

యాదయ్యా తెచ్చిన చపాతీ, చికెన్‌కూరకు డిమాండ్ బాగా వుంది. అన్నీ మిగిలాయిగానీ చికెన్‌కూర చూస్తుండగానే ఖాళీ అయింది.

మొత్తానికి పదిహేను నిమిషాల్లో అందరి ఆత్మలూ శాంతించాయి.

మళ్ళీ ప్రయాణానికి సిద్ధమై అప్పుడు చూశారు. ఆ కుర్రాడి కోసం.

జీపుకి కాస్త అవతలగా కూర్చుని వీళ్ళ పిలుపుకోసం ఎదురుచూస్తున్నాడు.

ఒంటరిగా అతన్ని ఒదిలి తమ కడుపులు మాత్రం నింపుకున్నందుకు జయ సిగ్గుపడిపోయింది. మిగిలినవాళ్ళు దాన్నంత పట్టించుకున్నట్లు లేరు. పట్టించుకున్నా బైటపడలేదేమో- జీపు గతుకుల బాటలో పొలాలమధ్య సాగిపోయింది. పొద్దుతిరుగుడు పూలు విరబూసిన పొలాలు కన్నులపండుగ చేస్తున్నాయి. ఆవాల పొలాలు పచ్చని తివాసీ పరిచినట్లు పూతమీద వున్నాయి.

"భలే మంచి సీజన్లో వచ్చాం మనం" అన్నాడు కృష్ణమూర్తి.

"అఁ... జరా ఆపుండ్రి" అని కేకపెట్టాడు ఆ పిల్లాడు.




"ఇది మా పొలం. మా అయ్యకు కూడిచ్చి వస్త" అంటూ దిగి చేలోకి పరిగెత్తాడు.

నాలుగు నిమిషాల్లో తిరిగి వచ్చేప్పుడు ఆ పిల్లాడి చేతుల్లో వేరుశనగ మండలున్నాయి.

"తినుండ్రి- మా చేలోవి. మంచి గుంటాయి"

అందరికీ పంచిపెట్టారు.

"మనం మన టిఫిన్లు ఇతనికేం పెట్టినట్లు లేం"

రామారావుగారు నెమ్మదిగా అన్నారు.

జయ ఇంగ్లీషులో ఆ పిల్లాడికి అర్థం కా కుండా చెప్పింది.

"నిజంగా మనం సుర్చిపోయాం. పెట్టకూడదని కాదు. మన జీపు బయల్దేరేప్పుడు నాకు గుర్తొచ్చింది. చాలా సిగ్గేసింది కూడా. ఆ పిల్లాడిని ఒదిలి మనందరం తిన్నందుకు"

"మనకది అలావాటైపోయింది నగరజీవితంలో- ఎంతసేపు మనం తింటమే- మనం బతకటమే. పల్లెలకిచ్చేది ఏమీలేదు. పల్లెల్ని పీక్కుతినటం తప్ప. దానికి సింబాలిక్‌గా వుంది. ఈ పిల్లాడు మనకీ వేరుశనక్కాయలివ్వటం" రామారావుగారు నవ్వారు సినికల్‌గా. మరో మూడు నిమిషాల్లో సర్పంచ్ రాంరెడ్డి చేను వచ్చింది. జీపు దూరంగా వుండగానే రాంరెడ్డికి అది తన కోసం వస్తున్న జీపని తెలిసిపోయింది.

ఆ వూర్లో జీపులు వస్తే రాంరెడ్డి కోసం రావాలి. లేకపోతే సిద్ధారెడ్డి కోసం రావాలి. సిద్ధారెడ్డి పొలాలిటు లేవు. అందువల్ల రాంరెడ్డి జీపు దూరాన కనపడగానే చేలోంచి బైటకొచ్చి గట్టుమీద నిలబడ్డాడు.

అందరూ జీపుదిగి తమని తాము పరిచయం చేసుకున్నారు. ఆ తర్వాత రాంరెడ్డివల్ల తమకు కావలసిన సహాయం ఎలాంటిదో చెప్పారు.

"మేం మీ వూళ్లో ప్రజలు ఎలాంటి ఆహారం తీసుకుంటున్నారు. అందులో పోషక విలువలు ఎంత వున్నాయి- ఏయే తరగతి ప్రజలు ఎట్లాంటి పోషకాహారం తింటున్నారు అనే విషయంమీద సర్వే చెయ్యటానికి వచ్చాం. వూరందరినీ అడగాలంటే అది అయ్యేపని కాదు. అందుకని ఒక్కోతరగతి నుంచి ఒక్కో కుటుంబాన్ని ఎంచుకుంటాం. హరిజన కుటుంబం ఒకటి, బీదరైతు కుటుంబం ఒకటి. ఏదన్నా చేతివృత్తులు చేసుకుని బతుకుతున్న కుటుంబం ఒకటి, మీ లాంటి ధనికరైతు కుటుంబం ఒకటి"

రామారావుగారు రాంరెడ్డికి తమకు కావలసిందేమిటో అర్థమయ్యేలాగు వివరంగా చెప్పారు.

"మంచిది. అట్లనే చెయ్యండి. నన్ను గూడా మీతో రమ్మంటారా?"

"మీరు వస్తే మంచిదే- మీకు పనివుందనుకుంటే మాతో ఎవర్నన్నా పంపినా సరే-"

"కానీ ఇప్పుడు ఆడోళ్లు తప్ప ఇంట్లో ఎవరుంటారు. మీతో మాట్లాడ్డానికి? అందరూ పొలం బోతారే"

"చూద్దాం- ఆడవాళ్ళతో మాట్లాడినా చాలు. అసలు తిండి గురించి వాళ్ళే బాగా చెబుతారు"

"సరేపదండి- నేను మధ్యాహ్నానికి వస్తాను. ముందు మీరు హరిజనవాడకెళ్ళి మాట్లాడండి- ఇదుగో ఈ పోచాలుగాడు తీస్కబోతాడు మిమ్మల్ని. ఒరేయ్- అయ్యల్ని ఎంకటిగాడి ఇంటికి తోల్కపోరా- అక్కడ్నించి ముత్యంరెడ్డి గారింటికి తీసుకెళ్లు. మూడింటికల్లా నేను పొలంనుండి ఒస్తా- తర్వాత నేను తీస్కబోతా" అన్నాడు.

రాంరెడ్డి కోసం ఇంతదూరం రాకుండా ఈ పోచాలుతోనే తమ పని చెప్పివుంటే ఈ పాటికి ఒక ఇంటర్వ్యూ అయివుండేదే అనుకున్నారు.

మళ్ళీ పోచాలుని ఎక్కించుకుని మొదట వూళ్ళోకి వచ్చి ఆగిన చోటుకే- ఆ మాలపల్లి దగ్గరకే వచ్చారు. మాలపల్లి లోపలికి జీపు వస్తుంటే ఇళ్ళల్లో వున్న పిల్లాజెల్లా, మునలీ ముతకా అందరూ వచ్చి విరగబడ్డారు.

"ఎలచ్చన్లు వస్తన్నాయేందిరా" అనుకుంటున్నారు.

గుడిశ ముందాగిన జీపులోనుంచి దిగుతున్న వాళ్ళను చూసి గుడిశముందు చిన్న కుక్కిమంచంలో పడుకుని చూస్తున్న మునల

మ్మ లేచింది.

మంచానికి నేసిన నులకతాళ్ళు కిందికి వేళ్ళాడుతున్నాయి ముసలమ్మ శరీరంలాగానే.

"ఎవరో దొరల్లెగ్గొడ్తున్నరూ" అని గొణుక్కుంటూ.

"ఓ యాదీ- యాదమ్మా ఏడజచ్చినవే... ఓ యాదీ" అని కేకలేసింది.

గుడిశలోంచి అత్త కేకలకి బయటకు వచ్చిన యాదమ్మ ఎదురుగుండా దిగిన అంత మంది "తెల్లబట్టలోల్ల"ని చూసివాళ్ళు దిగిన మోటార్‌ని చూసి "మల్లేదో పేనంమీద కొచ్చిందిర బగమంతుడా" అనుకుని నిలువుగుడ్లేసుకుని నిలబడిపోయింది.

యాదమ్మకి గుండెల్లో దడ క్రమంగా పెరుగుతోంది.

"పట్నంకెల్లింత మందొక్క పాలొచ్చిరంటే..." తర్వాత ఆమె మనసుకు ఆలోచన చేసేశక్తి లేకపోయే. అస్తిపంజరంలా వున్న ముసలమ్మ కళ్ళల్లో మాత్రం జ్యోతి వెలిగినట్టయింది. ఎక్కడ లేని ఆశా ఆమె ముఖంమీదికి వచ్చిపడటం ఆ మధ్యాహ్నపు ఎండలో మరింత వెలిగిపోతూ కనిపించింది. ఆ కళ్లు ఆ లోతుకు పీక్కుపోయిన కళ్లు మరింత చిట్లించి నుదుటిమీద చేయి అడ్డం పెట్టుకుని పరిక్షగా చూసింది.

"కొరటుకెల్లి దొరలొచ్చిరు" గొణుక్కుంది.

"రాంద్రి... రాంద్రి... నీ కాల్మొక్త బాంచెన్. చచ్చి మీ కడ్పుల పుడ్త. ఇన్నాల్లకి మా పేదోల్ల మీద దయగల్గిందా- బాంచెన్ రాంద్రి రాంద్రి- ఓ యాదీ" అత్త హడావుడి చూసి యాదమ్మకేం పాలుపోవడంలా. ఈ ముసలిదానికి మతిపోయిందా భయపడాల్సిన సంగతికి సంతోషపడుతుంది అని అనుకుంటూ.

"కొడుకు లేడని పంపక లోనకి బిలుస్తదీ-" అని తనలో తాను గొణుక్కుంది.

అత్తాకోడళ్లు ఎవరి గోలలో వాళ్లున్నారు.

జీపులోంచి దిగిన రామారావుగారు, జయరావు, కృష్ణమూర్తి ముందుగా ఆ ఆవరణలోకి వచ్చారు. కాస్త వెనగ్గా యాదయ్య, జయ నిలబడి ఆసక్తిగా చుట్టుపక్కల వాతావరణం చూస్తున్నారు. సుధకు మనసునిండా పేరుకున్న దిగులునీ, గిల్టీ ఫీలింగునీ తగ్గించుకోవటం ఎలాగో తెలియక, దానితో ఈ సర్వే గురించి పూర్తి నిరాసక్తతో అందరికంటే వెనకాల నిలబడిపోయింది.

రామాగారావుగారు అటూ ఇటూ చూస్తే బోర్లించి వున్న చిన్న రాతిగాబు కనిపించింది. ఆయన దానిమీద కూర్చున్నాడు. మిగిలినవాళ్లు అరుగులా వున్న మట్టిదిబ్బమీద కూర్చున్నారు.

సుధ కోసం వెనక్కుతిరిగి చూసి కళ్ళతోనే రమ్మని పిల్చింది జయ. ఇద్దరూ ఎక్కడ కూర్చోవాలా అని చూస్తున్నంతలోనే ఆ ముసలమ్మ లబ్బున మొత్తుకుంది.

"ఆడ గూసుంద్రా- అయ్యోనే జస్తి" అంటూ జయ చేతులు పట్టుకుని ఆ కుక్కిమంచంలో కూలేసింది. సుధ ఆ ముసలమ్మకు అందకుండా తప్పించుకుని ఆ మంచం పట్టెమీద కూచుంది. జయ కూడా కాస్త ప్రయత్నించి కుక్కిలోంచి లేచి పట్టెమీదకు వచ్చి కాస్త సుఖంగా కూచుంది. ముసలమ్మ తన కుక్కిలో తను అలవాటు ప్రకారం కూలబడింది.

"ఈల్లెవరమ్మ గిట్లొచ్చి గట్ల గుసున్నరూ" అని మనసులో తికమక పడుతోంది యాదమ్మ.

ఆ గతుకుల వీధిలోకి జీపు రావడంతోనే "జీపు వెనకున్న పిల్లలకు తోడు ఆ వీధికటూ ఇటూ వున్న పిల్లలూ, పెద్దలూ ఆడామగా ముసలీముతకా తేడా లేకుండా అందరూ జీపు వెనకే బయల్దేరి ఓ పెద్ద దేవుడి వూరేగింపులా ఆ గుడిశముందుకొచ్చి వీళ్ళచుట్టూ చేరారు. అందరితో ఆ చిన్ని గుడిశముందరి అతిచిన్న చోటు కిక్కిరిసిపోయింది. వచ్చి చేరినవాళ్ళలో కొందరు నోళ్లు తెరిచి కొత్తగా వచ్చిన పట్నం మనుమలను చూస్తుంటే- మరికొందరు వాళ్ళల్లోవాళ్లు మాట్లాడుకుంటూ ఒకర్నొకరు మందలించుకుంటూ, తోసుకుంటూ,

"ఇగ జెప్తరు. జర లొల్లి చెయ్యకుర్రి" అనుకుంటున్నారు. వాళ్ళల్లో యాదమ్మకి అన్నవరసయ్యే బాగయ్య మిగతావారిని తోసుకుని ముందుకొచ్చి.

"ఇంట్ల బావ లేడా సెల్లెమ్మ" అన్నాడు.




యాదమ్మకి ఆమాట కొండంత బలాన్నిచ్చి నట్లు తేరుకుని.

"లేడు. చేనికి బోయిండు" అంది తడారిపో యిన గొంతుతో. బాగయ్య "అబ్బా" అని అటూ ఇటూ చూసి.

"అరేయ్. ఓ పొరగా. నువ్వాడేం జూస్తున్న వ్‌బే. జప్పున బోయ్ నాయన్ని దోల్కరా! పో- వుర్కు" అని యాదమ్మ కొడుకు శీనుని తొంద రచేశాడు.

అప్పటిదాకా తమ ఇంటిముందు జరుగు తున్న సందడినంతా సినిమాలా చూస్తున్న శీను మరో నలుగురు పోరలు వెంటరాగా పొలం దిక్కుగా పరిగెత్తాడు.

ఆడవాళ్లు కూచున్నవైపు కలకలం రేగింది. యాదమ్మకి అక్క వరసయ్యే వజ్రమ్మ చెల్లెలికే దో కష్టమొచ్చిందని ముక్కుచీదుతోంది. అప్ప టికప్పుడు 'వాళ్ళు' వచ్చిన ఒకేఒక్క నిమి షంలో, వచ్చినవాళ్లు నోళ్లు మెదిపేలోపే యాద మ్మ భర్తా, ముసలామె కొడుకూ అయిన కిష్ట య్యమీదికేవో కేసులొచ్చినయ్యనీ, వాటినుంచి అతనికి బైటపడడనీ, బైటపడటం మాటలతో పనికాదనీ అక్కడ చేరిన జనమంతా తీర్మానం చేసుకుని దానిని నమ్మడానికి సిద్ధమైపో తుండగా-

ఈ గోలంతా ఏమీ పట్టని ముసలమ్మ.

"జప్పున తెప్పుౘయ్యా నీ కాల్మొక్త బాంచెన్. కోరట్టుల తీర్పయినాదయ్యా. ఇప్పటిదా అప్ప టిదా. ఇరువై సమ్మచ్చరాలు నడ్సితిరి. అన్న లాయన జావనే జచ్చె... జెప్పుౘి నీ కాల్మొక్త!" అని మొత్తుకోసాగింది.

"మనమేదో తీర్పులిచ్చేవాళ్ళం అను కుంటోంది" అన్నాడు. కృష్ణమూర్తి కష్టపడి ముసలమ్మ మాటల్లో భావం అర్థం చేసు కుంటూ.

"మనం కోర్టునుంచి వచ్చామనుకుంటున్నా రు" అన్నారు రామారావుగారు.

"కేసేదో వీళ్ళది కోర్టులో వున్నట్టుంది" జయరావు. యాదయ్య కాస్త ముందుకొచ్చి ముసలమ్మ పక్కన కూచున్నాడు. ఆ మంచెం పట్టిమీద. మంచం కాస్త ప్రమాదంలో పడ బోయి సర్దుకుంది.

"అమ్మా! మేం కోర్టునుంచి రాలేదు" అని ఆమె చెవిలో కేకేసినట్లు చెప్పాడు.

"మల! పట్నంకెల్లి రాలే..."

ఆమెకు సంబంధించినవరకూ పట్నం అంటే కోర్టనే.

"పట్నంనుంచేగానీ కోర్టునుంచి కాదు. మేం వేరేపనిమీద వచ్చినాం" యాదయ్య వివ రించాడు.

"కోరటోల్లుగాదా- అయ్యో. గిప్పుడన్న ఆ బగమంతునికి మామీన దయగల్గిందని నంబ రపడ్తున్న. నేను గూడా జచ్చినంకగాని ఆ కోరటుల నాయం జెప్పరులే. మా గాచారం... ఎవల్లేం జేస్తరు. మా అసుంటి పాపం జేసినో ల్లు ఈ లోకంలనే లేరు. మా ఉసురెన్నడు తలుగుతదో... ఊ... అయ్యా మాతోని మీకేం పనయ్యా. మా గాచారం చూస్తురుగా. ఓట్ల పండగ మల్లొచ్చిందా...య్యా"

"మేం ఓట్లోల్లం గాదమ్మా" యాదయ్యకు ఆ ముసలమ్మమీద జాలి పెరిగి దయగా చెప్పాడు.

"కోరటోల్లుగారు. ఓట్లోల్లు గారు... మల్ల"

"మేం పిల్లలకు చదువులు చెప్పేపంతు ళ్లం" కృష్ణమూర్తి పెద్దగా అరిచి చెప్పినట్లు చెప్పిన ఆ మాట వినగానే వయోజన విద్యాబా ధితులైన కొందరాడవాళ్లు నెమ్మదిగా లేచి నాలుగడుగులేసి గబగబా నడిచి మాయమ య్యారు.

"మాకు నదువు జెప్పనీకొచ్చారు" నిరస నగా అంది ముసలమ్మ.

"కాదమ్మా- మీరెట్లా తింటున్నారు? ఏమి తింటున్నారు. మొదలైన విషయాలు... మీ ఆరోగ్యం గురించి కనుక్కుందామని వచ్చాం"

"పంతుళ్లమంటిరి. మల్ల పట్నం పంతుళ్ళే మందులు ఇస్తుౘా?"

"మందు ఇవ్వటానిక్కాదు" కృష్ణమూర్తికి ఏం చెప్పాలో తెలియటంలేదు.

"మల్ల మా రోగాల ముచ్చట మీకెందుకు?"

"రోగాలనే కాదు. మీరేం తింటున్నారో- ఎలా తింటున్నారో"



"చేతుల్లోని తింటున్నం. అందరు దినేదె తింటున్నం" మునలమ్మేకాదు అందరూ ఎవరికి తోచింది వాళ్ళు అంటున్నారు.

ఇక ఇలాగయితే కాదని వాళ్ళని కాసేపు మాట్లాడొద్దని గదమాయించి చెప్పి, తామొచ్చిన పనివాళ్ళకర్థమయ్యేలా వివరించి చెప్పి, ఒక్కొక్కరే సమాధానం చెప్పాలని చెప్పి ఒప్పించి మళ్ళీ మొదటి ప్రశ్న దగ్గరకి వచ్చారు.

"మేం ఏం దింటమయ్యా. ఏముందింట్ల దిననీకి. ఓ యాదమ్మ ఆ బానండ్లు జూపించు. పంతుళ్లు జూసిపోతరు" మునలమ్మ కేకకు అరుగురు పంతుళ్ళూ విలవిలలాడిపోయారు.

"అయ్యో- అట్లాగాదమ్మా. మీరు రోజువారీ తినే తిండేమిటో అది మంచిదా కాదా వాటిల్లో విటమిన్లూ అవీ వుంటాయా వుండవా..." కృష్ణమూర్తి ఆగాడు. ఆగకపోతే వెంటనే అతని నోటివెంట వచ్చేవాక్యం న్యూట్రిషన్ వాల్యూ ఎంత" అని.

ఈ పట్నవాసులకు పట్నంలో కుర్రాళ్ళకు చదువు చెప్పినంత తేలికగాదు తాము వచ్చిన పని అని అర్థమైంది. అదెంత కష్టమైన పనో ముఖ్యంగా ఏ తిండీ లేనివారు తినే తిండిలో పోషక విలువల గురించి ఎనాల్సిస్ యివ్వటమంటే వాళ్ళ జీవిత మూలాల్ని కదిలించటమని క్రమంగా తెలుస్తున్నకొద్దీ వాళ్ళకు యిబ్బంది మొదలైంది. అలాగే ఈ ప్రశ్నలు వేసి లక్షలాది గ్రామాల్లోవున్న పేద ప్రజలను చేసే అవమానం, వారి దృష్టిలో తామడిగే ప్రశ్నలు ఎంత హాస్యాస్పదమైనవో క్రమంగా వారికి అర్థమైంది. అయోమయంగా వున్న పంతుళ్ళ ముఖాలు చూసి కలిగిన సహజమైన జాలితో మళ్ళీ మునలమ్మే మాట్లాడింది.

"ఏం తింటమయ్యా! బంగారమైతె తినం. జొన్నరొట్టెలకింత తొక్కు జేనుకు తింటం. ఎన్నడన్న జరిన్ని పచ్చిపుల్సు జేసుకుంటం. ఇగా దినం ఇంట్ల పండుగే- మీ లెక్క మేం రోజు గార్లు బూర్లు దినమయ్యా"

మునలమ్మ చెప్తున్న మాటలు వింటూ దిగులుపడిపోయింది జయ. సుధకేమీ పాలుపోవటంలా చిన్నతనంలో ఒకరోజు సుధ కుటుంబం కూడా పస్తుపడుకుంది. ఆ రోజు అమ్మ యింట్లో బియ్యం లేవని ఏడ్చిన ఏడుపు గుర్తొచ్చింది సుధకు. పావలా అటుకులు తెప్పించి నానబెట్టి దాన్లో ఉప్పు, కారం వేసి అందరికీ తలా యింత పెట్టింది. అది తిని ఊరిమీద పడ్డ తండ్రి సాయంత్రానికి యాభై రూపాయల అప్పు పుట్టించి బియ్యం, కందిపప్పు, నూనె, కూరలు తెచ్చాడు. తర్వాత మళ్ళీ ఎప్పుడూ అట్లాంటి రోజు రాలేదు. ఎట్లాగోట్లా పిల్లల కడుపునింపటానికి ఎంతో కష్టపడ్డాడు సుధ తండ్రి.

మనసు అడుగున పడిపోయిన దరిద్రం ఒక్కసారి పైకి వచ్చి సుధ మనసుని అల్లకల్లోలం చేసింది. మిగిలినవాళ్ళు ఏం మాట్లాడాలో తెలియనట్లు కూర్చుండిపోయారు. మునలమ్మ ఇంటి పరువంతా తీసి పారేస్తోందనిపించింది యాదమ్మకి.

"మన్కి లేకుంటే వూరోల్లొచ్చి గింత బెత్తడ? ఎవని కష్టం వానికేగని సంసారం గుట్టు రట్టు జేస్తుందీ" అనుకుంది యాదమ్మ.

"ఓ అత్త, నువ్వూకుండు. ఉన్నదోటి, లేన్దోటి చెప్తవ్" అంది.

"ఏందే లేంది... లేంది నేనేం జెప్పిన, మల్ల వున్నదేందో నువ్వు జెప్పరాదు. పంతుల్లదే రాస్కపోతరు"

యాదమ్మ బెరుగ్గా పంతుళ్ళవంక చూసి మాట్లాడకుండా వూరుకుంది.

"చెప్పమ్మా నువ్వు కూడా చెప్పొచ్చు" అన్నారు రామారావుగారు, యాదమ్మ మాట్లాడ లేదు. అత్త చెప్పినదానికి మించి చెప్పటానికి ఆమె దగ్గర మాత్రం ఏముంది?

"మీరేమేం తింటారో చెప్పమ్మా"

"ఎందుకు చెప్పాలె సార్..." అని యాదమ్మ అక్క ముందుకొచ్చింది.

"అప్పట్సుంది జూస్తున్న. ఏం దింటరు ఏం దింటరు. అని సతాయిస్తున్రు. మీరేం దింటురని మేమడిగినమా- మీరు జెప్పిన్రా! మాగ్గల్గింది మేం దింటం. మీ తాన్కొచ్చుయితే అడ్గుతలేం గద" అంది నిష్ఠూరంగా వజ్రమ్మ.

అనుకోని ఈ ఎదురుదాడికి "పంతుళ్ళు"




నిర్ఘాంతపోయారు. రామారావుగారు చిరునవ్వు తోనే ఆ దాడిని ఎదుర్కున్నారుగాని మిగిలిన వాళ్ళు రకరకాల భావాల్ని ముఖాల్లో పలి కించారు.

ఇంతలో బాగయ్య అందుకుని

"ఓ ఒజ్జిరమ్మ- లావొర్లబడ్తివి. పంతుళ్ళు గవరమెంటోడు పంపంగ పట్నంకెల్లొచ్చిన్రు ఎర్కెనా?" అని వజ్రమ్మను మందలించాడు.

"ఎందన్న! గవరమెంటోడు మన్ని కూకుండబెట్టి మేపుతుండా? ఎంత కష్టం జే సిన నాల్గు మెతుకులు దినే రోజు లేదాయె. రేడివాలో ఒర్లుడేగాని జర్రంత అగ్గదగ బియ్యం భీ యియ్యరు. రాషన్ దుక్నంల శక్కర్ భీ దొరకది. మీదికెల్లి సతాయించుడు లావు. ఏం జేస్తుండయ్యా గవరమెంటోడు. గరీబోన్ని పీక్కదినే గవరమెంటు నీకు లావ యితే నువ్వు జెప్పు. నీ యింటికి బండిలో బస్తాలు దొలిస్తడు" అని కయ్యి కయ్యిన కేకలేసి,

"ఏం సొద్దెం జాత్తరమ్మ. అల్లడుగుడు మీరు జెప్పుడు" అనుకుంటూ జుట్టు ముడి వూడదీసుకుని దూసుకుంటూ మళ్ళీ ముడేసు కుంటూ "రాయే పోరీ" అని కూతుర్ని వెంటదీ సుకుని వెళ్ళిపోయింది వజ్రమ్మ.

ఆమెతో పాటు మరో యిద్దరు వెనక్కు చూసుకుంటూ వెళ్ళిపోయారు.

"తూ నీయవ్వ! ఆడోల్లు ఆడోల్లెక్కుండక పోతే గిట్లనే. మా వూర్ల ఆడోల్లకీమద్దెల పొగురు లావయింది. మంచి తెల్లదు. మర్యాద్దెల్వదు. మీరేమనుకోకుర్రిసార్ దాని నాల్క జర తేజు న్నది" అన్నాడు బాగయ్య.

అంతలోనే శీనూ మరికొంతమంది పిల్లలూ వురుక్కుంటూ వచ్చారు.

"నాయనొస్తుండు" అన్నాడు శీను.

"అగో- బావ వస్తనే వుండు"

కిష్టయ్య ఆదరాబాదరా పరిగెత్తుతున్నట్టు వచ్చాడు. పట్నం బాబుల్నీ అమ్మల్నీ యింటి ముందుజేరిన పిల్లా జెల్లల్నీ పనికిబోలేని పెద్దల్నీ చూశాడు. బాగయ్యని చూస్తూ "ఏందే... ఏమయిందంట" అన్నాడు.

"ఏంలేదు బావా! పట్నంకెల్లి పంతుల్లొచ్చి న్రు. గవరమెంటోడు పంపిండంట..."

చేను మనకయ్యిందంటనా?" ఆతృతగా అడిగాడు కిష్టయ్య.

"చేన్లెక్కెల్లి రాలే-"

"మల్ల..." కిష్టయ్య అనుమానంగా చూశా డు. వివరంగా తనకర్థమయిందంతా చెప్పాడు బాగయ్య. బాగయ్యకు అట్లా అర్థమయ్యేటట్లు చెప్పగలిగినందుకు సంతోషించారు కృష్ణమూ ర్తి, జయరావు.

"గట్లనా! నేనింక పేసం బోయేటట్టురుకొ చ్చిన"

పనాపి పరుగెత్తుకొచ్చినందుకు బాధ కిష్ట య్య ముఖంమీద.

"నిన్ను పిలవమని మేం చెప్పలేదు. మేం ఒద్దని చెప్పేలోపలే మీ అబ్బాయి పరిగెత్తుకు పోయాడు"

సంజాయిషీ చెప్పినట్లుగా అన్నారు రామా రావుగారు.

"పర్వాలేద్సార్- జరపన్ల వున్న. అంతల్లో గీ పొరలొచ్చి-" మొహమాటంగా అన్నాడు కిష్ట య్య.

"పంతుళ్ళడిగిందానికి జెప్పకుంట వూకె లొల్లిపెడుతుండ్రు బావా" అని బాగయ్య కిష్ట య్యతో ఫిర్యాదు చేశాడు.

"చెప్పి సావరాదె" అని కిష్టయ్య యాద మ్మని గదమాయించి

"అడుగుండ్రి సార్-" అన్నాడు కృష్ణమూ ర్తితో.

"జొన్నరొట్టెలు తింటామని చెప్పారు గదా- బియ్యం అసలు ఒండుకోరా?"

"ఒండుకుంటం- ఎన్నడన్న"

"అన్నంలోకి ఏం తింటారు?"

"తొక్కే- ఎన్నడన్న వప్పుచారు కాస్తే పండగ. మాంసం తెస్తం పద్దినాలకోపాలి"

"ఏ మాంసం తెస్తారు?"

"గొర్రెనో- బర్రెనో"

"కోడి మాంసం?"

"కోడి మాంసం ఎన్నడో పండక్కి"

"ఎంత మాంసం తెస్తారు ఒక్కోసారి?"

''పావు''

''ఎంతమంది తింటారు?''

''ఇంట్ల వున్నోల్లందరు దినొద్దా మల్ల''

''ఎంత మంది ఉన్నారు?''

''మా అత్త, నేను, మా మగాయిన, మర్ది, నలుగురు పోరలైతిరి- ఎంత మందో మరి''

''ఎనిమిదిమంది'' జయరావు చెప్పాడు.

పావుకిలో మాంసం ఎనిమిదిమంది తింటారని జాగ్రత్తగా రాసుకున్నారు.

''గుడ్లు తింటారా?''

''కిష్టయ్య రెండు దినాలకోపాలి తింటడు. తాగొస్తడు గదా గుడ్డు తెచ్చి ఒండమంటడు''

''కందిపప్పు తింటారా?''

''ఉంటె ఎందుకు తినమయ్యా- ఏడ దొరుకతుండె? కిలో పదేను రూపాయిలాయె''

''పాలు కొంటారా? మజ్జిగ, పెరుగు''

''ఏడ దెత్తుము- పాలు గొనలేం- పాలు గొని ఏం జెయ్యాల? పరమాన్నం ఒండాల్నా?''

''మజ్జిగ తాగరా?''

''తాగం''

''ఈ ఇంట్లో ఎనిమిది మందున్నారు గదా- ఎంతమంది పని చేస్తారు?''

''కిష్టయ్య, ఎంకటయ్య పని దొరికిన రోజు బోతరు. ఆడోళ్ళకి ఒక రోజు పనుంటె పది రోజులుండదాయె- పోరలు చిన్నపిల్లలాయె శీను గాడ్ని సంవచ్చరాది నుండి పాలికి బెడుతుంటిమి''

''కూలి ఎంతొస్తది?''

''మగాళ్ళకి నాల్గు శేర్లు. ఆడోళ్ళకి 3 శేర్లు''

''ఏంది గింజలా?''

''ఔ''

''డబ్బులివ్వరా?''

''ఒక్కో తూరిస్తరు. మగోళ్ళకి 8 రూపాయలు, ఆడోళ్ళకి 5 రూపాయలు''

రామారావుగారితోసహా అందరూ ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. హైదరాబాదుని అనుకుని వున్న రంగారెడ్డి జిల్లాలో కూలి రోజుకి 8 రూపాయలా? ఆడోళ్ళకి 5 రూపాయాలా? ఏం తింటారు? ఎట్లా బతుకుతారు.

నమ్మలేక నమ్మలేక మళ్ళీ మళ్ళీ అడిగారు.

''మరి సరిపోతుందా?'' జయరావు ఎందుకడుగుతున్నాడో కూడా తెలియకుండా అడిగాడు.

''అయ్యా- ఎనిమిదిమంది రెండుపూట్ల తిననీకి ఏం సరిపోతాది? మీరట్లనే తింటన్నారా? ఈ తెల్లబట్టలు అట్లనే గడుతున్నారా! అందర్కి పని దొర్కి పాతిక రూపాలొచ్చినా తిండికి జాలవు, గుడ్డేం కొనాల- రోగమొస్తె, మందేం గొనాలా?''

అక్కడ కూర్చున ఆడవాళ్ళనూ మగవాళ్ళనూ పరిశీలనగా చూసింది జయ.

అందరూ రక్తహీనంగా అనారోగ్యంగానే కనిపించారు.

''ఇంత తక్కువ కూలీ ఏమిటి'' రామారావు గారికే మింగుడుపడటంలేదు.

''ఈడ పనుల్లేవు దొరా- యాడకెల్లి దెచ్చిస్తరు? సిద్ధారెడ్డి దొరా, రాంరెడ్డి దొరా తప్ప మంచిగ ఎవసాయం జేసెటోళ్ళు కూడా లేరు. వాళ్ళిద్దర్కి భూముల్ల బాయిలుండె కరంటు పంపులుండె. మిగిల్న భూములు ఆనలొస్తె పండి. ఆన రాకుంటె ఎండె''

''సిద్ధారెడ్డి ఎవరు?'' రాంరెడ్డిని చూశారు గాని వీళ్ళకి సిద్ధారెడ్డి గురించి తెలియదు.

సిద్ధారెడ్డి ఎవరనే ప్రశ్న చెవిని పడటంతోనే ముసలమ్మకి అగ్గి ముట్టుకున్నట్టయింది.

''ఆ సిద్ధారెడ్డి ముండకొడుకు నాశనంగాను. ఆని తలపండు బలగా- మందిని ముంచి పొట్టబలగ తినే తిండి తిండవుతాదమ్మ...''

''ఎవరమ్మా ఈ సిద్ధారెడ్డి'' జయకు ఈ సిద్ధారెడ్డికీ, వచ్చిన దగర్నించీ ముసలమ్మ నోట్లో కిష్టయ్య నోట్లో నలుగుతున్న కోర్టు సంగతికీ సంబంధం వుందనిపించింది, ముసలమ్మ కోపం చూస్తుంటే-

''మీరు పట్నపోల్లు- ఈడ మందిని ముంచి ఆడ బంగ్లలు గడుతున్నడు. ఓటల్లు బెడుతున్నడు. మీ పట్నంలనే వుంటడు. సిద్ధారెడ్డి తెల్వదా?''

''మాకు తెలియదు'' జయ విచారంగా




అన్నది. బాగయ్యా అందుకుని...

"ఓ అత్తమ్మా పట్నం అంటే మనూరు లెక్క పద్నాల్గు గుడిశలూ నాల్గు పెంకటిల్లూ ఒక్క బంగ్లా వుంటదనుకుంటున్నవా? నేను మస్తు యాత్రెల్లినగదా. అది శాన పెద్దగుంటది. ఒక మూలనుంచి ఒక మూలకు బోవాల్నంటే దినం బట్తది"

మునలమ్మ బాగయ్యా జ్ఞానాన్ని ఏ మాత్రం ఒప్పుకోదల్చుకోలేదు. "అరే ఓ బాగ్గా! నేను భీ పట్నం బోయొచ్చిన. అది సిన్నగుంటేంది? పెద్దగుంటేంది? వక్కనున్నోడు ఎంత బద్మాము గాడో, ఎంత లంగ పనిజేసి బంగ్ల కట్టిండో వక్కనున్నోనికే తెల్వదు... తెల్సిన గమ్మునుంట రు. వూర్ల అంత లంగలుంటే కట్టెల్ బట్టుక కొడ్తరు. గందు గురించే గీడ లంగపని చేసెటో డు గూడ పట్నం బోయి దాక్కుంటడు. దోసిన డబ్బు దాస్కుంటడు మురికి నీల్లల్ల పందుల్లె క్క" అని పట్నం గురించి జ్ఞానాన్ని అందరికీ వాటింది.

"ఆ సిద్ధారెడ్డి మీ పొలం కాజేశాడా?" జయ ఉండబట్టలేక అడిగింది.

"కాజెయ్యాలే మరి! మా మునలాయనకు- అప్పుడు వయనుల్నేవున్నద్లే.. ఇగో ఈ కిష్టయ్యా పది నమ్మచ్చరాల పోరడు- అప్పుడిన్ని యిప్పు డిన్నీ పది మానికెలు జొన్నలిచ్చిండు. యాభై మానికలిచ్చినా అన్నడు. ఎన్నిచ్చిండో మాకు లెక్కబెట్టనీకొస్తదా? రానుడు బీనుడొస్తదా? ఒక నాడో మునలాయన్ని బిల్చి "ఒరే పోసిగా- నేనిన్ని జొన్నలిచ్చిన ఆటికిన్ని జొన్నలు నాగు లయింది- అని ఎన్నెన్నో జెప్పిండు. ఎన్ని జనమలెత్తిన తీర్వలేనన్ని లెక్కలు జెప్పిండు. అదేంది దొర అప్పట్సంది నీ తాన పని జేస్తనే వున్న. నా కొడుకు నీ బర్లను జూస్తుండు. నేన్నీ పొలంలో పని చేస్తున్న అని మొత్తుకున్నడు. నత్తెమే గదా! గాని నాయానికి కూడు దొరికే దినాలు గాకబోయె!

సిద్దారెడ్డి కింద బెట్టిండు మీద బెట్టిండు. సతాయించి సతాయించి గుంపిండు. ఆకరికొ క్కనాడు మా చేనుమీద పడ్డడు. అదేమంటే అప్పుకింద జమేనుకున్న. నువ్వు భీ అందు కొప్పుకున్నవ్ ఇదిగో నిశాని అన్నడు. ఎక్కడ నిశానీ గుద్దుమంటె అక్కడ గుద్దుడేనాయె. పొలం పోతదనుకుంటమా? ఇంత అన్యా లమా! నీ దేవుని గుల్లె మన్నుబొయ్య. దేవుడు లేడు. నాయం లేదు. డబ్బున్నోనిదె రాజె మాయె. సిద్దారెడ్డి తాన మస్తుడబ్బుండె. దేము డు భీ అని పచ్చమె. గరీబోన్ని నమ్ముకుంటె దేమునికైన నాలుగు మెతుకులు దొరకయ్ గదా"

"నిశాని గుద్దుడు మన తప్పాయె. నడుమ దేముడేం జేస్తడే" నిష్టూరంగా అన్నాడు కిష్ట య్య.

"ఏం జేస్తడా! ఆ సిద్దారెడ్డి తలపండు పలగ్గొట్టడ్దా! అరే సిద్దారెడ్డిగా పల్లాం పిల్లలు న్న పోసిగాని కన్నాయం జేసి ఆని వునురు పోనుకున్నవురా అని ఆని కాలు సెయ్యి యిర గదియ్యొద్దా? దేముడేం జేసిండు? ఎంతన్నా లంజోస్తే అంత మస్తుగ తబ్బచ్చి ఆ సిద్దారెడ్డి గాన్ని ఊరబందిలా బెంచుతుండు. మనం కూలినాలి జేసి వచ్చిన పైసలన్నీ దీస్కపోయి ఆ కోరట్ల సుట్టూ, ఆ నల్లకోటోల్ల సుట్టూ తిరుగుడాయె.

నువ్వే జెప్పమ్మ! మీరు సదువుకున్నోల్లు! మీరేం సదువుతరు? యిస్కూల్లల్ల- పెద్దపెద్ద బర్లల్ల- గరీబోన్ని చదువురానోన్ని జూస్తే అంత నారాజెందుకయితరు? తెలివిలేనోన్ని చూ డంగనె మోసం చెయ్యాలన్పిస్తదిలే పెద్ద సదు వులు సదివితే-

నా సేను నాదని సెప్పనీకి, సిద్దారెడ్డిది కాదని సెప్పనీకి ఎంతమంది చదువుకున్నోల్లు, ఎన్నెన్ని ఆఫీసులు ఏలకేలు జీతాలు తీసుకు న్నయ్- లెక్కలుంటాయా మీ తాన. ఒక్కటి గాదు, రెండుగాదు, మూడు గాదు, పది గాదు, ఇరవై సమ్మచ్చరాల్సంది మా కేసు నడ్వబట్టె. మునలాడు చేనికి కోర్టుకి దిర్గిదిర్గి యాలపాల లేక తిననీకి నాలుగ్గింజలు లేక అలిసలిసి సచ్చిండు. నడుమ నేను కొన్ని దినాలు సచ్చిన. ఇంత మునల్ది యిట్ల దిర్గుతుంది తనదిగా పోతే గరీబోల్లు గులాపోల్లు దొరమీద కోర్టుల్ల మల్లబడతరా అని సమజ్జెయనీకి ఆ పట్నం తలుగబడ, ఆ పట్నంల ఒక్క సదువు వున్నో న్కి గూడ మనను లేదు.

ఇగ నా కొడుకు తిరుగబట్టిండు. తిరగాలే.



అని కొడుకు ఆ శీనుగాడు కూడా తిరుగాలి. ఆ సిద్దారెడ్డి గాడేమో కూర్చున్న కుర్చీమీద నుంచి నుతలేవకుంట తీగమీద మాట్లాడ్తడు. సదువుకున్నోళ్లంటె డబ్బున్నోడికి గులాం... గంతె గదా''

వేమనపద్యం చదువుకోకపోయినా మునలమ్మ ఆ పద్యాన్ని వేమన గురించి పరిశోధన చేసి ఆయన తత్త్వాన్ని విశ్లేషించే పండితులకన్నా మిన్నగా ఆ పద్య సారాంశాన్నంతా తన జీవితానుభవం నుంచి విశ్లేషించింది.

''చూస్త... చూస్త... నా చేను నాకు గాకుంట యాడికి బోతదో. డిల్లీకెల్లి భీ తగాద పెట్టుకుంట చేను మా కొచ్చేదంక యముడొచ్చిన 'తర్వాత రా బే పో' అని చెప్పేద్దే!''

పట్నం బాబులూ, అమ్మలూ నిర్ఘాంతపడి కూర్చున్నారు. ఇరవై సంవత్సరాలనుండీ భూమికోసం పోట్లాడుతున్న ఆ మునలమ్మను అందరూ కళ్ళప్పగించి చూశారు. మునలమ్మ మాట్లాడే ఒక్కోమాటా ఒక్కో గ్రంథంలా వుంది వాళ్ళకి.

అన్ని శాస్త్రాలూ, ఆర్థికం, న్యాయం, రాజ్యం, చరిత్ర ఒకటా అన్ని శాస్త్రాలూ ప్రతి వాక్యంలోంచీ తొంగిచూసి ఆ మేధావుల్నీ పండితుల్నీ కలవరపెడుతున్నాయి.

అన్నిటినీ మించి పోరాటం అనే స్పిరిట్‌వల్ల ఆ మునలమ్మ ముఖం తేజస్సుతో ఉట్టిపడుతోంది. నల్లగా, ముడతలు పడిన ఆ ముఖం, పైకి తేలుతున్న నరాలు, బీడువడ్డ భూదేవిలా వున్న ఆ మునలమ్మను చూసి వారు తల్లకిందులైపోయారు. ఆ మునలమ్మ ముఖం ఒక పరమ ప్రాకృతికమైన సౌందర్యంతో, తేజస్సుతో వెలిగిపోతోందనిపించింది జయకు. యముడు కాదు వాడి బాబొచ్చినా మునలమ్మకు సలాం చేసి పోవల్సిందేననిపించింది.

వాళ్ళొచ్చిన పనీ, సేకరించాల్సిన సమాచారం, దానిని విశ్లేషించి పంపాల్సిన రిపోర్టులూ అవేవీ వాళ్ళ బుర్రల్లో లేవు. పది మానికల జొన్నల కోసం మూడెకరాల భూమి పోయింది.

సుధ ఇంతవరకూ తను చిన్నతనంలో గులాబీపువ్వుల కోసం తిన్న దెబ్బల గాయం గుర్తొచ్చినప్పుడల్లా అవమానపడేది. బాధపడేది. కసి పెంచుకునేది. ఇవాళ ఈ మునలమ్మ కథ విన్నాక సుధకు మొదటిసారిగా తను తిన్న దెబ్బల కోసం గర్వపడింది. ఆ గర్వం ఎందుకో ఆ ఫీలింగ్ తనకిప్పుడు ఎందుకు కలుగుతోందో సుధకు తెలియటంలేదుగానీ సుధకు ఆ సంఘటనంతా కొత్తగా గుర్తుకొచ్చింది. ఆ గులాబీల కోసం తను చేసినది పోరాటమనిపించింది. నిస్సహాయుడై తనను కొట్టిన నాన్న మీద అంతులేని ప్రేమ పుట్టుకొచ్చింది. తను తిన్న దెబ్బలు ఎంతో ప్రియంగా, గర్వంగా అనిపించి సుధ కళ్లల్లో నీళ్లు ఉబికాయి. ఆ నీళ్ళ కళ్ళను కిందకు దించితే ఒళ్ళో తను పదిలంగా పట్టుకున్న పచ్చగులాబీలలోంచి నవ్వుతున్న ఆ మురికి పిల్లాడి ముఖం గుర్తుకు వచ్చింది.

జయ ఏదో ఆలోచిస్తూ సుధ కళ్ళల్లో నీళ్లు చూసి ఆశ్చర్యపోయింది.

''ఆ చేలోకి ఎప్పుడన్నా వెళ్తారా?''

కృష్ణమూర్తి గొంతు పేలవంగా ఉంది.

''ఎప్పుడన్నా ఏంది! ఎప్పుడూ ఆడనే పని చేస్తం. ఇప్పుడు ఆడ్నించె వురుక్కుంట వచ్చిన''

''అదేంటి? సిద్దారెడ్డి రానిస్తాడా?''

''ఆడెవడు రానియ్యనీకి. నా చేను. నేనెల్త. పనిచేస్త. నన్ను కాదని చేలో దిగేటోడెవడు?'' కిష్టయ్య కంఠంలోని స్థిరత్వం చూశాక ఎవరికీ ఏ అనుమానం కలగలేదు.

''సొంతచేలోనే కూలి చేస్తడు. వూర్లె ఏ పొలం అట్లవుండదు. అద్దమోలె వుంచుతడు. ఎప్పటికైన ఆ పొలం తనదెనాయె'' అన్నాడు బాగయ్య.

తన పొలంలో చాకిరీచేసి పంట దొరకిచ్చి మళ్ళీ చాకిరీచేసి వచ్చిన కూలితో పొలంకోసం కొట్లాడుతున్నారు. చేసిన కూలితోపాటు ఇంట్లో వున్న చెంబూ తపాళాలమ్మి కోర్టులకీ లాయర్లకీ కడుతున్నారు. వీళ్ళ డబ్బులు తీసుకుని తిని తాపీగా తాంబూలాలు వేసుకుని కోర్టుల్లో నిద్రపోతున్నారు కోర్టువారు.

ఒక్కరోజు- ఒక్కరోజంటే ఒక్కరోజు చాలు. ఈ వూరొచ్చి ఈ కుటుంబాన్ని చూసి, ఈ





పొలాన్ని చూసి ఆ భూమితో వాళ్ళకున్న అనుబంధాన్ని చూస్తే చాలు. తీర్పు చెప్పెయ్యవచ్చు.

పొలాన్ని కిష్టయ్యకు ఇచ్చెయ్యవచ్చు.

కానీ అలా ఇవ్వటానికి చదువుకున్నవాడికి మనసొప్పదు. డబ్బున్నవాడిని కాదంటే చదివిన చదువు కూడుపెట్టదని వాళ్ళు చదివిన చదువులు వాళ్ళకు నూరిపోసాయి. డబ్బున్నవాడి పక్షాన్ని ఒదిలి ప్రజల పక్షం చేరితే ప్రజలు తమ ప్రాణాల్ని ఇచ్చి తమను బతికిస్తారనీ, తమను దేవుళ్ళలా కొల్చుకుంటారనీ వాళ్ళ చదువులు వాళ్ళకు చెప్పలేదు.

డబ్బున్నవాడు తిని విదిల్చే ఎంగిలిమెతుకుల కోసమే మాన ప్రాణాలన్నీ ఒదిలి జీవచ్ఛవాల్లాగా పడివున్నారు విద్యావంతులు.

చట్టాలు, సూత్రాలూ, పద్ధతులూ అన్నీ డబ్బున్నవాడికి అనుకూలంగా రాసిపెట్టిన వీరు మేధావులే. ఈ తీర్పుగానీ ఏ తీర్పుగానీ త్వరగా చెప్పరు. అలా చెబితే ఏదో ప్రమాదానికి లోనవుతారు. అందుకోసం సంవత్సరాల తరబడి తన పొలంలో తనే కూలీ చెయ్యాలి కిష్టయ్య. కిష్టయ్య కూలీతిన్న కోర్టు భవనాలు పెరుగుతాయి. జడ్జీల జీతాలు పెరుగుతాయి.

కోర్టుని నమ్ముకున్న ఉద్యోగస్తుందరి జీతాలూ పెరుగుతాయి. కిష్టయ్య కూలీ గింజలు కూడా తినకుండా అకాల వార్ధక్యానికి గురవుతాడు. శీనుకి చదువుండదు. తాత పొలంలో కూలీగా మారతాడు. పండించిన పంటంతా దొర మిల్లుకెత్తుతాడు. నగరంలో తెల్లగా మెరిసిపోయే వేడివేడి అన్నం వెండికంచాల్లో ప్రత్యక్షమవుతుంది. సిద్ధారెడ్డి! పొలం ముఖం ఎరగని సిద్ధారెడ్డి! పొలం ఎల్లలు తెలియని సిద్ధారెడ్డి, పొలంపని చెయ్యని సిద్ధారెడ్డి, ఏరువాకలు తెలియని ఎయిర్‌కండిషన్ రూముల్లోని సిద్ధారెడ్డి ఆస్తులు ప్రతి సంవత్సరం పెరిగిపోతూ వుంటాయి.

కిష్టయ్య కుటుంబాలు మాత్రం సంవత్సరం పొడుగూతా పొలాల్లో పనులుచేసి పంటలు పండించి జొన్నరొట్టెలూ దాన్లోకి ఏవో తొక్కులూతిని, సరైన తిండిలేక క్షీణించి రోగాలపాలై ఏ మందూ దొరక్క దిక్కులేని చావు చావాలి.



అందరి మనసుల్లోనూ దిగులు ఆవరించుకుని వుంది. పల్లెల్లో దరిద్రం వుందని తెలుసూ, జనం ఆకలితో చచ్చిపోతున్నారనీ తెలుసు. రోజూ పేపర్లు చూసేవారికి ఈ విషయాలు మరీ కొత్తకాదు. కానీ ఆ దరిద్రంతో ముఖాముఖి సంభాషించటమంటే, ఆ దరిద్రం రేపే ప్రశ్నలను వినటమంటే తాము డిపార్టుమెంటుల్లో తీరిగ్గా, టీలు తాగుతూ చర్చించటం కాదని వాళ్ళకు అర్థమయింది.

వాళ్ళందరికీ ఆత్మసమర్థన బాగా అలవాటైన విద్యే!

కాలేజీల్లో తాము పాఠాలు సరిగా చెప్పకపోయినా- పని చేయటంలోకంటే జీతాలూ, ఎరియర్లూ లెక్కకట్టుకోవటంలో ఎక్కువ శ్రద్ధ చూపినా-

పరిక్ష పేపర్లు దిద్దటంకంటే అవి దిద్దితే వచ్చే డబ్బులమీదే తాము ఎక్కువ ఆసక్తి చూపినా-

పరిక్ష పేపర్లు కళ్ళు మూసుకుని దిద్దుతున్నా- డిపార్టుమెంట్ల మీదకు దండెత్తిన విద్యార్థులకు మార్కులు గుమ్మరించినా-

తెలివిగల విద్యార్థులను అణిచివేసినా-

విద్యార్థులతో స్నేహం చేసే శక్తిలేక శత్రుత్వం పెంచుకున్నా- ఏం చేసినా సరే- తాము చేస్తున్న ప్రతి పనినీ సమర్థించుకోగల తెలివి

వారి సొత్తు!

తాము చేసే ప్రతి పొరపాటుకీ ఎక్కడో ఏదో కారణం చూపించి ఆ గిల్టీ ఫీలింగ్‌ని అవలీలగా అవతలకు తోసెయ్యగల సత్తా వారికుంది.

మనమేం చెయ్యగలం దేశం తగలబడుతుంటే- మనం ఒక్కళ్ళం చెంబెడు నీళ్ళుపోస్తే ఆరుతుందా? మన చెంబెడు నీళ్లు వృధా కావటం తప్ప అనుకునే తత్వం ఒంటబట్టించుకున్నవాళ్ళే.

ఐనా తాము పనిగట్టుకని వచ్చి ప్రత్యక్షంగా చూసిన ఈ దరిద్రం వాళ్ళను గిల్టీగా చేసింది.

ఎంత రాటుదేలిన హృదయాలను కూడా కదలబారించింది. ఒకరితో ఒకరు మాట్లాడుకునే ఓపిక కూడా లేనివారిలా నిశ్శబ్దంగా జీపులో ఎక్కికూచున్నారు.

పోచాలు "ఏ దిక్కెళ్లామయ్యాగిప్పుడు" అనడిగితే 'ఎక్కడికీ ఒద్దు మా నగరానికి మేం వెళ్ళిపోతాం. నగరాల్లో మా గుహల్లో మా గూళ్ళ లో మేం పడిపోతాం. అక్కడ మా బతుకులు మేం ఒంటరి ఒంటరిగా భయం భయంగా బతుకుతాం. ఆ భయం పోగొట్టుకోటానికి దబాయింపులు నేర్చుకుంటాం. పెనుపాములను చూసి కూడా కేవలం చేంతాడులనీ, ప్రమాదం లేనేలేదని మమ్మల్ని మేం నమ్మించుకుని నిశ్చింతగా నిద్రపోతాం.

ఎప్పుడన్నా దొంగలు తలుపులు బద్దలుకొట్టి సామాన్లు ఎత్తుకెళ్తే ఏడుస్తాం-

జీతం నాలుగురూపాయలు పెరిగితే సంతోషిస్తాం. ఎట్లాగోట్లా నానాగడ్డీ కరిచి, ఆత్మద్రోహాలు చేసుకుని టి.వి.లు, ఫ్రిజ్‌లు, వాషింగ్‌మెషిన్లూ వంటి వస్తువుల సంపాదనలో తలమునకలైపోతాం!

అంటూ అరవాలని వుంది వాళ్ళకు ఆత్మల లోలోపల. కానీ వాళ్ళకు ఆ మాటలు పలికే ధైర్యం కూడా లేదు. అందుకే కృష్ణమూర్తి పోచాలుతో.

"రాంరెడ్డి ఇంకోకాయన పేరు చెప్పాడే- వాళ్ళింటికి తీసుకపో" అని నీరసంగా చెప్పాడు.

జీపు పోచాలు డైరెక్షన్లో సందులు గొందులు తిరిగి ఓ ఇంటిముందు ఆగింది.

అది ముత్యంరెడ్డి అనే రైతు ఇల్లు. పదిహేనెకరాల రైతు. పొలమంతా మెట్ట పొలమే. వర్షాధారపు పొలం. బాగా కురిస్తే వరదపాలు కురవకపోతే కరువుపాలు అన్నట్టుంది పొలం పరిస్థితి. కురవని సంవత్సరాలే ఎక్కువ. ఏటా పెరిగిపోతున్న అప్పులను తట్టుకోలేక సతమతమయ్యే అసంఖ్యాక రైతుల్లో ముత్యంరెడ్డి ఒకడు.

ఆరోజు ముత్యంరెడ్డి ఇంట్లోనే వున్నాడు. పొలం పోవాలనిపించలేదు. పొలంపోతే ప్రయోజనమూ కనిపించటంలేదు. ప్రతి యేడూ కనీసం బండిలాగటానికైనా సరిపోయేది పంట.

ఈ ఏడాది అదీ లేదు.

వానలు కురిస్తే అప్పులు సగమన్నా తీరేవి. వానలు కురవకపోతే వడ్డీలు కట్టటానికన్నా సరిపోయేవి.

ఈ ఏడు వానలు ఫరవాలేదు. మరీ నోట్లో దుమ్ముకొట్టిపోలేదు. మబ్బు నమ్ముకున్న రైతుల నోట్లో మన్నుపొయ్యలేదుగానీ మనుషులు పోశారు.

ఆ మనుషులు చేసిన దారుణానికి నడుంవిరిగి పడున్నాడు ముత్యంరెడ్డి.

ఇంటిముందు జీపూ, జీపు వెనక సందడీ చూసి లేచినిలబడ్డాడు. కలవరపడుతూనే దానిని కప్పిపుచ్చుకుని వాళ్ళని లోపలికి పిలుచుకొచ్చాడు.

రెండు మంచాలు ఇంట్లోంచి తెప్పించి వాల్చి దుప్పట్లు పరిచి అందరినీ కూర్చోబెట్టాడు.

మొదటి ఉత్సాహం ఈ ఆరుగురిలోనూ లేదు. నీరసంగా కూర్చుని ముత్యంరెడ్డి ఇచ్చిన మంచినీళ్ళు తాగి సేదదీరారు. వచ్చిన పని తొందరగా ముగించుకుని వెళ్తే అందరికీ సుఖమన్నట్లు సూటిగా అదే విషయం మాట్లాడాడు కృష్ణమూర్తి.

"ఏంకూరలు తింటారు? పప్పులు ఎన్ని వాడతారు? గుడ్లూ, పాలూ ఎన్ని వాడతారు? మాంసం ఎన్నిరోజులకోసారి వండుకుంటారు?"





ఈ వివరాలు కావాలని జయ అడిగింది.

''ఇయ్యాల్ల రేపు ఏం తింటన్నమో యాది కుంటాంది? తింటన్నది ఒంటబడతాంది. మా ఆడోళ్లనడుగుండ్రి. లోనకెళ్లుండ్రి'' అన్నాడు ముత్యంరెడ్డి జయను చూస్తూ.

జయ అదే మంచిదన్నట్లు సుధను కూడా తీసుకుని లోపలికి వెళ్లింది.

మగవాళ్లు పెద్ద బరువేదో దించుకున్నట్లు నిట్టుర్చారు. రామారావుగారు ఊరికే కూచోలేనట్టుగా.

''ఏం పంటవేశారు?'' అనడిగాడు ముత్యంరెడ్డిని.

''పొద్దుతిరుగుడు''

''అది మంచి లాభసాటి పంటేనంటారు గదా?''

ముత్యంరెడ్డి నీరసానికి కారణాన్ని ఊహించబోయారు.

''పంట మంచిదే- పండితే'' అతని నవ్వు నీరసంతో ఆరిపోయింది.

''ఈ ఏడు ఎలా పండింది? వర్షాలు కురిశాయా?''

''వానలు మంచిగనే వున్నయ్. మా రాతే మంచిగ లేకపాయె''

''ఏం ఏమయింది?'' భయపడుతూనే అడిగాడు జయరావు.

''ఏమయితది! గాచారం''

''అంటే''-

''అంటె ఏందయ్యా- మా గాచారం గట్లుంది''

''అదే ఏమయిందని''

ముత్యంరెడ్డి మూర్తీభవించిన విషాదంలా గున్నాడు. అతను అటూ ఇటూ చూసి తన ఒళ్ళో వున్న తుండుతీసి మెళ్ళో వేసుకున్నాడు.

''ఇదేందిది?'' అడిగాడు ముత్యంరెడ్డిని.

''తుండు''

''టవలు''

''కండువా''

''పైపంచె''

ఎవరికి అలావాటైన రీతిలో వాళ్ళు గబగబా చెప్పేశారు.

''అంతేగదా- నేను సుత అంతే అనుకున్న. మీదికెల్లి గవర్నమెంటోడు ఇది తుండు. మంచి మేలైన తుండు అని ముద్రేసిండనుకో. మనం గొంటం. గట్లనే కొన్న. తెచ్చి యిగ మెళ్ళో ఏసుకున్న అది లేసి ఆడవట్టింది''

అర్థం చేసుకోటానికి తంటాలు పడుతున్నారు. ప్రపంచ రాజకీయాలు, ఆర్థికశాస్త్రాలూ గదుల్లో పిల్లలకి అర్థం చేయించే పంతుళ్లు. వాళ్ళ ముఖాలు చూసిన ముత్యంరెడ్డి తాత్కాలికంగా తన విషాదం మర్చిపోయి వాళ్ళమీద జాలిపడ్డాడు.

''తుండు పామయింది సారూ!''

''ఆఁ!'' నోళ్లు తెరిచారు.

''అవ్! తుండని అమ్మిన్రు. తుండని గొనుక్కున్న. మెళ్ళో ఏసుకున్నంక తుండు పామయింది. పాము ఏం జేస్తది?''

''కరుస్తుంది'' అన్నాడు కృష్ణమూర్తి భయంభయంగా.

''అదేమల్ల! గవర్నమెంటోడు యియి మంచి విత్తనాలు కొనుక్కోర్రి అంటె నిజమేనని సొసైటీల బోయి కొనితెచ్చి చేన్ల ఏసినం. దానికి దునియ కష్టం జేసినం. మొక్కలు మంచిగా పెరగవట్టె. అందాక మంచిగనె. పువ్వు వచ్చే సమయానికి మా గాచారం బైటవడ్డది. చెట్టు నిండ పువ్వులాయె''

ఆగాడు ముత్యంరెడ్డి ఇంక చెప్పాల్సిందే ముందని. చెట్టునిండా పూలుంటే విచారం ఎందుకో అర్థంగాలా వాళ్ళకి ''అధికస్య అధికం ఫలం'' అని నమ్మినవాళ్ళాయె. వాళ్ళ పరిస్థితి చూసి కాస్త వ్యవసాయ పరిజ్ఞానమున్న యాదయ్య వివరించాడు.

''చెట్టుకొక్క పువ్వే రావాలి. చెట్టంత పూలయితే విత్తనాలు బలంగరావు. రేటూ రాదు''

''మరి అలాంటి విత్తనాలు ఎలా అమ్మారు?''

ఈలోపు బక్క రైతులు పదిమంది వచ్చి వాళ్ళ చుట్టూ చేరారు. అందరిదీ అదే సమస్య.

''మా గాచారం సారూ! రైతు సుఖపడొద్దు.



సేను మంచిగుంటే పురుగుబడతది. పురుగు మందుకే ఎక్కడి పైసలు చాలయ్ పురుగుసే న్ల వంట తగ్గుతది. చచ్చిసెడి వంటతెస్తే, కొనేటోడుండడు. కొనేటోడొస్తే ధరుండది. నువ్వె న్ని రోజులు పంట నీతాన బెట్టుకుంటవ్. అప్పులిచ్చినోడూకుంటడా. పంటన్న తీస్కబోత డు. పైసలన్న కట్టమంటడు. పురుగు మందు లకొస్తే అదృష్టం. ఇంటిల్లిపాతి చేసిన కస్టం వృదా. పెట్టిన పెట్టుబడి వృదా. ఈ దేశంల రైతుల గాచారమే అట్లుంది. ఎవడు మాత్రం ఏం చేస్తాడు సార్''

''వరి వేసుకుంటే యిన్ని సమస్యలుండవు గదా'' అన్నాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తికి వ్యవ సాయం గురించి కనీస పరిజ్ఞానం కూడా లేదు.

''నీల్లుంటె మంచిగ ఎయ్యొచ్చు. నీల్లెక్కడి కెల్లొస్తయ్''

''బావుల్తవ్వుకోండి''

''పైసలేడి కెల్లొస్తయ్ బావుల్దవ్వనీకి''

''గవర్నమెంటు దగ్గర అప్పు తీసుకోండి''

''అప్పు తేనీకి పెట్టుబడి ఏడికెల్లి తెద్దు''

''అ(!?!'' అందరూ ఒక్కసారి అర్థంగాన ట్లు అరిచారు. అప్పు తెచ్చుకోడానికి అదీ గవర్నమెంటు దగ్గర్నించి అప్పు తెచ్చుకోటాని కి పెట్టుబడి ఏమిటో అర్థంకాలేదు. ఆ సాంఘిక శాస్త్రవేత్తలకి.

సుధ, జయ లోపల్నించి వచ్చి కూర్చున్నా రు.

''పెట్టుబడి ఏమిటి? అప్లికేషన్ పెట్టు కుంటే అప్పిస్తారుగదా. మహాఅయితే వందో రెండోందలో ఎవరికన్నా లంచం ఇవ్వాలేమో అంతేగదా!''

''లే సార్! శాన రూల్సున్నయ్. ఆటికి శానపైసలు ఖర్చు జెయ్యాలి. పదేలు పెట్టుబ డి బెట్టి ఇరువైఏలు అప్పు దొర్కుతది. అదొచ్చే పాటి ఈ పదేలు మిత్తితో గల్సి ఇరువై అవు తది! ఇంగ బావెక్కడకెల్లి వస్తది?''

''మీదికెల్లి గవర్నెంటోనికి ఇరువైఏలు బాకీ పడ్తం. అది తీర్వనీకి సేనమ్ముకోబడ్తది''

''పదివేలు పెట్టుబడా! అప్పుకోసం ఏం చేస్తారు?''

రామారావుగారికి తనకు తెలియని విషయం ఒకటుందంటే తెలుసుకునేవరకూ వదలడు. లంచాల విషయం తెలుసుగానీ అప్పుకోసం పెట్టుబడేమిటి?

ముత్యంరెడ్డికి ఈ పంతుళ్ళతో తన గోడు చెప్పుకోవాలనిపించింది. పంట నాశనమైన ప్రతి సంవత్సరం ముత్యంరెడ్డి తన చేలో బావి తవ్వించుకోవాలనుకుంటాడు. ఐతే తీరా అప్పు కోసం వెళ్ళామనుకుంటే వూళ్లో ఏ అన్నో తమ్ము డో బావో వచ్చి తమ పాట్లు వర్ణించి చెప్పి లోను తీసుకోటానికి పెట్టుబడి ఎక్కడ తెస్తావురా అని అడుగుతారు. అడుసు తొక్కినవాళ్ళు ప్రత్యక్ష మై అడుసుతొక్కనేల కాలు కడగనేల అని చెబుతుంటే ముత్యంరెడ్డి అడుసుకి దూ రంగానే ఉన్నాడు. తను తప్పు చేశాననుకోటాని కి ఏ దాఖలాలూ లేవు. అప్పుతెచ్చి బావి తవ్వించిన వారందరూ మట్టిగొట్టుకుపోయా రు. సిద్ధారెడ్డి బావీ, రాంరెడ్డి బావీ బాగున్నా యంటే వాళ్ళు పెట్టి పుట్టినవాళ్లు!

''అదుగో మా బావ నడుగుండ్రి- బాయి సంగతి మంచిగజెప్తడు'' అన్నాడు ముత్యంరె డ్డి.

అందరూ ముత్యంరెడ్డి బావ వెంకటరెడ్డి వంక చూశారు. వెంకటరెడ్డి కాస్త మొహమాట పడి అందరూ 'చెప్పు చెప్పు' అని బలవంత పెడుతుంటే గొంతు సవరించుకున్నాడు.

''సారూ... గవర్నమెంటు లోను గావాల్నంటే అప్లికేషన్ బెట్టాలెగద! దాన్ని మనం ఏ చేన్ల బావిదీస్తున్నమో ఆ చేన్కు పట్టాదారున్ని నేనే అని సర్టిఫికెట్టు పెట్టాలే. పద్నాలుగేల్లనంది ఈ భూమి నాదేనని కాగితం దేవాలె. ఆ కాగితం మండలాఫీసులో ఎమ్మారావు యివ్వాలె''

''ఎవరెవరు?''

''ఎమ్మారావు - మండలాఫీసరు''

''ఎమ్.ఆర్.వో.లెండీ!'' యాదయ్యకు సాటి వాళ్ళ సోఫిస్టికేషన్‌మీద విసుగొచ్చింది. ఎమ్.ఆర్.వో. అని స్పష్టంగా పిలుస్తారా, పిలవ గలరా ఈ పల్లెటూరివాళ్ళు, వాళ్ళకు చేతనైన ట్టు వాళ్ళు పిలుస్తారు. వీళ్ళు మరీ చిన్నపిల్ల




లయిపోతున్నారు అని మనసులోనే విసుక్కున్నాడు.

కానీ మిగిలినవాళ్ళందరూ పెద్దగా నవ్వారు. ఎమ్.ఆర్.వో.ని ఎమ్మార్రావు అని ఒక నామవాచకంగా చేసిన పద్ధతికి వాళ్ళకు ముచ్చటేసింది. తమ హర్షాన్ని నవ్వుద్వారా ప్రకటించారు. ఆ నవ్వుకి రైతులు భయపడిపోయారు. తను ఏ పొరపాటు మాట మాట్లాడానా అని సిగ్గుపడ్డాడు వెంకటరెడ్డి. మళ్ళీ అతని సిగ్గు పోగొట్టి చెప్పించటానికి కొంత ప్రయత్నం అవసరమయింది.

"మనం ఎల్లి అడగంగనె అల్లివ్వరు. తిర్గుతానే వుండాలె. రేపురా మాపురా అంటుంటారు. ఒక్కరోజు ఆఫీసరు రాడు. మల్లోరోజు గుమస్త రాడు. ఇద్దరుంటే మనం బెట్టిన కాగితాలు దొర్కవు. ఎతకాలె. కాగితం దొరుకుతాది? ఎరిఫికేసను జెయ్యాలె. ఓరోజు కరెంటుండదు. గాలాడక బైట దిరుగుతరు. మల్లోరోజు పై తనిఖీవాల్లో, కలక్టేర్లు అదీ యిదీ గాకుంట మంతుర్లో ఎవరో వస్తరు. పది రోజుల్తరవాత కనపడంటరు. ఈ తిరుగుళ్ళకే రెండు మూడొందలు కతమైపోతయ్. అంతయినంక ఎయ్యి రూపాయలు గడ్తే అదొస్తది"

"లంచమా?"

"అది మాకు తెల్వది! ఎయ్యి కడ్తేనే మా చేతిలబడ్తదది! కడ్తం"

"లంచమే సార్. ఇచ్చినోడ్దగ్గర యిచ్చినంత తీస్కుంటరు. లక్షారెడ్డి దగ్గర పన్నెండొందలు గుంజిన్రు. ఎయ్యికి తగ్గకుండ గుంజుతున్రు పట్టాకాగితం యివ్వనీకి" కాస్త వ్యవహారం తెలిసిన రైతెవరో అన్నాడు.

"మరదేదో ముందే తీసుకుని యివ్వొచ్చు గదా?"

"లంచం తీసుకునేటొల్లల్లో రెండు రకాలున్నరు సార్. మనం ఎల్లంగనే 'ఏందయ్యా పెద్దమనిసీ! నీక్కాగితం యిస్త మల్ల నాకేమిస్తవూ' అని అడిగెటోడు దేవుడు. రెండోవాడే ఖతర్నాకు. ఆడి బొర్రలో పామున్నదని మనకు తెలుస్తది. దాన్ని ఆడు బైటికి తియ్యడు. బైటికి తీస్తెగదా మనకి తెలిసేది. ఏమో నేనిట్ల నీకింతస్తనని మనమే అంటే - ఆఁ... నువ్వెంత, నీ బతుకెంత? నువ్వు నాకు లంచమిస్తనంటవా అంటడనుకో- లంచం తీసుకోనోల్లు గూడా వుంటరుగదా! అల్లకి మనం లంచం యిస్తమంటే తెగ బారెడు కోపమొస్తదాయె"

అతను ముఖం పెట్టిన తీరుకి అందరూ పెద్దగా నవ్వారు. దేశంలో మంచివాళ్ళెవరన్నా వున్నారూ అంటే వాళ్ళు మనం వెళ్ళగానే 'ఇంత నాకిమ్మని' స్పష్టంగా తెగేసి అడిగి వెంటనే పనిచేసి పెట్టేవాడేననే విషయంలో అక్కడెవరికీ సందేహంలేదు. ఆ విషయం తేలాక వెంకటరెడ్డి మళ్ళీ చెపుతూ "పద్నాలు గేల్లనంది నాదే ఈ సేనని కాగితం దొర్కినయ్ యిగ యిప్పుడు కూడా ఈ సేను నాదేనని మరో కాగితం గావాలె సారూ. దాన్కి నాలుగొందలవుతది. ఈ భూమిని తనఖ పెట్టలేదని బేంకోల్ల చేత రాయించుకోవాలి. దానికి ఏడొంఁలవుతది. ఈటన్నిటికి పన్లు బందువెట్టుకుని ఓ మనిషి తిర్గుతనే వుండాలె. అప్పటికి ఆర్నెల్లు పూరాపడ్తది. ఇయ్యన్నీ బాంక్ ఆఫీసరు కియ్యాలె. ఆయన ప్లీడర్కి పంపుతాడు అన్నీ నాయంగ వున్నయ్యా లేవా సూడుమని! నాయంగా లేన్ది యిన్ని ఆఫీసుల్లో ఎట్ల యిస్తరు? మేమంటె గరీబోల్లం. మేం అన్నాయం జేస్తం. రైతంటే దొంగపని లంగపని అన్నీ చేసెటోడని అనుకోర్రి. మంచిదిగని మీ గవర్మెంటు ఆఫీసోల్లని సుత నమ్మకపోతె... యిగ తియ్ - ఆ ప్లీడర్కి ఫీజు కట్టుకోవాల. ఐదొందలు కడ్తమా! అయినా మనవని కాదు. ఏమంటే - నీ వక్కని పనేనా వున్నది? నిజమేగదా - ఆ ప్లీడరు గదితానకెల్తే దుడుకయితది. మన సంత గుబులయితది. అదేదో సీన్మల మాంత్రికుని గుహలోకెల్తే ఎట్లుంటదో అట్ల-"

"పాతాళభైరవి సినిమా చూసినట్లున్నాడు" రామారావుగారు గొణిగారు. మిగిలినవాళ్ళు ప్రొఫెసరుగారిసినిమా పరిజ్ఞానానికి ముసిముసి నవ్వులు నవ్వారు. వెంకటరెడ్డి యిదేం పట్టించుకోకుండా చెబుతున్నాడు.

"బల్లల్నిండా కట్టలు. బీరువాల్నిండా కట్టలు. కిటికీల్నిండా కట్టలు. కట్టలు కట్టలు బొందలగడ్డల బొక్కలెక్క. 'నీ కాయితాలింక జూల్లె. నాల్రోజులాగి కన్పించు' ఎప్పుడ బో యిదేమాట మీట నొక్కినట్టె యిన్పిస్తది"

వెంటనే ఈ మాటకు అభ్యంతరం చెప్పాడు మరో రైతు.

"పోంగానే చెప్తాడు?"

"లే... లే... మనం బోయి ఆ తలుపు దగ్గర్నే నమస్తే చేసుకుంట లిలవడాలే. ఆయన వంక కింద కూసుని రాసుడే రాసుడు. సదువుడే సదువుడు. శానసేపయినంక 'ఆఁ ఏందయ్యా' అంటడు. నువ్వెన్నిసార్లు పోయిన నీతాన పైసలు తీస్కుంటడుగని నీ పేరు గుర్తుండ దు. నిన్ను గుర్తుపట్టడు. నాలుగ్గంటలు అట్ల నిలవడ్తే అప్పుడు మాటజేస్తడు.

ఇగియ్యన్ని మన్తోని గావని బోకర్ని పెట్టు కుంటం. ఆనికి మూడేలియ్యాలె. ఆడు ఎట్లన న్న తిప్పలు పడ్తడు"

"ఆ మూడేలల్ల ఆనికి మిగిలేది అయి దొందలే. మిగిల్న పైసలు అందరికి పైసలి య్యనీకి. పైసలిచ్చి పని చేయించుకుంటడు"

బ్రోకరుమీద సానుభూతి చూపించాడు ఒక రైతు.

"బ్యాంకీలో మల్ల అయిదువేలు కట్టాలె"

"అదేంటి?" ఇంతటితో ఐపోయింది. పెట్టు బడి ఐదువేలేగదా అని రైతుల్ని దబాయిద్దా మనుకున్న కాంతారావు హతాశుడయ్యాడు.

"ఇచ్చినదాన్ల నాలుగోవంతు బ్యాంకిలో గట్టా న్నట. ఇంతచేసి సావుతప్పి కన్నులొట్టవోయిన ట్టు బైటపడతమాంటే ఆ బ్యాంకాయన వదేలే యిస్తనంటడు. పెద్దబ్యాంకికి పో యిరువై ఏలు కావాల్నంటే అంటరు. పెద్దబ్యాంకిల మస్తుమంది ఆఫీర్లాయె. చదువులేని మాయ సుంటోల్లని చూడంగనె ఆల్లకి తెలుగు మరువు కొచ్చె అంగ్రేజి యాదికొచ్చె. అట్ల మనకొచ్చెడిది వదేలాయె. అది ముందు మనం జేసిన అప్పుకి వడ్డీ కట్టనీకొస్తది. ఇగ అప్పట్నుంది యిరువై ఏలకి వడ్డి కట్టుకోవాలె"

మొత్తం నరకలోకానికి దారంతా వివరించి చెప్పినట్లు చెప్పాడు వెంకటరెడ్డి.

వారిలోంచి ఒకాయన "అరే... ఏం లొల్లిజేస్త ర్రా. సర్కార్ని ఆడిపోసుకుంటరు. నీకు మంచి చేసిన అది మంచి గాదంటరు. సర్కా రు నిన్ను పిల్చి యిరువై ఏలిస్తున్నది. నువ్వే మన్న బావవా! బామ్మర్దివా! ఖర్చంటే... ఖర్చుంటిదివా! మల్ల సర్కార్ నడవొద్దు! దానికి ఖర్చుండదా. సర్కార్కెంత ఖర్చు. ఎంత మంది నవకర్లు. ఇదో ఈ సార్లందరికి జీతాలు నువ్విస్తున్నవా? సర్కారేగద! మల్లేడికెల్లి తెచ్చి స్తది?"

"అవ్వవే" అని అందరూ ఉద్యోగస్తులకి జీతాలు యివ్వటానికి తాము డబ్బు చెల్లించా ల్సిందేనని ఒప్పుకున్నారు.

ఆ రైతుల అమాయకత్వాన్ని చూసి నగర వాసులు భయపడ్డారు. ఆ మాటలు నిజంగా అమాయకంగా అంటున్నవో లేక వ్యంగ్యంగా అంటున్నవో కూడా వాళ్ళకు అర్థంకాలేదు.

వాళ్ళు లంచంగా యిచ్చిన డబ్బు పద్ధతిప్ర కారం కట్టాల్సిన డబ్బు అనుకుంటున్నారు. అందుకే మరోమాట లేకుండా కట్టి అది పెట్టు బడి అనుకుంటున్నారు. చేనుకి పెట్టుబడి పెడితే నష్టం ఒచ్చినట్లుగానే గవర్నమెంటు రుణానికి కూడా పెట్టుబడి పెడితే నష్టం వస్తుందని నమ్ముతున్నారు. ఈ పేదరైతుల మూలుగుల్ని పీల్చి పిప్పిచేస్తున్న ఈ పద్ధతు లకు విరుగుడేముంది?

శిస్తులు కడుతున్నారు. ఇళ్ళపన్నులు కడు తున్నారు. అప్పులకు వడ్డీలు కడుతున్నారు. రక్తం ధారపోసి పంటలు పండించి పంటను కొనుక్కోగల మారాజులకూ వ్యాపారస్తులకూ తరలించి వస్తులుంటున్నారు.

అంతా యివ్వటమే, తీసుకునేదేమీ లేదు. వీళ్ళిచ్చినది తీసుకోటానికి ఎవరికీ సిగ్గులేదు. వ్యాపారస్తులు, మహరాజులు, కోటీశ్వరులు, ముఖ్యమంత్రులు, ప్రధానులూ, ప్రెసిడెంట్లూ, ప్రపంచనేతలూ, అగ్రరాజ్యాధిపతులూ అంద రూ సిగ్గూ ఎగ్గూ లేకుండా ఆ ఎముకల గూళ్ళనుండి, ఆ ఎండిన శరీరాలనుండి, ఆ ఆకలి పొట్టలనుండి అడుక్కుతింటారు. వాళ్ళ నుండి పైసా పైసా గుంజుకుంటారు. వాళ్ళ రక్తం బొట్టు బొట్టుగా దాహం తాగుతారు. ఇంకా ఇంకా ఇంకా ఎంతిచ్చినా వాళ్ళ దాహం తీరదు.

ఎముకల గూళ్ళు విరిగి ఎముకలు తునక లయ్యి ఎండిన శరీరాలు నిర్జీవాలై కుళ్ళి ఆ మాడే పొట్టలకిక ఆకలన్నది లేకుండా వాళ్ళు




చచ్చిపోతే పల్లెలన్నీ వల్లకాళ్ళయితే అప్పటికి తీరుతుందా అగ్రరాజ్యాల పిపాస. అప్పటికి శాంతిస్తుందా అంతర్జాతీయ ద్రవ్యనిధి. అప్పటికి ఉపశమిస్తుందా ప్రభుత్వాల కిరాతకత్వం! అప్పుడు తృప్తిపడతారా అధికార మదాంధులంతా!

లేదు! పల్లెలు వల్లకాడులైతే, ఢిల్లీలూ, న్యూయార్కులూ కూడా వల్లకాడులవుతాయి. అందుకే రైతుల్ని చావనియ్యరు. నిజంగానే రైతుల్ని చావనియ్యరు. బతకనియ్యరు. అప్పులిస్తామని ఆశపెడతారు. అభివృద్ధి పథకాలని జోలపాడతారు. ప్రపంచబ్యాంకు చందమామని చూపి బుజ్జగిస్తారు.

వాళ్ళు బతకాలి. వాళ్ళు బతికితేనే వాళ్ళలో రక్తం ప్రవహించేది. మాంసం పెరిగేది. ఎముకలు ఎదిగేది. రక్తమాంసాలు నిత్యం కావాలంటే వాళ్ళుచావకూడదు. ఈ మాంసాహారం విచిత్రమైనది. మిగిలిన మాంసాహారాలకంటే భిన్నమైనది. ప్రాణిని చంపి తినటంలో ఈ మాంసాహారులకు రుచి రాదు. తృప్తి కలగదు. ప్రాణమున్న జీవిలో రక్తమాంసాల్ని నుతారంగా పీల్చాలి తాము పెద్ద సీసాలలో స్ట్రాలతో కోకోకోలలను పీల్చినట్లుగా.

అంతలో సర్పంచ్ రామిరెడ్డి వచ్చాడు. వాళ్ళను తన యింటికి తీసికెళ్ళి ఫలహారాలు పెట్టించి పంపించాలని అతని ఉద్దేశం.

కానీ ఎవరికీ ఫలహారాలు తినేంత ఆకలిలేదు. పైగా ఆ ఉత్సాహమూ లేదు. పొద్దుటి నుంచీ వాళ్ళు చూసిన రెండు ఇళ్ళలోనూ వాళ్ళకు కనిపించిన దరిద్రం, దుఃఖం వాళ్ళను నీరసపరిచింది.

తమ జీవితాలమీద వాళ్ళకు అసంతృప్తులు లేవనికాదు. వాళ్ళంతా చాలా సుఖంగా బతుకుతామని అనుకుంటున్నవాళ్ళూ కాదు. తమకంటే ఎక్కువ డబ్బు సంపాదిస్తున్నవాళ్ళను చూసి అసూయపడటమే వాళ్ళకింతవరకూ తెలుసు. నగరాల్లో ముష్టివాళ్ళను చూసి ఎప్పుడన్నా జాలిపడటం తప్ప దరిద్రం గురించి యింత ప్రత్యక్షానుభవం వాళ్ళకు లేదు. కొంత తెలిసిన రామారావుగారు కూడా ప్రత్యక్షంగా చూసేసరికి విచలితుడయ్యాడు.

చావూబతుకూ కాని స్థితిలో వేలాడుతున్న ఆ రైతులను చూసి ఆయన విజ్ఞానమంతా ఆయనను పరిహసించినట్లనిపించింది.

ఆయనకు చాలా విషయాలపట్ల ఆసక్తి వుంది. ఎన్నో పుస్తకాలు చదువుతూంటాడు. ఆర్థికరంగంలో వచ్చే మార్పులను ఆసక్తిగా గమనిస్తుంటాడు. తన విద్యార్థులతో చర్చిస్తుంటాడు. ఎప్పుడన్నా పత్రికల్లో వ్యాసాలు రాస్తుంటాడు. ఆయన ఈమధ్య ఆసక్తి చూపిస్తున్న అంశం ప్రపంచబ్యాంకు.

బీద దేశాలలో, ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ, లాటిన్ అమెరికాలోనూ వున్న గ్రామాలలోని బీదరైతులకు యివ్వటానికి ప్రపంచ బ్యాంకు అప్పులిస్తోంది. ఏవో బ్యాంకులద్వారా ఎరువులకోసమనీ, విత్తనాలకోసమనీ, బావులు తవ్వించటంకోసమనీ రైతులకు అప్పులిస్తోంది.

ఇన్నాళ్ళూ కాగితాలమీద ఆ పథకాలను చూస్తుంటే ఆయనకు కొంతవరకే అర్థమయింది. ఈ బీదరైతులకు ప్రపంచబ్యాంకు ఎందుకు అప్పులిస్తోంది? దానికి బోలెడు యంత్రాంగం కావాలి, బోలెడు ఖర్చు ఔతుంది. అదంతా భరించి, వీళ్ళకు అప్పులిచ్చి వాటిని వసూలుచేసుకోగలదా? అందువల్ల ప్రపంచ బాంకుకి ఏమిటి లాభం? పెట్టుబడికి లాభం జతపడని పనులూ, పెట్టుబడి యిబ్బడిముబ్బడిగా పెరగని పనులూ ప్రపంచ బ్యాంకు ఎందుకు చేస్తోంది? ఈ విషయాల గురించి రాయాలని ఆయన సమాచారం పోగుచేస్తున్నాడు.

కానీ యివాళ ఈ పల్లెకు వచ్చి ఈ రైతులనూ, రైతు కుటుంబాలనూ చూస్తుంటే ఆయనకు తనదగ్గరున్న సమాచారానికి వేయి ఏనుగుల బలం వచ్చినట్లనిపించింది. గిరీశం విడోరీమారేజీ విషయమై నాబ్‌కోశ్చన్ విషయమై యిచ్చే ఉపన్యాసాలకూ, ప్రపంచబ్యాంకు వెనకబడ్డ దేశాలలో వ్యవసాయాభివృద్ధి పథకాల గురించి యిచ్చే ఉపన్యాసాలకూ అట్టే తేడా లేదని తను చెబుతున్న మాటలకు ప్రత్యక్ష ఉదాహరణలుగా నిలిచారీ రైతులు. ఎరువులూ, విత్తనాలూ, పురుగుమందులు, గేదెలు, ఎద్దులు, ఇంకా చిన్నచిన్న యంత్రాలూ కొనటా

నికి రైతులు రుణాలు తీసుకుంటారు. ఆ రుణాలతో కావాల్సినవి కొని తమ పొలంలో ఆ రైతుకుటుంబం మొత్తం పిల్లాజెల్లా ముసలీ ముతకా అందరూ రాత్రింబవళ్ళూ రెక్కలు ముక్కలు చేసుకుంటారు. వంట విరగ బండించటానికి తమ శరీరంలోని రక్తాన్నీ చెమటనూ ధారపోస్తారు. పండిన పంటంతా మార్కెట్టుకి తోలతారు. సరైన ధర సామాన్యంగా రాదు. ధరలు నిర్ణయించేది పండించిన రైతులుకాదు కాబట్టి అది సహజం. పంటంతా అయినకాడికి అమ్మి అప్పులు తీర్చి ఎలాగోలా మళ్ళీ అప్పులు చెయ్యటానికి కావాల్సిన శక్తిని సంపాదించుకుంటారు. అప్పులతో వాళ్ళు ఈ బ్యాంకులవాళ్ళూ, ప్రభుత్వాలూ ఏవి కొనమంటే అవే కొంటారు. విత్తనాలుగానీ, ఎరువులుగానీ, యంత్రాలుగానీ. సామాన్యంగా అవి వాళ్ళు అమ్మేవే అయివుంటాయి.

బ్యాంకులకూ, ప్రభుత్వాలకూ వీళ్ళకు అప్పు యిచ్చి వసూలుచేసుకునే పనితప్ప ఆ రైతులు ఏం తింటున్నారు, ఎలా బతుకుతున్నారు అని విచారించే బాధ్యత లేదు. నిజానికి పరిశ్రమల్లో పెట్టుబడి పెడితే ఆ పరిశ్రమల్లో కార్మికుల కనీస క్షేమాన్ని చూడాల్సిన బాధ్యత ఆ పెట్టుబడి పెట్టినవాడికి వుంటుంది. ఆ కార్మికుడి కుటుంబానికీ, వాడు మళ్ళీ తిరిగివచ్చి పనిచెయ్యటానికి శక్తి సంపాదించుకోటానికీ కావాల్సిన కనీసజీతం యివ్వాలి. ఇక్కడ ఈ బీదరైతులు చేసే శ్రమపట్ల ఎవరికీ ఆ బాధ్యతలేదు. ఆ రైతులు ఏంతింటారు, పిల్లలకు ఏం పెడతారనేది ఈ అప్పులిచ్చినవాళ్ళకు బొత్తిగా అనవసరం. రైతులనుంచి గుంజడమొక్కటే వీళ్ళపని. వీళ్ళు ఎక్కువగా గుంజటానికి రైతులు ఏ వంట పండిస్తే వీలుంటుందో ఆ పంటలనే రైతులచేత వేయిస్తారు. ఆ రైతుకుటుంబం చేసే శ్రమే వీళ్ళకు ఆధారం. అంటే ఈ సంపద పోగుపడటానికంతా కుటుంబమే ఆధారం. ఆ కుటుంబం పొలంలో చేసే శ్రమకంటే చౌకశ్రమ యింకెక్కడా లేదు. ఈ చౌకశ్రమను దోచుకోవటంలోనే ప్రపంచబ్యాంకికి ఆసక్తి.

వీళ్ళకిలా రుణాలిచ్చి శ్రమని కొనసాగించకపోతే పెట్టుబడికి చాలా ప్రమాదం ముంచుకొస్తుంది. అంటే ఈ బీదరైతులు నిజానికి బీదవాళ్ళు కాదు. ఎంతో సంపన్నులు. వీళ్ళదగ్గర సంపద లేకపోతే ప్రపంచబ్యాంకి వీళ్ళ ముఖం చూడదు. ఆ సంపదనంతా పోగుచేసుకుని వెళ్ళటంలోనే ఆసక్తి దానికి. ఆరోజు ముత్యంరెడ్డి ఇంటి వరండాలో గుంపుగా చేరిన బీదరైతులను చూస్తుంటే రామారావుగారికి ఎన్నోరోజులుగా పరిస్తున్న గీతారహస్యం తేటతెల్లమైనప్పుడు ఒక యోగికి కలిగే ఆనందంలాంటి తాత్విక ఆనందం కలిగింది.

ఆ బక్కరైతులు, మొద్దుబారిన చేతులతో, పైకి ఉబికిన నరాలతో, నల్లని దేహాలతోవున్న వాళ్ళు నిజానికి నిలువెల్లా బంగారపు ముద్దలు, సువర్ణమూర్తులు. తమ దేహాలను కొలుముల్లో కాల్చి కరిగించి నగరాలకు తరిలించి క్రమంగా తరిగిపోతున్న బంగారుగనులు. ఆ గనులు కృశించకుండా వుండటం ఎలా? జరుగుతున్న మోసాన్ని వాళ్ళు గ్రహించుకునేదెప్పటికి?



రాంరెడ్డి వాళ్ళను జీపులో రమ్మని తను తన మోటార్సైకిల్మీద ఇంటికెళ్ళాడు ముందుగా. అందరూ వచ్చి జీపెక్కారు.

సాయంత్రం మూడుగంటలవుతోంది. చలికాలం కావటంతో పొద్దు అప్పుడే పడమటకు తిరగబోతోంది. రాంరెడ్డి దగ్గర ఫలహారం చెయ్యక తప్పదు. అదేదో పూర్తిచేసుకుని యిక తిరుగుప్రయాణం ఔదామని అందరికీ ఉంది.

చూసిందిచాలు, చేసింది చాలు. గ్రామాల్లో ప్రజలు ఏం తింటున్నారో, ఎలా తింటున్నారో




తెలిసిపోయింది. ఇంక యింతకన్నా తెలియటానికి ఏముంది? తమకు తెలిసిన ఈ సమాచారంతో తమదగ్గరున్న పత్రాలను నింపటమే కాదు, గ్రంథాలు రాయొచ్చు. కానీ రాసి ఏం ప్రయోజనం? రాసినవి లేవూ? తామే రాసి తామే చదివి, తామే ఏదో అనుభూతి పొందటం. కోపమో, బాధో, కన్నీళ్ళో, సంతోషమో, జాలో, కసో... ఏదో ఒక అనుభూతి పొందటంకోసం వీళ్ళ జీవితాలు యిలా వుండాలా? వుంటాయా? మార్పు ఎప్పుడు?

ఇంత దరిద్రంలోనూ వాళ్లు ఎంత మానవత్వంతో వున్నారు. ఎంతో దయగా వున్నారు మనుమలపట్ల. అదెలా సాధ్యమయింది? తమను వంచించే మనుమల్ని కూడా నమ్మటానికీ, ప్రేమించటానికీ వాళ్ళకున్న శక్తి ఎట్లాంటిది? ఆ శక్తితో వాళ్ళు ఏంచెయ్యబోతున్నారు? జీపు సెంటర్లోకి ప్రవేశిస్తోంది.

గ్రామంలోని నాలుగు రోడ్లు కలిసే ఆ చోటు మామూలురోజుల్లో అయితే పదిమంది మనుమలతో కళకళలాడుతూనే వుంటుంది. కానీ యివాళ కళకళలాడటం కాదు కళవళపడుతున్నట్టు వుంది. చాలా హడావుడిగా ఆందోళనగా వుంది వాతావరణం.

''ఇవాళేమన్నా సంత వుందా?'' వింతగా జనాన్ని చూస్తూ అడిగింది సుధ.

''ఏమో... సంతో, తిరనాళో... జాతరో... ఏదో మొత్తానికి విశేషం వుంది'' అన్నది జయ జీపులోనుండి బయటకు చూస్తూ.

రోడ్డునిండా కిటకిటలాడ్తూ ఆడవాళ్ళు. గుంపులుగా అటూ యిటూ పరుగులు, కేకలు, హెచ్చరికలు. ఆ ఆడవాళ్ళను చూస్తూ నుంచున్న మగవాళ్ళు.

వాళ్ళల్లో సగంమందికి ''యింతమంది ఆడోల్లేంజెయ్యనీకి వురుకులాడుతుర్రో సమజయితలేదు''

ఉన్నట్టుండి ఆడవాళ్ళలో అలజడిరేగింది. జీపు అప్పటికి వాళ్ళదగ్గరకంటా వచ్చి నెమ్మదయింది.

ఆర్.టి.సి. బస్సొకటి వచ్చి ఆ జీపు ముందుగా ఆగింది. బస్సును చూడగానే మొదలైన అలజడి బస్సు ఆగగానే ఆ బస్సుమీదకు మళ్ళింది.

ఆడవాళ్ళంతా బస్సుమీదికి ఎగబడుతున్నారు. బస్సుని సహజంగానే రోడ్డుమధ్యన ఆపేసి డ్రైవరూ, కండక్టరూ ఒకర్నొకరు చూసుకుని, సైగ చేసుకుని బస్సుదిగారు.

ఆడవాళ్ళ మధ్యలోంచి తోసుకుంటూ ముందుకొచ్చిన పోలీసు కానిస్టేబిళ్ళిద్దరు బస్సెక్కి, అప్పటికే ఎక్కిన ముగ్గురు నలుగురు ఆడవాళ్ళని బెదిరించి బస్సు దించేసి మిగిలినవాళ్ళని ఎక్కనివ్వకుండా తలుపేసేశారు.

''ఏందట?''

''నడవదంటా''

''గట్ల? ఎందుకు నడవదు?''

''ఆ డ్రైవర్‌సాబ్‌ని అడుగుర్రి'' అందరూ గోలగా అరుస్తున్నారు. ఎవరిష్టం వచ్చినరీతిలో వాళ్ళు బస్సు నడవకపోవటానికి కారణాలు చెప్పుకుంటున్నారు.

''అరే... ఏం లొల్లిజేస్తుర్రమ్మ. ఈ బస్సేడికి పోదు. ఇండ్లకు పోర్రి'' అంటున్నాడొక కానిస్టేబిల్.

''గట్ల? ఎందుకు పోదు?''

''అరే... ఏందయ్యో... కండక్టరుకి చుట్టియిచ్చి పోలీసు బస్సెక్కి గూసున్నడో''

అందరూ నవ్వులు.

''పోలీసుకేం అందానొస్తదక్క. కండక్టర్‌కే మంచిగ చిల్లరిచ్చుడు బంద్‌వెడ్తే మస్తు ఆందాని''

''అవ్... మంచిగ చెప్పినవ్''

''అరే... జర వూకుంద్రాదు సత్తెవ్వ. ఎప్పటికి నవ్వులేనా?''

''కండక్టర్నడిగొచ్చిన ఆయన 'ఊ' అనడు 'ఆ' అనడు''

''ఏం చేస్తున్నడు''

''చాయ్ తాగుతున్నడు''

''చాయ్ తాగినంక అడగాలె''

''బస్సు ఖరాబైందో ఏమో''

''ఏం ఖరాబుగాలే. మనముంగట్నే సర్రునొచ్చి ఆగిందిలే''

''అవ్. బస్సు మంచిగుంది''



'మల్లేంరోగం?''

''ఎవనికి ఏం రోగమొచ్చిందట!''

ఆడవాళ్ళెంత అరిచీ గీపెట్టినా పోలీసులు మాత్రం ఎవరినీ బస్సు ఎక్కనివ్వటంలా.

అడ్డంగా వున్న బస్సునీ, మనుమల్ని తప్పించుకుని జీపు కదలడం కష్టమయింది.

హారన్ మోగిస్తే వినిపించుకునే స్థితిలో లేరెవరు. నిస్సహాయంగా జీపుని ఆపేసి దిగాడు డ్రైవరు. డ్రైవరుతోపాటు అందరూ దిగారు విషయమేమిటో తెలుసుకుందామని.

బస్సుదగ్గర గుంపు ఎవరిమాటనూ వినిపించుకోవటంలేదు. గొడవేమిటో వివరించి చెప్పేంత స్థిమితం వాళ్ళలో కనిపించడంలేదు.

జయ ఒకామెని గట్టిగా పట్టుకుని - ''ఏమైందమ్మా? ఏంటి గొడవ?'' అని అడిగింది.

ఆవిడ ఆ గోలలోంచి తల కాస్త యిటుకేసి తిప్పి జయనీ, పక్కనే వున్న సుధనీ వాళ్ళు ధరించిన బట్టల్ని ఎగాదిగా చూసి ఉత్సాహం తెచ్చుకుని ''మేమంతా ఎంకటాపురం పోవాలమ్మా. బస్సెక్కనిస్తలేరు''

''ఎందుకు?''

"ఏమో! ఏం మాయరోగమొచ్చిందో. ఇయ్యాల్రేపు ఎక్కడ ఎవనికేం రోగమొస్తదో తెలుస్తలేదు. ఎంకటాపురం పోవాలన్ననేవటికి అందర్కి గుబులవుతాంది"

"ఎందుకు? అక్కడేముంది? ఏమన్నా జాతరా?"

జయ గొంతు పగిలేలా అరిస్తేగాని ఆ గోలలో వినిపించటంలేదు.

"ఆ...మంచిగ జెప్పినవ్. జాతరే అనుకోమల్ల. సార బందుబెట్టాల్నని మేం అంత జాతర చేస్తున్నం" అని నవ్వి సుధ మొహంకేసి చూసి "అడ మీటింగుందమ్మ. మేం అంత గూడి ఆడికి బోతున్నం. ఈ పోలీసులకేమొచ్చిందో బస్సెక్కనిస్తలేరు"

పక్కనున్నామె అందుకుంది "మంత్రొస్తుండని లారీల్లో మందిని తోలుకబోయిర్రు ఈ పోలీసులే ఈ ఎంకటకిష్టాపురానికే. ఇయ్యాల్ల గరీబు ఆడోల్లంత గూడి మందిని ముంచె సారా బందుబెట్టుమని మీటింగు బెట్టుకుంటే మల్ల ఈ పోలీసులే మీటింగుకి పోవద్దనవట్టిరి. అంత ఈల్లిస్టమేనా! మంది ఏడకంటె ఆడికి పోయెడ్డి గూడ లేదా?" ఆమెకు న్యాయమైన కోపంతో ముఖం ఎర్రబడింది.

"మీరు చదువుకున్నోల్లు. జర మాట్టాడరాదమ్మ" అన్నదామె.

సుధ, జయ వెనకాలే మిగిలినవాళ్ళూ పోలీసులదగ్గరకు వెళ్ళారు.

వీళ్ళని చూసి పోలీసులు కాస్త ఊపిరి పీల్చుకున్నారు. వీళ్ళు ఏమిటి సంగతని అడిగారు.

"మాకేం తెలియదు సార్" అన్నారు వాళ్ళు.

"మీకేం తెలవకపోతే బస్సు ఎక్కనివ్వండి. తప్పుకోండి" అన్నది జయ విసురుగా.

"అదికాదు సార్! ఎస్సయ్‌గారు మీటింగుకి పర్మిషన్ యివ్వలేదు. అయినా వెంకటాపురంలో మీటింగు పెట్టుకుంటున్నారు. గొడవలు జరుగుతాయి. జనం పెరిగినకొద్దీ గొడవలూ పెరుగుతాయి. అందుకే పొరుగూళ్ళనుండి జనం రాకుండా చూడమన్నారు. మాకు ఈ ఊరు డ్యూటీ పడింది. మేం మా డ్యూటీ చేస్తున్నాం"

"ఆడవాళ్ళు ఏం గొడవలు చేస్తారయ్యా!" కాంతారావు నిరసనగా అన్నాడు.

"అదంతా యిదివరకు మాట సార్! మీకు తెలియదుసార్! వీళ్ళు ఆడోళ్ళుకాదు. రాక్షసులు. వెంకటాపురం ఆడోళ్ళయితే మరీ బరితెగించిన రకాలు. మొన్న వెయ్యి సారా పాకెట్లు తగలబెట్టేశారు ఒక్క చుక్కన్నా తాగకుండా. ఇవాళ మీటింగు జరిగిందా యింక వాళ్ళని పట్టుకోడం ఎవరివల్లా కాదు"

సారా ఒద్దంటూ ఆడవాళ్ళు ఉద్యమిస్తున్నారన్న వార్తలు పేపర్లలో చదువుతూనే వున్నారు ఈ లెక్చరర్లు. ఆడవాళ్ళు సారా దుకాణాల్ని మూసేస్తున్నారు. ముయ్యనివాటిని తగలబెడుతున్నారు. అమ్మేవారిని తరిమేస్తున్నారు. ఇవన్నీ ఎప్పటికప్పుడు పేపర్లలో చదువుతూనే వున్నారు.

ఇవాళ ప్రత్యక్షంగా ఆ ఆడవాళ్ళను చూసేసరికి అందరికీ ఆసక్తి పెరిగింది. జయకైతే ఉత్సాహం ఉరకలేసింది. చూస్తుండగానే గొడవ పెరిగి పెద్దదయింది.

"మీటింగు జరగదు. మీరెళ్ళొద్దు" అంటారు పోలీసులు.

"జరుగుతుంది, జరగదు. అది మీకనవసరం. బస్సు ఎక్కుతాం. వెంకటాపురం పోతాం. మధ్యన మీ యిష్టం ఏంటి? మీటింగు జరక్కపోతే ఆ వూళ్ళో మా అప్పచెల్లెళ్ళను చూడటానికి వెళ్ళామనుకుంటాం. మీరు ఒద్దంటే మానటంమాత్రం జరగదు"

అక్కడున్న ఆడవాళ్ళ అరుపులకూ, కేకలకూ సారాంశం అదీ!

బస్సు డ్రైవర్నీ కండక్టర్నీ లాక్కొచ్చారు. వాళ్ళు యింత గోలలో మేం ఏం చెయ్యగలం? మీరూ మీరూ తేల్చుకోండి అంటున్నారు.

"నువ్వు బస్సు నడుపు. మేం ఎక్కుతాం. గొడవ ఏంలేదు" అంటారు స్త్రీలు.

"పోలీసుల్తో నేను గొడవ పెట్టుకోలేను. కేసు పెడతారు. నా తాడు తెంచుతారు" అంటాడు డ్రైవరు.

"యహె... నడిచిపోదాం తియ్" అందొకా





విడ వూడిపోయిన జుట్టుని గట్టిగా ముడివేస్తూ. ఆవిడ కాళ్ళు వురకటానికి సిద్ధంగా వున్నాయి.

"పోయేసరికి రాత్రయితది. మీటింగయిపో తది" మరొకరన్నారు.

ఆడవాళ్ళ గుంపు పెరుగుతోంది. వంద మందిదాకా కూడారు. క్షణక్షణానికీ వాళ్ళల్లో మీటింగుకి వెళ్ళాలనే ఆతృత పెరిగిపోతోంది.

కొందరు మగవాళ్ళు ముందుకొచ్చి "ఇండ్లకు వదుర్రి. బస్సులేదు. ఇంకీడేంజేస్త రు" అని గదమాయించారు.

"నువ్వు నోర్మూసుకుని అవతలకు పా. మేం మీటింగు కెల్లనన్న బోతం. నీకేమన్న నత్త వుంటే ఆ బస్సాయనమీద వర్లు... పో" అంటూ ఎవరికివాళ్ళు వాళ్ళ మగవాళ్ళమీద వడ్డారు.

"ఏందే లావొర్లుతున్నరు?" అంటూ ఓ తిట్టు తిట్టాడు ఒకడు.

అంతే-

ఆ వూరి సెంటర్లో సరిగ్గా వీళ్ళందరిమధ్యా, ఈ గొడవమధ్యా ఓ నాయకురాలి విగ్రహం వుంది. ఆ విగ్రహాన్ని చూసిన ప్రతివాళ్ళూ ఆమె అట్లా నోరు తెరవకుండా వుంటే బాగుండేదని అనుకునేవారు. ఆమె కళ్ళు కూడా ఆశ్చర్యంగా చూస్తున్నట్లు వుంటాయి. కొందరు ఆ కళ్ళు కూడా అంత తెరుచుకుని వుండకుండా వుంటే విగ్రహం యింకా బాగుండేదని అనుకునేవారు. ఇప్పుడు ఈ ఆడవాళ్ళంతా మగవాళ్ళనీ, వాళ్ళు ఓట్లేసి గెలిపించిన నాయకుల్నీ ఆ నాయకులు ఎన్నుకునే మంత్రుల్నీ ఆ మంత్రులు చేసే చట్టాల్నీ వరిపాలననీ తిడుతున్న తిట్లు వింటున్న జనాలేగాక, ఆ విగ్రహం కూడా ఈ తిట్లు... సరిగ్గా చెప్పాలంటే ఈ బూతులు వినటానికే అక్కడ ఈ సందర్భం కోసమే ప్రతిష్టించబడిందా అన్నట్టు నోరు తెరిచి ఆశ్చర్యంగా చూస్తోంది.

ఇక జయ, సుధలైతే అవేమిటో కూడా తెలియనంత తీవ్రస్థాయిలోనూ, సంక్లిష్టంగానూ, అయిదారు కఠిన సమాసాలు పొదిగిన అనేక వాక్యాల్ని ఒక్క బూతులో యిమిడ్చి అంటున్న ఆడవాళ్ళవంక అలా నిశ్చేష్టులై చూస్తుండిపోయారు.

మగవాళ్ళు ఆ బూతుల ప్రవాహంలో సిగ్గుతో పడి కొట్టుకుపోయారు.

ఇళ్ళల్లో నాలుగ్గోడలమధ్య ఒక్కొక్క ఆడదానీ తిట్టడం, కొట్టడం తెలిసిన అంతమంది మగాళ్ళకీ అంతమంది ఆడవాళ్ళు కలిసి నడిరోడ్డులో నలుగురిముందు అలా తిడుతుంటే ఏం చెయ్యాలో పాలుబోక వురుక్కుంటూ ఏదో పెద్ద అత్యవసరమైన జరూరు వన్లున్నట్టు వెళ్ళిపోయారు.

గుంపులుగా పోగయిన మరికొందరు ఆ ఆడవాళ్ళ తిట్లు, అలా తిడుతున్నప్పుడు వాళ్ళు వూపుతున్న చేతులు, వారి మొహాల మీద ఆవేశం, ఆవేదన అన్నీ చూసి ఆనందిస్తున్నారు.

సుధకూ, జయకూ చెవులు చిల్లులు పడిపోతున్నాయి. కానీ ఆ తిట్లవెనక, ఆ బూతుల వెనక వాళ్ళ బాధ కూడా అర్థమవుతూనేవుంది.

ఆ ఆడవాళ్ళు తిట్లమధ్యలో వైనవైనాలుగా వర్ణించి చెప్తున్న కథలు వింటుంటే-

మగాడు సంపాదించిందంతా తాగేస్తున్నాడు. ఒట్టి చేతుల్తో యింటికొచ్చి నోటికి రుచిగా కోడిగుడ్డు అన్నా ఒండిపెట్టమంటున్నాడు. ఎక్కడ తెచ్చి ఒండేదంటే యిక యిద్దరికీ తన్నులాటే.

ఆ తన్నులాటలనూ, అందులో తమకు తగిలే దెబ్బలనూ తాము అనుభవించే హింసనూ తలుచుకుంటున్న కొద్దీ ఆడవాళ్ళకు కసి ఆగటంలేదు. నోటివెంట తిట్ల ప్రవాహమూ ఆగటంలేదు.

ఆ ఆడవాళ్ళంతా బక్కచిక్కి వున్నారు. ఉన్నదంతా పిల్లలకూ, మొగుళ్ళకూ పెట్టి వస్తులు పడివుంటున్నారు. సారా మాన్పిస్తే యింటికి పది రూపాయలొస్తాయనీ, ఇంటిల్లిపాదీ యింత జొన్నరొట్టెయినా తినొచ్చుననే ఆలోచనతోనే వాళ్ళు ఈ సారా మనకొద్దు అంటున్నారు.

అందుకే ఒకరికొకరు "మీకు తోడు మేమున్నాం. మాకు తోడు మీరున్నారు" అనుకుంటూ మీటింగులకి వెళ్తున్నారు.

వెంకటాపురంలో సారా దుకాణం మూయించారు. దొంగచాటుగా కూడా అమ్మకుండా

రాత్రీపగలూ వంతులువేసుకుని కాపలా కాస్తు న్నారు. ఇవాళ చుట్టుపక్కల వూళ్ళవాళ్ళని పిల్చి మీటింగు పెడుతున్నారు.

"మీటింగువుంది రమ్మ"ని చెప్పటానికి వెంకటాపురంనుంచి వచ్చిన చుక్కమ్మ వాళ్ళ తో చెప్పింది.

"ఈ మీటింగు మీ మంచికేగాదు. మీ టింగుకు మీరొస్తే మాగ్గూడ మంచే"

"ఏమిటి మీ మంచి" అన్నారు ఈ ఊరి ఆడవాళ్ళు.

"మావాళ్లు మా వూర్ల తాగనీకి దొర్కుతలే దని పక్కవూర్లకి బోయి మస్తు తాగొస్తుర్రు. ఈ శని ఒక్క వూర్లబోతే ఏంలాభంలేదు. అన్ని వూర్లకెల్లి మొత్తం దేశంలకెల్లి నూకాలె. గందు గురించి అన్ని వూర్లోల్లు గలవాలె. కలిసి కొట్లాడాలె" అని చెప్పింది చుక్కమ్మ.

తమ మంచి గురించి, తమ పిల్లల మంచి గురించి, తమ కుటుంబం మంచి గురించి, అన్నింటికన్న ముఖ్యంగ తమ మగవాళ్ళ మంచి గురించి కొట్లాడుతున్నామని ఆడవాళ్ళ ంతా మనస్ఫూర్తిగా నమ్మారు.

కాబట్టే బజార్లో అలా నిలబడగలిగారు.

కాబట్టే తప్పుచేసే పిల్లల్ని తల్లి తిట్టినట్లు మొగుణ్ణి పెళ్ళాం తిడుతోంది. చిన్నపిల్లలకైతే చిన్నతిట్లు. పెద్ద మగాడికి పెద్ద పెద్ద తిట్లు. ఎంత వయసుకంత తిట్టు!

చుక్కమ్మ వెంకటాపురంలో సారాబంద్ చే యించిన సంగతంతా నవ్వుకుంటూ చెప్తోంటే హరిజనవాడలో మహిళలందరికీ కళ్ళంట నీళ్ళొచ్చినయ్. నిజంగా తమ భర్త తాగకుండా ఓ సాయంత్రం తనారోజు సంపాదించిన పది రూపాయలూ యింటికి తెస్తాడా? తెస్తే ఆ పది రూపాయలూ పెట్టి యింట్లో పిల్లలకోసం తను ఏదన్నా వండిపెట్టుందా? వింటున్న వాళ్ళంద రికీ ఎక్కడలేని ఉత్సాహం ఎన్నడూ ఎరుగని ఉద్రేకం వచ్చేశాయి.

మీటింగుకి వెళ్ళి తీరాలనుకున్నారు. బస్సుందిగదా అనిగానీ ఆ బస్సు లేకుంటే కాస్త చద్దిగట్టుకుని కాళ్ళకి పని చెప్పకపో యారా?

అరగంట గడిచింది. డ్రైవరూ, కండక్టరూ బస్సెక్కారు.

"మేం వెళ్ళాలయ్యా బాబూ! ఇంతకన్న ఎక్కువసేపు యిక్కడ ఆపుక్కూర్చోలేం" అన్నా డు డ్రైవరు.

పాసింజెర్లు లేకుండా వెళ్ళిపొమ్మని అను మతి ఇచ్చారు పోలీసులు.

"మేం ఎక్కకుండా బస్సెట్ల పోతదో అది భీ జూస్తం" బస్సు కడ్డంగా కూర్చున్నారు ఆడవా ళ్లు.

పోలీసులు యిద్దరు. చేతిలో లాఠీలు. వీళ్లి ద్దర్నీ ఆ గుంపులోని ఏ ఇద్దరు స్త్రీలయినా కింద పడేసి కూర్చోగలరు. అంత పెద్ద సమూ హాన్ని చూసి లాఠీ చేతులు ఒణకసాగాయి.

ఐతే బుర్రలు మాత్రం వంకర ఆలోచనలు వేగంగా చేశాయి. పోలీసులేం చేస్తున్నారో తెలి సేలోపు వాళ్లు బస్సు వెనక టైర్లలో గాలి తీసేశారు.

"ఎట్ల వెళ్తావో వెళ్లు" అని పోలీసులు డ్రైవర్ని చూసి నవ్వారు. డ్రైవరూ కండక్టరూ మళ్లీ బస్ దిగి టీ దుకాణంలోకి వెళ్లారు. ఆడవాళ్ల ఉత్సాహమంతా నీరుకారిపోయింది.

అదేమన్నా గానీ, ఎక్కించుకున్నా ఎక్కించు కోక పోయినా అంతకుముందు ఏనుగులా కళ్లముందు ఓ బస్సుంది. ఇప్పుడు కాళ్లిరిగి పడుంది.

అందరూ ముఖముఖాలు చూసుకుంటు న్నారు.

"వెంకటాపురం ఎంతదూరం వుంటుంది?" అంది జయ.

"పన్నెండు కిలోమీటర్లు" కరెక్టుగా చెప్పా డు కానిస్టేబులు. వీళ్లు అంతదూరం నడవలే రు, నడిచినా వీళ్లు వెళ్లేసరికి ఆ మీటింగు కాస్తా అయిపోతుంది అని చెపుతున్న కానిస్టేబిల్ కంఠం ఉత్సాహంతో నిండిపోయింది. ఆ ఉత్సా హాన్ని బొత్తిగా పట్టించుకోకుండా తమ మిత్రుల వంక తిరిగింది జయ.

"మన జీపు నాలుగు ట్రిప్పులేస్తే అరవై మంది దాకా వెళ్తారు. చివరకు మనం వెళ్దాం"

ఆ ఆడవాళ్లనందరినీ అరచేతిలో ఎక్కించు కుని తీసుకెళ్లి వెంకటాపురంలో దించుదామ న్నంత ఆవేశంతో వుంది జయ. జయ మాట

 

లు వింటూనే అందరూ ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. ఒక్కొకరూ ఒక్కో రకంగా రియాక్టయ్యారు.

"మన పనేదో మనం చూసుకెళ్లాలిగానీ ఈ గొడవంతా మనకెందుకు. ఎటుబోయి ఎటు వస్తుందో" త్వరత్వరగా అన్నాడు కృష్ణమూర్తి.

"బాగా చెప్పావు. మనకు బొత్తిగా అనవసరం" అన్నాడు కాంతారావు.

"బ్రహ్మాండమైన మాట చెప్పారు జయగారు. మన జీపు నాలుగ్గాకపోతే అయిదు ట్రిప్పులేసయినా సరే వీళ్లని అక్కడికి చేర్చాల్సిందే" అన్నాడు జయరావు.

"అవ్ ట్రిప్పులెయ్యాల్సిందే" అన్నాడు యాదయ్య.

"సారా వుద్యమానికి మనం సైతం సమిధనొక్కటి ఆహుతిచ్చాము" హుషారుగా పాడేశాడు జయరావు.

రామారావుగారు ఎప్పుడో నిర్ణయించుకునే వున్నట్టున్నారు. ట్రిప్పుకి పదిహేనుమంది వరకూ తేలిగ్గా వెళ్లొచ్చు.

ఒక అరవైమంది ముఖ్యంగా వెళ్తామనుకున్నవాళ్లు వెళ్లండి. అంతకుమించి మేమూ తీసుకెళ్లలేం" అన్నారు.

ఆ మాట వినగానే ఆడవాళ్లలో ఎక్కడలేని ఆనందం పెల్లుబికింది.

"పెట్రోలు... గవర్నమెంటు" అని అతికీ అతకని రెండు ముక్కలు గొణిగాడు కృష్ణమూర్తి.

"ఈ ట్రిప్పులకయ్యే పెట్రోలు ఖర్చు మనం పెట్టుకుందాంలే" అన్నారు రామారావుగారు.

"ముందు మీ డబ్బులివ్వండి" అన్నాడు జయరావు కృష్ణమూర్తిని.

అందరూ నవ్వారు. కృష్ణమూర్తికి నవ్వురాలా ప్రయత్నించినా.

"పట్నం కెల్లొచ్చిన్రు వంతుల్లు" అంది వజ్రమ్మ ప్రొద్దున వీళ్లను తిడుతూ వెళ్లాననే సంగతి మర్చిపోయింది. పైగా వాళ్లతో తనకే ముందు పరిచయం వుందని గర్విస్తూ.

"ఔ! మా ఇండ్లకే వచ్చిన్రు" అంటూ యాదమ్మ కూడా వజ్రమ్మతోపాటు మొదటి ట్రిప్పులోనే జీపు ఎక్కేసింది. ఈ కొత్త బెడదేమిట్రా భగవంతుడా అనుకుంటూ పోలీసులిద్దరూ యిటు పరిగెత్తుకొచ్చారు. "మీటింగు లేదు సార్... పర్మిషన్ యివ్వలేదు" అన్నారు రామారావుగారు గంభీరంగా మొహం పెట్టి సులోచనాల్లోంచి నిశితంగా చూస్తూ. "మీటింగా? నేనే మీటింగూ పెట్టటం లేదే, నాకెందుకూ పర్మిషన్" అన్నారు.

సుధకీ, జయకీ, యాదయ్యకీ నవ్వు ఆపుకోవడం కష్టమైంది. రామారావుగారి మొహం చూసి అతి కష్టం మీద నిగ్రహించుకున్నారు.

మిగిలినవాళ్లు చిరునవ్వుల్తో గమనిస్తున్నారు. రామారావుగారన్నదేమిటో పోలీసులకు ఓ పట్టాన అర్థం కాలేదు. అర్థమయీ అవనట్టు వుండి లాభం లేదని తమ ధోరణిలో

"ఈడ గాదు సార్"

"మీ మీటింగు కాదుసార్"

"పర్మిషన్ లేదు సార్"

"గొడవలు అవుతాయి సార్" అని సుందోపసుందుల్లా చెరోపక్కా తగులుకున్నారు.

"ఏంటయ్యా మీ బాధ. సరిగ్గా చెప్పండి" అనునయంగా అన్నారు రామారావుగారు.

ఆయనకి పోలీసులంటే కూడా సానుభూతి వున్నట్టుంది.

"వెంకటాపురంలో మీటింగు వుండదుసార్. మీటింగుకి పర్మిషన్ లేదుసార్" అర్థమయ్యేట్టు చెప్పామని నిశ్చింతగా వుండిపోయారు.

"సరే... వెంకటాపురంలో మీటింగు వుండదు. మీటింగు వుండని ఒక వూరికి వూరికే ఒక జీపు వెళ్తే మీకెందుకింత భయం?"

"మాకెందుకు సార్ భయం. మా ఎస్సై బస్సుని ఆపమన్నాడు. ఆపాం. ఆయన మమ్మల్ని ఏమీ అనలేదు. కానీ మీ జీపు తిరిగి రావటం మాత్రం కష్టం! ముందుగానే చెబుతున్నాం"

రామారావుగారికి ఈ ససతో బాగా కోపం వచ్చింది. ఆయన మొహంలో చిరాకుని చాలా సార్లే చూడొచ్చుగానీ కోపాన్ని చూసిన వాళ్లు తక్కువ.

రామారావుగారి మొహాన్ని చూడకుండానే "ఎస్సైసార్ మిమ్మల్ని అరెస్టు చేసినా చెయ్యొచ్చుసార్" అన్నాడు రెండో పోలీసు.

హఠాత్తుగా రామారావుగారి మొహంలో కోపం మాయమైంది. ఏదో ఒక చిలిపి వూహ కళ్లలో తళుక్కున మెరిసింది.

"అరే... పెద్ద చిక్కొచ్చిపడిందే" అన్నారు ఆలోచనగా.

"ఔనుసార్ లేనిపోని చిక్కుల్లో పడతారు" అన్నాడు కానిస్టేబిలు.

"నాకు కాదయ్యా! మీ ఎస్సైకి" అన్నారు రామారావుగారు సీరియస్ ఆలోచనని నటిస్తూ.

పోలీసులిద్దరూ తెల్లమొహాలు వేశారు.

"నేనెవర్నో తెలుసా?" అన్నారు వాళ్లిద్దరినీ చూస్తూ. తనను గురించి తాను ఎన్నడూ చెప్పుకోని మనిషి తనేమిటో తనకైనా తెలుసా అన్నట్టుండే మనిషి.

"యూనివర్సిటీ ప్రొఫెసర్ని. మీ కది లెక్కుండదేమో. హైదరాబాదులో వుండి ఇక్కడ మీ అందరి చేతా లెఫ్ట్ రైట్‌లు చేయిస్తాడే ఆ డి.జీ.పీకి నేను బావగార్ని. మీ ఎస్సైకి తెలియక ఈ జీపుని ఆపుతాడేమో ఆయన ఉద్యోగమూ మీ ఉద్యోగాలూ వూడతాయే ఎట్లా, ఏం చేస్తారు?" ఆ పోలీసుల్ని రక్షించటం ఎలాగా అని మధనపడిపోతున్న మొహం పెట్టారు.

సుధ, జయ ముక్కూ, మూతీ నలుపుకుంటూ పైట చెంగుల్తో ముఖాలు తుడుచుకుంటున్నట్టు అభినయిస్తూ నవ్వుని దాచుకుంటున్నారు.

పోలీసులిద్దరూ డి.జీ.పిని చూసినదానికన్నా కంగారూ భయమూ పడ్డారు. వాళ్ల శరీరం మొత్తం విద్యుత్తులా ఆ కంగారు పాకింది. టెన్షన్ పడిపోయారు. అటెన్షన్‌లోకి వచ్చేశారు. శాల్యూట్ చేసి అలాగే నిలబడి పోయారు.

ఆ వూరి దళిత స్త్రీలంతా ఈ మొత్తం నాటకాన్ని నోళ్లు తెరుచుకుని చూస్తున్నారు. ఒక్కళ్లు కూడా మాట్లాడటంలా

"ఒక పని చెయ్యండి. మీ ఇద్దరూ కూడా జీపులో ఎక్కి వీళ్లతో పాటే మీ ఎస్సైకి నా సంగతంతా చెప్పి ఈ ఆడవాళ్లగ్గానీ మన జీపుగ్గానీ ఏ ప్రమాదం జరిగినా వూరుకోనని చెప్పి మళ్లీ జీపుని తీసుకురండి. ఇదిగో విజిటింగు కార్డు"

వణుకుతున్న చేత్తో ఆ కార్డునందుకుని భక్తిగా జేబులో పెట్టుకుని మరోమారు శాల్యూట్ చేశారు. కానీ జీపులో ఆడవాళ్లతోపాటు తమనీ వెళ్లమంటున్న రామారావుగారి మాటలు వాళ్లకు మింగుడుపడలా. తామిద్దరూ ఈ ఆడవాళ్లను తీసుకుని జీపులో వెళ్లాలా, వీళ్లమధ్య జీపులో కూచుంటే బతకనిస్తారూ? మాటలతో, తిట్లతో, నవ్వులతో కుళ్లబొడవరూ? లాఠీలు చూపించే వీళ్లనదుపు చెయ్యలేకపోతే యిక జీపులో తలదించుకు కూర్చుంటే వాళ్లూరుకుంటారా? నెత్తురు చుక్కలేకుండా వాళ్ల ముఖాలు పాలిపోయాయి. జయ యింక నవ్వాపుకోలేకపోయింది. నవ్వుతూ సుధ వంక చూస్తే సుధ కూడా నవ్వుతోంది. జయ ఒక నిముషం ఈ గొడవంతా మర్చిపోయి సుధ నవ్వును అదేపనిగా చూసింది. ఎప్పుడో చిన్నప్పుడు చూసిన నవ్వు. తను ఇక్కడికి వచ్చిన యింత కాలంలోనూ ఎన్నడూ కనపడని నవ్వు.

ఆ నవ్వు చూస్తే జయకు పట్టరాని సంతోషం కలిగింది. సుధ చెయ్యి పట్టుకుని గట్టిగా నొక్కింది.

నోటమాట లేక నిలబడిపోయిన కానిస్టేబిళ్లను ఏదో ఒకటి తేల్చుకోమని గదమాయిస్తున్నారు జయరావు, యాదయ్యలు.

ఈ సంఘటనతో కృష్ణమూర్తి, కాంతారావులు కూడా హుషారు తెచ్చుకున్నారు.

"మేం వెళ్లం సార్" అన్నారు దీనాతిదీనంగా.

"మరెట్లా... మీ ఎస్సై తెలిసీ తెలియక మీరు చేసినట్లే టైర్లలో గాలితీస్తే" జయరావు భయపెట్టాడు.

"మాకేం ఫరవాలేదు. మేం రేపయినా వెళ్తాం. కానీ మీ ఎస్సై ఏమవుతాడో ఆలోచించండి" యాదయ్య వంతపాడాడు.

"మేం ఉత్తరం రాసి యిస్తాం సార్"

"ఐనా ఎస్సై ఆరు గంటలదాకా రాడు సార్. మీటింగు ఆరుగంటల తర్వాత సార్"

"మేం వెళ్తే ఆయన కోపమంతా మా మీద చూపిస్తాడు సార్. మమ్మల్ని సస్పెండు చేయి





స్తాడు సార్''

కాళ్లు పట్టుకోవటం ఒక్కటే తరువాయిగా బతిమాలుకోసాగారు.

రామారావుగారు ''సరే! యింక వీళ్లతో పెట్టుకుంటే టైము దండగ. మీరు జీపెక్కండమ్మా'' అన్నారు.

ఆడవాళ్లు వురుక్కుంటూ వెళ్లి జీపెక్కారు.

రామారావుగారు ఎస్సై వుంటే ఏం మాట్లాడాలో డ్రైవర్‌తో చెబుతుంటే జయరావు...

''నేను వెళ్తాను సార్ వీళ్లతో. ఎస్సై సంగతి నాకు వదిలేయండి'' అన్నాడు.

ఇంకేం. సమస్య తీరిపోయింది.

జీపు పదిహేనుమంది ఆడవాళ్లనీ వాళ్ల ఉత్సాహాన్నీ తీసుకుని ముందు కెళ్తోంటే అక్కడే మిగిలివున్న ఆడవాళ్లూ పిల్లలూ సంతోషంతో కేకలూ... నవ్వులూ... పోలీసుల్ని గేలిచేసేవాళ్లు... పట్నం పంతుళ్లని మెచ్చుకునేవాళ్లూ... వెళ్తున్న వాళ్లకు జాగ్రత్తలు చెప్తున్న వాళ్లూ జీపు డ్రైవరుతో 'జర జల్దీ తీస్కబోయి ఈడున్నట్లు మర్లి రావాలి. మమ్మల్నెప్పుడు కొంచబోతవో అంటూ బతిమాలేవాళ్లు...

ఒకళ్ల మాటలు ఒకరికీ, ఎవరి మాటలు ఎవరికీ అర్థం కానంత హడావుడీ, గోల, కేరింతలతో అక్కడి వాతావరణం తయారైనా ఉత్సవాల్లో, జాతరల్లో వున్నటువంటి ఏ పక్క మాటో పాటోగాక మొత్తం కలిపి అర్థమవ్వాల్సింది అర్థంమౌతూనేఉంది. అది అందరూ కలిసి సామూహికంగా పాల్గొంటున్న ఒక ఉత్సాహ భరితమైన సంఘటన. దాని ఆనందంతో మరి దేనినీ పోల్చలేం.

అంత కోలాహలంలో నుంచి వెళ్లడానికి మనస్కరించకపోయినా ''మనం ఈలోపు ఒకసారి రాంరెడ్డి గారింటికి వెళ్లొస్తే బాగుంటుందేమో'' అన్నాడు కాంతారావు.

''ఊళ్లో యింత గోలగా వుంటే సర్పంచయి వుండీ అసలు జోక్యం చేసుకోలేదేం'' అంది జయ.

అందరి దృష్టీ రాంరెడ్డి మీదికి మళ్లింది. రాంరెడ్డి ఇంటికి దోవ మళ్లీ ఓసారి కనుక్కుని అటు నడుస్తున్నారు. అందరి అడుగులూ ఉత్సాహంగా పడుతున్నాయి. తాము చేసిన ఈ పనివల్ల పొద్దుటి నుంచీ వాళ్ల మనసుల్లో తిష్ట వేసుకున్న నిరాశ, దిగులు, నీరసం, భయం, అక్కడినుంచి పారిపోవాలనే పిరికితనం, అన్నీ ఒదిలి తామేదో సాధించామనే విజయగర్వం అందరినీ ఆవహించింది. ఆశ్చర్యం ఏమిటంటే సుధ కూడా అందరితోపాటు ఉత్సాహంగా నడుస్తోంది. పెదవుల మీద విజయహాసంతో నడుస్తోంది. పొద్దున ఆ చిన్న పిల్లవాడు పూలు యివ్వటంతో కొట్టిన షాక్ ఆమెకు ట్రీట్‌మెంటులాగే పనిచేసిందా అన్నట్లు ఆరోగ్యవంతమైన నవ్వుతో నడుస్తోంది.

మామూలుగా అయితే గత యిరవై నిమిషాలుగా నడిచిన కథ ఆమెకు చాలా చిరాకును తెప్పించేది. ఆ ఆడవాళ్లను జీపులో ఎక్కించి పంపటం, వాళ్ల కోసం తను గంటో, రెండు గంటలో ఆలస్యంగా యిల్లు చేరటం, యిదంతా సుధ సహించేది కాదు. చుట్టూవున్న వాళ్లు తన మాట వినరని తెలిసినా తన అయిష్టాన్ని ప్రకటించకుండా వుండేది కాదు. విసుక్కుంటూ గొణుక్కుంటూ, ముఖం మాడ్చుకుని సాధ్యమైనన్ని విధాలుగా తన అశాంతిని అందరి మీదకూ విసిరేది.

''మనకెందుకు? మన పని మనం చూసుకుని పోవాలి. ఏదన్నా జరిగితే మన నెత్తికే చుట్టుకుంటుంది. కన్ను పోయేటంత కాటుకెందుకు. మనం మంచి వాళ్లమని చాటుకుంటే ఏం ఒరుగుతుంది? నాకంత దయాగుణం లేదు బాబు'' ఈ రకంగా ఆమె మళ్లీ ఇల్లు చేరేవరకూ మాట్లాడుతూనే ఉండేది. చుట్టూవున్న వ్యక్తులు కాస్త బలహీన మనస్కులైతే సుధ మాటలకు బుర్ర తిరిగి ''పదండి పోదాం... మనకెందుకొచ్చిన తంటా యిదంతా'' అనేంత స్థితి తెప్పించగలదు.

ఇవాళ సుధ అలా లేదు. ఆమె జరుగుతున్న దానిని తన లాభ నష్టాలతో బేరీజు వేసుకోకుండా చూడటం నేర్చుకుంటోంది. అలా నేర్చుకుంటున్నానని ఆమెకు కూడా తెలియదు. ఆడవాళ్లు మాట్లాడుతున్న మాటలనూ, వాళ్ల సమస్యలనూ వినేటప్పుడు ఆమె తన నుంచి తను కొంచెం దూరం జరిగింది. వెంటనే వాళ్లమీద తన విమర్శనో, వ్యాఖ్యానా



# తెల్లటి మచ్చలు



నిరంతరశ్రమ ఆవిష్కరణ తరువాత తెల్లమచ్చలకు మందు కనుగొనబడినది. వైద్యము ప్రారంభించిన కొద్ది దినములకే మచ్చయొక్క రంగుమారి నెమ్మదిగా శరీరవురంగులో కలిసిపోవును. "మొదట పరీక్షించి చూడండి" స్కీముకింద 7 రోజుల మందు ఉచితముగా ఇవ్వబడును. మీరు రకరకాల మందులు వాడి నిరాశ చెందినచో ఒక్కసారి మా మందు వాడిచూడండి. రోగి వయస్సు మరియు మచ్చయొక్క పూర్తి వివరములు వ్రాయండి.

# తల వెంట్రుకలు రాలుట, నెరయుటకు చికిత్స

జుట్టును డై చెయ్యనవసరంలేదు. మా ఆయుర్వేద చికిత్స (ఆయిల్)వల్ల తెల్లవెంట్రుకలు మామూలు నలుపు రంగులోనికి మారి స్థిరంగా నిలుస్తాయి. జుట్టు రాలిపోకుండా కాపాడి జుట్టు రాలిన ప్రదేశాన కొత్త జుట్టు వస్తుంది. ఇది మెదడును చల్లబరుస్తుంది. ఒక కోర్సులో 3 ఫైల్స్ ధర రూ. **80/-** పోస్టేజి మరియు ప్యాకింగ్ అదనం.

**Shyam Ayurved Bhavan ( C-93)**
**P.O. Katri Sarai (Gaya)**

---



## తెల్లమచ్చలు

30 గంటలలోనే తెల్లమచ్చలు మార్పుచెందడం ప్రారంభం మరియు సహజమైన శరీరపు రంగులోనికి మారుతుంది. 7 రోజులకు మందు ఉచితం.

**Vaidya M.K. Mathur (MKW)**
P.O. KATRI SARAI (GAYA)

## నెరసిన జుట్టు



ఆయుర్వేద వైద్యం పూర్తిగా నెరసిన జుట్టును కూడా మామూలు రంగులోనికి తెస్తుంది. తెల్లని జుట్టు నల్లని జుట్టుగా మారుతుంది. జుట్టు రాలడాన్ని అరికడుతుంది. వైద్యం కోసం వెంటనే వ్రాయండి. ఒక సీసా రూ.25/- మూడు సీసాలు రూ.70/-

Vaidya M.K. Mathur **(MKT)** ) P.O.KATRI SARAI (GAYA)

న్నో విసిరేందుకు బుర్రని సిద్ధపరచకుండా ముందు వాళ్లని గమనించింది. తన ప్రమేయం లేకుండా వాళ్లేమిటి అన్నది తెలుసుకునే ప్రయత్నం కూడా ఆమె తన ప్రమేయం లేకుండానే చేసింది. ఆమె అంతరంగపు లోపలి పొరలెక్కడో కదలబారి, నిద్ర మేల్కొని ఈ పని చేస్తుంటే, రోజూ వేయి కళ్లతో మేల్కొని వుండే అహం, స్వీయదృష్టి యుద్ధంలో దెబ్బ తగిలి మూర్ఛపోయిన సైనికుల్లా స్పృహ లేకుండా పడివున్నాయి.

సుధకు ఈ స్థితి అనుభవంలేక పాతికేళ్లకు పైనే అయింది. తండ్రి చేతిలో దెబ్బలు తిన్న తర్వాత కూడా సుధలో వచ్చిన మార్పు ఆమెకు పూర్తిగా తెలిసి జరిగింది కాదు. కొంత కోపం, పట్టుదల, కోరికను నిత్యం రగిలించుకోవటం యివన్నీ సుధకు తెలిసే జరిగినప్పటికీ ఎవరికీ ఏమీ ఇవ్వకూడదు, ఎవరికైనా సంతోషం కలిగించే పని చెయ్యాలనుకోవటం అనవసరం, మన సంతోషమే మన లాభమే మనకు ముఖ్యం. ఎవరికైనా సహాయపడటం అనవసరం. అలా సహాయం చేసినపుడు మనకే అపకారం జరుగుతుంది. మనల్ని ఎవరూ సంతోషపెట్టరు. మనకి ఎవరూ సహాయపడరు. అందువల్ల మనం ఏ పని చేసినా మన కోసం చెయ్యాలి తప్ప యితర్లకోసం చెయ్యకూడదు ఈ భావాలన్నీ ఆమెకు తెలిసీ తెలియకుండానే ఆమె మనసులో స్థిరపడిపోయాయి.

సుధ ప్రతి పనీ తనకేం లాభం అని ఆలోచించే చెయ్యటం మొదలు పెట్టింది. చివరకు చదువు కూడా ఆమె సబ్జెక్టు నేర్చుకోవటం కోసం చదవలేదు. పరీక్షల్లో మార్కుల కోసం, వాటివల్ల వచ్చే వుద్యోగం కోసం చదివింది. ప్రతి విషయాన్నీ తన దృష్టి నుంచే ఆలోచించటం, దానికి యింకో కోణం వుంటుందనుకోక పోవటం ఆమె స్వభావంలో భాగమై పోయాయి.

ఈ సమాజంలో కూడా రోజు రోజుకీ సుధ లాంటి వారి సంఖ్యే పెరగటంతో, వారే తెలివిగలవారిగా సమర్థవంతులుగా పరిగణించబడటంతో సుధకి తనలో జరిగిన మార్పుని అర్థం చేసుకోవాల్సిన అవసరం కూడా రాలేదు. పక్కవారి గురించీ వారి సంతోషం గురించీ స్నేహం, ప్రేమ మొదలైన విషయాల గురించి ఆలోచించే వారంతా తెలివిహీనులుగా, అసమర్థులుగా లెక్కగట్టే సమాజంలో బతికిన సుధ శ్రీకాంత్ కంటే తనే తెలివిగలదాన్నని ఎప్పుడూ అనుకునేది.

శ్రీకాంత్‌కి సుధ సమస్య అయింది కూడా. అందుకే సుధతో స్నేహం కుదరక, సుధ మనసులోని కంచుగోడల్ని బద్దలు కొట్టలేక శ్రీకాంత్ చాలా రోజులు అల్లాడిపోయాడు.

చివరికి ఆ ప్రయత్నం విరమించి లయకే తన స్నేహాన్నీ ప్రేమనూ యిచ్చి తృప్తిపడ్డాడు. శ్రీకాంత్ చేసిన ఈ ప్రయత్నం కూడా సుధ గమనించలేదు.

ఇల్లు కట్టుకోవాలనే అతి సహజమైన కోరికను కుటుంబ భద్రతకు అత్యంత అవసరమైన కోరికను లక్ష్యపెట్టకుండా స్నేహితులనీ పుస్తకాలనీ, సంగీతమనీ, ప్రయాణాలనీ డబ్బు తగలేస్తున్న శ్రీకాంత్ ఆమెకు ఎప్పుడూ సమస్యే. తనకిలాంటి భర్త దొరికినందుకు ఆమె చాలా సార్లు విచారించింది. లయ కూడా తండ్రిలా తయారవుతోందని చాలాసార్లు బెంగపడింది.

అట్లాంటి సుధ యివాళ మొదటిసారిగా ఈ ఆడవాళ్ల బాధలను తన దృష్టితో కాకుండా తనకు కాస్త ఎడంగా నిలబడి వాళ్లకు దగ్గరగా వెళ్లి చూసింది. అందువల్లే వాళ్లకు చేసిన సహాయం వల్ల తనకు కలిగిన అసౌకర్యం గురించి ఆమె ఆలోచించలేదు. పోలీసుల బారినుంచి ఆ ఆడవాళ్లను తప్పించగలిగినందుకు ఆమె చిన్నపిల్లలా సంతోషపడింది.

సుధనూ, సుధ సంతోషాన్నీ చూస్తూ జయ కాసేపు ఈ ప్రపంచాన్ని మర్చిపోయింది.

రాంరెడ్డి గురించి జయ లేవదీసిన ప్రశ్నను కాంతారావు కొనసాగించాడు.

"సర్పంచైవుండి వూళ్ళో వ్యవహారం పట్టించుకోలేదే-" ఆశ్చర్యంతో తలమునకలవుతున్న కాంతారావుని అక్కడినుంచి పైకి లాక్కొస్తూ కృష్ణమూర్తి అన్నాడు.

"సర్పంచ్ గాబట్టే జోక్యం చేసుకోలేదు. రేపు పేపర్లో ఫలాన వూరి సర్పంచ్ రాంరెడ్డి సారా వ్యతిరేక పోరాటానికి మద్దతు యిచ్చాడని వస్తే ఇక ఆయన గతేంగాను" అందరూ నవ్వారు.

"మరి ఇంతమంది ప్రజలకు వ్యతిరేకం అయితే రేపెలా గెలుస్తాడు?"

"అందుకేగా వ్యతిరేకంగా కూడా ఏమీ చెయ్యలేదు. ఈ విషయంలో తనకేమీ పట్టనట్టుగా వుంటే ఇద్దరి దృష్టిలో మంచివాడుగా వుండొచ్చు"

ఒకోసారి రెంటికీ చెడిన రేవడి సామెతగా కూడా అవ్వొచ్చు" రామారావుగారు నవ్వుతూ అన్నారు.

వీళ్ళతోపాటే వీళ్ళ వెనకగా నడుస్తున్న ఒకామె అందుకుని "మా సర్పంచుగాని ముచ్చట నేనే చెబ్త... ఆనికీ ఈడున్న బండరాయికీ ఫరక్‌లేదు. ఊర్ల ఏం జరిగినా ఆనికేం బట్టదు. ఆడోల్ల కింతన్నాలం జర్గుతోందా! పట్నంకెల్లొచ్చిన మీరే వూకుండ లేకపోయిన్రా. ఆనికేం బట్టదు. దొడ్ల టాక్‌టరుంది. దానిమీద బంపాచ్చు"

అమె జతగా నడుస్తున్న ఇంకొకామె ఫక్కున నవ్వింది. "అరే యాదవ్వ. ఏం జెప్తున్నవే. ఆడింట్లకెల్లి బైటికే రాకపోయె. ఆనింట పీనెల్ల. ఆడేమి టాక్‌టర్ బంపుతుడే నువ్‌భీ మంచిగ జెప్పినవ్ తియ్" అంటూ యాదవ్వతో కలిసి ముందువాళ్ళను దాటుకుంటూ త్వరత్వరగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

ఆ ఇద్దరితో సమానంగా నడవలేక ఇంకా వెనకేవున్న మరో ముసలమ్మ సర్పంచ్‌కి ఏమేమి కీడు జరగొచ్చో వూహించి, ఐనా ఎందుకు జరగడంలేదో అనుమానించి... వీటన్నిటికీ కారణమైన భగవంతుడి వునికిని ప్రశ్నిస్తూ వెళ్ళిపోయింది.

వెళ్ళేవాళ్ళను చూస్తూ, వాళ్ళ మాటల్ని వింటూ పంతుళ్ళంతా ఎవరి శాస్త్రాన్ని వాళ్లు అన్వయించుకుంటున్నారు.

"సర్పంచ్ ఇంటి దగ్గర మనం ఈ విషయాలు మాట్లాడొద్దు. ఈ చర్చ తేవొద్దు. ఆయనేదో పెడతాడు. అవి తిని బైటపడదాం" అన్నారు నవ్వుతూ రామారావుగారు.

"ఎందుకట్లా? ఇంత గొడవ జరుగుతుంటే మీరెందుకు రాలేదని అడిగేస్తే ఆయన ఉద్దేశమేంటో తెలుస్తుందిగా"

కృష్ణమూర్తికి ఆ వూరి సర్పంచ్ పట్టించుకోని విషయాన్ని తాము పట్టించుకోవాల్సి వచ్చినందుకు కలిగిన విసుగు ఇంకా తగ్గలేదు.

"ఎందుకంటే ఇప్పుడు రాంరెడ్డిని కదిపితే ఈ వూళ్లో జనం ఎంత దుర్మార్గులో, బద్మాషులో ఎంత నమ్మకద్రోహులో... తననీ సిద్ధారెడ్డినీ ఎన్ని బాధలు పెడుతున్నారో కథలు కథలుగా వర్ణించి చెబుతాడు. అందులో సందేహంలేదు" అంటున్న రామారావుగారితో-

"అవును. నేను కూడా అట్లాంటివాళ్ళను చాలామందిని ఎరుగుదును. పల్లెల్లో దొరలే కాదు... నగరాల్లో కూడా చాలామందికి తమ కంటే కిందివాళ్ల దుర్మార్గం గురించి కింది కులాలవాళ్ళు ఎలా హద్దు దాటుతున్నారో, కింది తరగతులవాళ్ళ దౌర్జన్యం ఎంత పెరిగిపోతోందో మాట్లాడతారు"

"బానిస బుద్ధులు- మనుషులకు బానిస బుద్ధి ఎంతగా అలవాటయిందంటే తను పైవాడికి బానిసగా బతకటం, తన కిందివాళ్ళను బానిసలుగా చూడటం అలవాటైపోయింది. కిందివాళ్ళ తిరుగుబాటుని భరించలేరు,

"రాంరెడ్డిని ఈ విషయాలు కదిపి అతను మాట్లాడేమాటల్లోని పొరపాట్లు అతనికర్థమయ్యేలా చెయ్యటం మంచిదేమో"

"అంటే చర్చ పెడదామంటారా?" చిరునవ్వుతో అడిగారు రామారావుగారు.

"తప్పేమిటి?"

"తప్పేంలేదు. టైమేలేదు"

"జీపు రావడానికి చాలా టైము పడుతుందిగా" జయకు కూడా ఆతృతగా వుంది. రాంరెడ్డిని తిట్టి, మార్చేసేద్దామని.

"ఈ టైమ్ చాలదు. మనంగానీ, రాంరెడ్డిగానీ మరణించేదాకా ఈ చర్చ ఒక ముగింపుకు రాదు" అందరూ నవ్వారు.

"చర్చకు ఎప్పుడైనా సరే ఒక ఉపయోగం వుండాలి. చర్చచేసే ఇరువర్గాలు గానీ, లేదా ఒకవర్గంగానీ చర్చనుంచి ఏదైనా నేర్చుకోటానికి సిద్ధంగా వుండాలి. తర్వాత నిజంగా తన పద్ధతో, ఆలోచనో మార్చుకోవాలి. రాంరెడ్డి చర్చ మొదలుపెట్టినప్పుడే అతడి మెదడుని మూసేస్తాడు. మొండిగా బండగా వాదనకి దిగుతాడు. ఇలాటివాళ్ళతో నేను నాకు యాభై యేళ్ళొచ్చేవరకూ చాలా చర్చలు జరిపి వాళ్లకేమీ




నేర్పలేక చివరికి నేనే నేర్చుకున్నాను- ''చర్చ'' ఎవరి దగ్గర, ఎవరితో చెయ్యాలి అనే విషయం''

అందరి నవ్వులూ అణగకుండానే రాంరెడ్డి ఇల్లు వచ్చింది. రామారావుగారు తన మాటలు వినేవాళ్లున్నారు... ప్రభావితులౌతారనే ఆశ వుంటే... ఆలోచిస్తారు. మారతారు అనుకుంటే అలాంటి వాళ్ళదగ్గర అలుపూ సొలుపూ లేకుండా, విసుగూ విరామం లేకుండా గంటలు గంటలు మాట్లాడతారు. మాటలు కేవలం వాదన కోసమే తప్ప పనికి రావటం లేదనిపిస్తే ఆయన మితభాషిగా, చాలాసార్లు మూగగా మారిపోతారు.

రాంరెడ్డి ఇంటిబైట వరండాలో కుర్చీలూ వాటిల్లో మెత్తటి దిళ్లూ వేసివున్నాయి. రాంరెడ్డి వీళ్ళ కోసమే చూస్తున్నాడు.

బజార్లో జరుగుతున్న విషయాలు ఎప్పటికప్పుడు రాంరెడ్డికి తెలుస్తూనే వున్నాయి. పట్నం పంతుళ్ళమీద ఆయనకి అమితమైన కోపంగా వుంది.

''ఆ మాలమాదిగ ముండలంతా జేరి వూర్ల దునియాలలేని చిక్కులు తెస్తుర్రనుకుంటే... ఆ బట్టాబాజ్‌గాల్లకీల్ల మద్దతొకటి... రేపు ఎన్నయ్ మీ వూర్నించి గింతమంది ఆడోల్లని మీటింగుకెట్ల రానిచ్చినవంటె ఏం జెప్పాలె... ఒక్క రోజొచ్చి పోయెటోల్లు నేలని బడ్డ శనినిదీసి నెత్తికెత్తుతున్నారు'' అని అప్పటిదాకా వీరంగం వేశాడు అక్కడున్న తన బంట్లమీద. వాళ్లు తామే ఆ తప్పు జరగటానికి కారణమన్నట్టు వంగి వంగి అణకువగా తిరిగారు.

లోన మాత్రం 'ఈ బాడకోవ్‌గాన్ని తిప్పలు బెట్టెటోల్లు వస్తుర్రనీ, ఆల్లని చూడాలనీ' సంబరంగా వున్నారు.

వీళ్ళను చూస్తూనే రాంరెడ్డి ఎక్కడలేని ఆదరంతో నవ్వుతూ ఎదురొచ్చి ''రాండ్రి... రాండ్రి'' అంటూ ఆహ్వానించి అందర్నీ కూర్చోబెట్టాడు.

''అరే పోసిగా...'' అని ఓ కేక వేశాడు.

''నీ కాల్మొక్త. గులాపోన్ని'' అని పోసిగాడు బక్కెట్లలో వున్న నీళ్ళు చెంబులతో ముంచి అందరి కాళ్లూ చేతులూ కడిగాడు.

ఇంట్లోంచి రకరకాల ఫలహారాలు వచ్చాయి.

లోపల్నించి తన్నుకొస్తున్న దర్పాన్ని కనపడనీయకుండా నిర్లిప్తంగా మొహం పెట్టడానికి ప్రయత్నిస్తూ చెయ్యూపాడు.

''తీసుకోండి'' అన్నట్టు.

''ఇప్పుడివన్నీ ఎందుకండీ'' అంటూనే అందరూ ప్లేట్లు అందుకున్నారు.

''అంత దూరంకెల్లి మీరొస్తే జర... మర్యాజ్జేసి పంపాల్నొంతదిగదా'' అన్నాడు రాంరెడ్డి తన బాధ్యత నిర్వహిస్తూ. అందరూ మౌనంగా తింటున్నారు.

''నడిచొచ్చారే- జీపేది'' అని కూడా అడగని రాంరెడ్డి తెలివికి అందరూ ఆశ్చర్యపోతున్నారు లోలోపల.

రాంరెడ్డి చాలా అశాంతిగా వున్నాడు. మాట్లాడకుండా వూరుకోవటం అతనికీ చాలా కష్టంగానే వుంది.

కానీ అతని వివేకం ఎందుకనో పట్నం పంతుల్లతో మాట్లాడొద్దు అని చెప్తోంది. అది అలా చెప్పడానికి దానికుండే కారణాలు దానికున్నాయి. ఈ పంతుళ్లు నువ్వు చెప్పే మాటలు వినేవాళ్లయితే స్వయంగా గరీబోళ్ల దగ్గరకు పోకుండానే వాళ్లేం తింటున్నారు, ఎలా బతుకుతున్నారు, వాళ్ళకెన్ని చెడు లక్షణాలున్నాయి, వాళ్లెందుకు తరాలు తరాలు, యుగాలు యుగాలు అలాగే దరిద్రంలో మగ్గుతున్నారు, దానికి వాళ్ళే ఎలా కారణం- ఇవన్నీ నీ దగ్గర నీ ఇంట్లో కూర్చుని నువ్వు పెట్టేవి తింటూ, మర్యాదలందుకుంటూ, నువ్వు చెప్పిన మాటలే అంతిమ సత్యాలుగా రాసుకుపోయేవాళ్లుగా. ఇంతకుముందు ఎందరో ఎన్ని విషయాలకో నీ దగ్గరకొచ్చి నీ దగ్గర్నుంచే వెళ్లారు. అలాంటి ఉదాహరణలెన్నో వున్నాయి. కానీ వీళ్లు- ఈ పంతుళ్ళేం చేశారు? మాలమాదిగల ఇళ్లకెళ్లారు. వాళ్ళతో కూర్చున్నారు. వాళ్లు చెప్పింది విన్నారు. వాళ్ళు చేతినీళ్లు తాగారు. అంతా అయ్యాక వస్తూ వాళ్లు చేసిన పనేమిటి? ఇదొకవూరు. ఈ వూరికో మంచీ

చెడ్డా, పద్ధతీ పాడూ వుంటాయి. ఈ వూరుకో సర్పంచున్నాడు. పెద్ద రెడ్డున్నాడు. చిన్నరెడ్డున్నాడు. వీళ్ళెవరూ పట్టించుకోని సంగతులు ఓ గంటో అరగంటో వుండెళ్ళేవాళ్ళం. మా కేల.. అనుకోవాలా? వూహూ- తగుదునమ్మా అని ఓ డొక్కు జీపేసి వాళ్ళందరినీ దగ్గరుండి పంపి మరీ వొచ్చారు. ఎంత గుండెలుతీసిన బంట్లంటే- వచ్చాకైనా సర్పంచివి గదా నీతో- ఇదిగో ఇలా చేశాం అని చెప్పొచ్చుగదా. అనలే మీ జరగనట్టే-

వివేకం అతనికిదంతా చెబుతూ-

"అందుకే నోర్మనుకో. నీవేమన్నా అదీ నీమీదకే తిప్పుతారు. ఇట్లాంటి పంతుళ్ళుగదూ యాద్గిరిలాంటి వాళ్ళని తయారుచేసి పల్లెల మీదికి తోలుతున్నారు. పట్నంల చదువుకొచ్చి యాద్గిరి చేసిందేంటి" అని గదమాయించింది.

రాంరెడ్డికి వివేకం వుందిగానీ దాన్ని ముక్కుమూసి మూడు చెరువుల నీళ్లు తాగించే అహంకారం కూడా వుంది

యాద్గిరి పేరు మనసులోకి రాగానే అది బుస్సున లేచింది. ఇక రాంరెడ్డి నిలవలేకపోయాడు. యాద్గిరి సంగతి చెప్పి వాడిని తిడితే వీళ్ళని తిట్టినట్టేగదూ అనుకున్నాడు.

"మీ పట్నంల అంటు సొంటులుండవ్ గానీ, యీడ ఇనరుగదా! మీరందరూ ఒక్క కులంవాల్లు గాకుండొచ్చు. అయిన కల్సి తిర్గుతరు. కల్సితింటరు గాని, ఈడ కుదర్దుగదా- ఎందుకు చెప్తున్ననంటే- ఆడ ఓ నెలరోజుల్నంది గొడవ నడుస్తోంది. ఆ యాద్గిరిగాడొచ్చిన్నంది"

" యాద్గిరెవరు?"

"ఆడే! ఆడో ఎస్సీ- రిజర్వేసనుగాడు. దాన్లపడి బగ్గ చదివిండు. పట్నంల చదివిండు. ఆని తల్లి చెల్లి అందరీడ్నే వున్నరు. వూల్రకొచ్చిండు. ఎప్పుడు జూడు పోస్టపీసు, లైబ్రీలల్ల తిర్గుతుంటడు. నల్గురు పోరగాల్లని ఎంటబెట్టుకుని ఎప్పటికేదో ఒల్లుతుంటడు. వాడోపారి రోడ్డుమీది ఓటల్ కెల్లిండట. ఓటల్ల ఈనికి జాగదొర్కలా... వున్నది మూడే టేబిల్లాయె. మీరు జూసిన్రో లేదో... గందు గురించీడెల్లి మా సిద్ధారెడ్డి కొడుకూ ఆని దోస్తులూ గూసున్న తాకిబోయి ఓ కుర్సి కాలీగుంటే దాన్ల గూసున్నడు. ఆల్లకి పెట్టిన గ్లాసులల్లనుంచి ఓ గ్లాసు తీస్కొని నీల్లు దాగిండు. ఖతం... అయి పాయె"

"ఏమయింది?" యాదయ్య ఆతృతగా ఆవేశంగా అడిగాడు.

"ఏమయింది? ఏమవుతది సార్! ఇదేమన్న పట్నం అనుకుండా... అంటు సొంటు లేకుంట రెడ్ల గ్లాసులల్ల నీల్లు తాగనీకి! సిద్ధారెడ్డి మేనల్లుడు ఈ యాద్గిరనేటోడలా చిన్నప్పుడు మా వూరి బళ్లోనే చదివిరి. పెద్దయినంక పట్నంల బెడ్తే సిద్ధారెడ్డి మేనల్లుడు దోస్తానా లెక్కయి చదువకుంట తిరుగుల్లు, తాగుల్లు షోకూ జేసిండు. ఇగిట్లయితే గాదని సిద్ధారెడ్డి మంచి పిల్లని జూసి- అయినోల్లలే- లగ్గం జేసిండు. ఆడీడ్నే సైకిల్ మోటరేసుకు తిరుగుతా వుంటడు. ఈడభీ ఆనికి దోస్తానీలు. సరే- తాగుడు, తిరుగుడు ఎక్కడైన వుండేద్దేనాయె. ఈ యాద్గిరిగాడు ఆడ సోసల్ ఎల్ఫేర్ ఆస్టలల్ల వుండుకుంట, బియ్యంల పుర్గులున్నయనీ, కూరలు జర కుళ్ళిపోయినయ్యనీ సర్కారు పైసలు తీస్కుంట సర్కారోడి మీనే కొట్లాడుకుంట ఎట్ల ప్యాసయిండొగని కాలేజీకంత ఫస్టున ప్యాసయిండంట. మంచి కొల్వు కూడా దొరుకుతుందనబట్టిరి. అంత మంచిగనే గనీ- ఎంత జదివిన ఆడికులం మారతాది? మారది గదా!"

రామిరెడ్డి మాటలు వింటూ రామారావుగారు చిరునవ్వుతో అందరివంక చూశారు. అందరూ ఒక సస్పెన్స్ థిల్లర్ సిన్మాను చూస్తున్నట్టు వింటున్నారు.

జయ అయితే ఆగలేకపోతోంది. చిన్నప్పట్నుంచీ జయకు సస్పెన్సు పడదు. ఇంటికెవరొచ్చినా 'కథ' చెప్పమని పీక్కుతినేది. వచ్చినవాళ్లు ఏదో ఓ కథ మొదలుపెడుతుండగానే జయ అడ్డంపడి 'చివరికేమవుతుంది?' అని అడిగేది.

"వినూ... చెప్తాగా" అంటే.

"ఊహూ... చివరికేమవుతుంది?" అని ఒణికిపోయేది టెన్షన్‌తో.

జయకి కథ చెప్పే ఎవరైనా-




''అనగనగా ఒకనాడు ఒకరాజు. అతనికో అందాలభరణిలాంటి కూతురు. ఒకరోజు ఉద్యానవనంలో విహరిస్తున్న రాకుమారిని ఆ తోటమాలి కొడుకు చూసి, మొట్టమొదటి చూపులోనే ప్రేమించాడు'' అని మొదలు పెట్టగానే జయ టెన్షన్ పడిపోయి.

''చివరికి పెళ్ళవుతుందా?'' అనేది.

''వినూ'' అంటే.

''ముందిది చెప్పు- చివరకు పెళ్ళవుతుందా?'' అరిచేది. అది చెప్పేస్తే చాలు. పెళ్ళవకపోయినా ఫర్వాలేదు. సానుభూతితో, విషాదంతో వింటుంది. కానీ చివరికేమవుతుందో మొదలే చెప్పాలి.

అలాంటి జయ మనసుకి రాంరెడ్డి చెప్పే కథ ఎంత ఆసక్తిగా వున్నా చివరికేమయింది అనే సమస్యతో అశాంతిగా మారిపోయింది.

ఐతే ఇప్పుడు చిన్నతనంలో వేసినట్లు ప్రశ్నలు వెయ్యలేదు- పైగా ఎదురుగా వుంది రాంరెడ్డి. అయినా ఆగలేక ''ఏమయిందప్పుడు'' అన్నది.

''ఎప్పుడు'' అన్నాడు తీరిగ్గా రాంరెడ్డి.

''అదే- హొటల్లో యాద్గిరి కూర్చున్నప్పుడు''

''ఏమవుతుందమ్మ- ఇది పట్నంగాదు. గల్లని జంగిల్‌భీ గాదు. పల్లెనాయె. పైనుంచి ఎదురుగా గూకుంది సిద్ధారెడ్డి మేనల్లుడు. ఆడులేసి యాద్గిరి నొక్కటి బీకిండు. యాద్గిరెల్లి చాయ్ గాసె బాయిలరు మీదపడిండు. ఆనికి దెబ్బలు మంచిగనే తాకినయ్. ఇంక వూకుండొచ్చుగద. ఆడు పట్నంల ఫైటింగు సీన్మాలన్ని జూసొచ్చినాడయ్యె. ఎక్వ తక్వ వర్లు కుంటూ రెడ్ల పోరలమీదికి బోయిండు. మందంత కల్సి ఇడ్పించిన్రు. సిద్ధారెడ్డి మేనల్లున్కి కూడా దెబ్బలు తాకినయ్.

ఆ యాద్గిరి ఖతర్నాకున్నడు. పెయ్యినిండ దెబ్బలు తలిగిన గూడా మర్నాడు ఓటల్‌మీదికి మందిని తెచ్చిండు. గ్లాసులు అందరికి కలిపియ్యాలి. తక్కువోల్లకి ఏరుగా ఇవ్వొద్దంటడు ఆనెన్కమంది- అంత తక్వకులంవోల్లె వున్నరు. ఓటలాయనేం చెయ్యాలి. అదొకలొల్లి... ఊర్ల ఇదంత చాలదని ఆ పేపరోల్లొచ్చి పడిన్రు''

''తర్వాత తర్వాత'' జయలో ఆతృత.

''ఏముంటదమ్మా. పోలీసులొచ్చిన్రు. కొట్లాడుకున్నోల్లందర్నీ తీస్కబోయి పోలీస్‌టేషన్ల పెట్టిన్రు.

సిద్ధారెడ్డి జమానతిచ్చి రెడ్లోల్ల పిల్లల్ని తెచ్చిండనుకో''

''మరి యాద్గిరి వాళ్ళకి''

''వాళ్ళకెవరిస్తరు. అగర్ మనం యిచ్చిన మనుకో... మన మాటింటనేముంది. పొద్మోకి ఎటో పీకిండనుకో. మన పీక్కి జుట్టుకుంటది గదా-''

''అప్పుడేమయింది'' జయ.

''అందర్ని కొన్ని దినాల్ని ఒదిలేసిన్రులే. యాద్గిరి మటుకు కన్పిస్తలేడు. ఆనిమీద సర్కార్‌కి కూడా జర కోపంగానె వుందట. ఆడు పెద్ద పెద్దగ మాట్లాడిండని యిన్న. యియ్యాల రేపు పెద్ద పెద్దగా మాట్లాడి తక్కువ కులాలోల్లు పెరిగిపోయిన్రు గద! ఎన్నడు ఏ గొడవ లేని వూర్ల చిచ్చుబెట్టనీకి తప్ప యాద్గిరికి చదువెందుకు-

ఆ చదువులల్ల ఏముంటదో మీకు తెల్వాలి.

ఇప్పుడేమాయె! ఆ ఓటల్ల గ్లాసులు అలగలగే వున్నయ్. మంచిగ చదువుకున్న పోరడు తల్లికి చెల్లికి పనికిరాకుండబోయిండు. వాడు రాత్రిల్లు కన్పడిపోతుండని చెప్తున్నరు గనీ మళ్ళీ వూర్ల వాడు తిరగలేకపోయెగదా- ఎక్కడో ఎన్నడో యిట్లనే కొట్లాటల్లోనో, పోలీసులకు జిక్కి ఆల్ల గోలీలకో చావవల్సిన వాడేనాయె''

రాంరెడ్డి యాద్గిరికి అలాంటి గతిపట్టినందుకు సంతోషిస్తుండగా జీపు వచ్చింది.

మౌనంగా జీపు ఎక్కి కూచున్నారుగానీ అందరి మనసుల్లోనూ యాదగిరి వెలుగుతూనే వున్నాడు. మనుషులందరూ సమానం అని పుస్తకాల్లో చదివీ చదివీ, పరీక్షల్లో రాసీ రాసీ ఫస్టున పాసైన యాద్గిరి మనుషులందరూ సమానం కాదని తెలుసుకుని, జరిగిన మోసాన్ని ప్రశ్నించబోతే తన జీవితాన్నే పణంపెట్టాల్సి వచ్చింది.

యాదగిరి ఎలా వుంటాడో అతను- ఈ

దేశంలో అందరూ ఒప్పుకున్న ఒక విషయాన్ని- రేడియోల్లో, గోడలమీదా, బస్సులమీదా ఎక్కడబడితే అక్కడ అదేపనిగా ప్రభుత్వం ప్రచారం చేస్తున్న విషయాన్ని ఆచరించబోయిన యాదగిరి ఏమయ్యాడు- ఏమవుతాడు-

ఆ రాతలూ, ఆ కబుర్లూ కట్టిపెట్టండి.

"అంటరానితనం నేరం. దాన్ని పాటించిన వారు శిక్షార్హులు" అనే రాతలు చెరిపెయ్యండి.

"అంటరానితనం మనజాతి లక్షణం. హిందూ సంప్రదాయం. కులాలను మనదేవుళ్లు సృష్టించారు. కులాలను కాపాడటం హిందువుల ధర్మం. కులాలను అతిక్రమించిన వాడికి మరణదండన" అని రాయండి.

అప్పుడు యాదగిరి। ఇంకా వేలాది యాదగిరిలు ఏం చేస్తారో చూడండి.

కానీ అట్లా చెయ్యరు. మోసం. దగా. వంచన. మంచి మాటలతో, వాగ్దానాలతో భ్రమలు కల్పిస్తారు. నగరాల్లో సభల్లో చప్పట్లు మారుమోగుతాయి. అవన్నీ నమ్మి పల్లెకొచ్చిన యాదగిరి చచ్చిపోతాడు. చీకట్లో కల్సిపోతాడు"

జయకు, యాదయ్యకూ, రామారావుగారికీ మనసంతా వికలమైపోయింది.

ఇంతకుముందు ఏదో సాధించామనే ఉత్సాహంతో తుళ్ళిపడ్డ వాళ్ళ మనసులు యాదగిరి కోసం విలపిస్తున్నాయి.

"యాదగిరి అనే నాకో స్టూడెంటుండేవాడు. అతనే... అతనే ఇతనేమో... ఏమైనా ఆయామ్ వెరీ ప్రౌడ్ ఆఫ్ హిమ్" రామారావుగారే నిశ్శబ్దాన్ని భగ్నం చేశారు.

★ ★ ★

మిగిలిన ఐదారుగురు ఆడవాళ్ళనూ ఎక్కించుకుని జీపు బయలుదేరింది. అందరూ యిరుకు యిరుకుగా కూర్చున్నారు. సాయంత్రం ఐదుగంటలు కాబోతోంది. చలికాలం కావటాన ఒకవైపునుంచి చీకటి పడబోతున్నట్లుగా వుంది వాతావరణం. జీపులో ఎక్కిన ఆ వూరి స్త్రీలు నిశ్శబ్దంగా కూచున్నారు, ఈ చదువుకున్న వాళ్ళముందు తాము ఏం మాట్లాడతాం అన్నట్లుగా.

"ఏడు గంటలకు సిటీ చేరితే ఇంటికి వెళ్ళేసరికి ఎనిమిది దాటుతుంది. రేపు ఉదయాన్నే క్లాసుంది. ఎప్పుడు ప్రిపేరవ్వాలో" అన్నాడు కృష్ణమూర్తి నగరంలో తన జీవితాన్ని గుర్తుతెచ్చుకుని ఒకసారి రీ ఎస్యూరెన్సు పొందబోయేవాడిలా.

తొందరగా ఈ పల్లెనుంచి తన నగరానికి వెళ్ళిపోవాలని వుంది కృష్ణమూర్తికి.

ఇన్నాళ్ళూ కృష్ణమూర్తికి గ్రామాలంటే ఒక విధమైన ఆరాధన వుండేది. అతను పుట్టిందీ, పెరిగిందీ, చదివిందీ, ఉద్యోగం చేస్తోందీ అంతా హైదరాబాదులోనే. అతనికి పల్లెటూళ్ళతో వున్న సంబంధం చాలా తక్కువ.

అందువల్ల అతనికి పల్లెటూళ్ళంటే ఏదో కథలలో చదివిన అనుభూతులే గుర్తొస్తాయి. అందువల్ల పల్లెటూళ్ళంటే చాలా ప్రేమ. నగర జీవితంలో ఒత్తిళ్ళు, హడావుడీ, కాలుష్యం, బందులు, సమ్మెలు, కర్ఫ్యూలు యివన్నీ విసిగించినపుడల్లా కృష్ణమూర్తి పల్లెను గురించీ ఆ జీవితం గురించీ కలలు కనేవాడు. మంచినీళ్ళు, మంచిగాలి, మంచి పాలు, మంచి మనసులూ, అమాయకత్వం, ఆత్మీయతతో కూడిన మానవ సంబంధాలు- యిలాంటి భావాలు అతనికి తెలియకుండానే పల్లె అనే పదంతో ముడిపడి అతని మనసులో నిలిచాయి.

ఇవాళ వాళ్ళంతా చూసిన పల్లెటూరితో కృష్ణమూర్తి మనసులో వున్న పల్లెటూరి పునాదులు కదిలిపోయాయి.

ఇక్కడ నీళ్ళు లేవు. పాలు లేవు.

పొద్దున్నే గ్రామంలో మంచి పాలన్నింటినీ నింపుకున్న పాలక్యాన్లు నగరం తరలిపోతాయి.

నగరంనుంచి పొట్లాలతో సారా గ్రామాలకు వస్తుంటుంది. మురికి రోడ్లు, మురికి కాలవలూ, పరిశుభ్రత లేని పరిసరాలు-

దరిద్రం, దోపిడీ, అజ్ఞానం అన్నింటికీ నిలయమైనట్లున్న ఈ పల్లెటూరు కృష్ణమూర్తికి భయాన్నీ ఆందోళననీ కలిగించింది.

ఎన్ని అసౌకర్యాలున్నా ఎన్ని ఆందోళనలు




న్నా ఎన్ని ఒత్తిడులున్నా నగరంలో తన ఇల్లే తనకు భద్రమైన చోటనే బలమైన భావం కలిగింది కృష్ణమూర్తికి.

అప్పటికప్పుడు తన నగరంమీదా, ఉద్యోగం మీదా, ఇంటి మీదా అంతులేని బెంగ, ప్రేమా పుట్టుకొచ్చాయి. ఎప్పుడెప్పుడు ఇంట్లో పడిపోదామా అన్నట్లుంది అతని మానసిక స్థితి.

కాంతారావుకి కాస్తంత చిరాకుగా వుంది.

వచ్చిన పని అయినట్లో కానట్లో అతనికి తేలలేదు. ఈ పల్లెటూరి జనాలు తింటున్న తిండి వివరాలైతే సేకరించారు. వాటిలో పోషకాహార విలువలు తెలుస్తూనే వున్నాయి.

అయితే పరిస్థితులు మునుపటికంటే మారినట్లా లేదా? ఒకోసారి పాతికేళ్ళ కిందటి కంటే యిప్పుడు ప్రజలు తీసుకుంటున్న ఆహారంలో పోషకవిలువలు ఎక్కువగానే వున్నట్లు కనిపిస్తుంది.

మళ్ళీ చూస్తే దరిద్రం పెరిగినట్లూ, కనీసం తరగనట్లూ కనిపిస్తుంది.

ఈ పల్లెటూళ్ళు అభివృద్ధి అయినట్లా కానట్లా-

కష్టాలు, అవినీతి, దోపిడీ వున్నాయి గానీ అవి లేనిదెక్కడ? నగరాల్లో లేవూ?

ఆ మాటకొస్తే ప్రపంచమంతా లేవూ?

కల్తీ జరగనిదెక్కడ? లంచాలు పట్టనిదెక్కడ?

మరి నగరాలు అభివృద్ధి చెందినట్లు ఒప్పుకుంటే పల్లెలు మాత్రం అభివృద్ధి చెందినట్లు ఎందుకు ఒప్పుకోకూడదు?

మరి ఈ పల్లెలు అభివృద్ధి చెందినట్లా లేదా?

కనీసం అభివృద్ధి వైపు నడుస్తున్నాయా? లేదా?

కాంతారావు ఈ ఆలోచనల్లో పడి కొట్టుమిట్టాడు తున్నాడు. యాదయ్య ఆ వూర్లో వెనకబడిన కులాలవాళ్ళకు హెూటల్లో గ్లాసులు ప్రత్యేకంగా వున్నాయనే విషయం తెలిసినప్పటి నుంచీ మండిపోతున్నాడు.

సిటీకి వెళ్ళగానే ఈ విషయంమీద వ్యాసం రాసి పత్రికలకు పంపాలనీ, ఆ వూరి హెూటలాయన మీదా పెద్దలమీదా కేసులు పెట్టాలనీ ఆలోచిస్తున్నాడు.

రాంరెడ్డి మాట్లాడిన మాటలూ ఆ చర్చా అతనిలో కోపాన్నీ బాధనూ రగిలించాయి. ఇక ఆ విషయం తప్ప అతని మనసు మరొకటేదీ ఆలోచించటానికి సిద్ధంగా లేదు. వెళ్ళగానే తను రాయబోయే వ్యాసానికి తగిన పేరు ఆలోచిస్తున్నాడు. ఆ వ్యాసాన్ని ఆంగ్లంలోకి అనువాదం చేసి ప్రముఖ ఆంగ్ల పత్రికలకు కూడా పంపాలనుకుంటున్నాడు.

జయకు పొద్దుటినుంచీ జరిగిన ప్రతి విషయమూ అద్భుతంగా అనిపిస్తోంది. ఆమెకు యిన్నాళ్ళకు అసలైన జీవితంలోకి వచ్చినట్లనిపించింది. సుధకు గులాబీ పూలిచ్చిన పిల్లాడి దగ్గరనుంచీ ఈ జీపులో తమతో పాటు ప్రయాణం చేస్తున్న ఆడవాళ్ళవరకూ అందరూ ఎంతో జీవమున్న అసలైన మంచి మనుమల్లా కనిపించారు. తనకారోజు కలుగుతున్నది ఒక అద్భుతమైన అనుభవమనీ, అక్కడ కనిపిస్తున్న ప్రతి విషయం తన జ్ఞానాన్ని పెంచేదేనని ఆమెకు నమ్మకం కలిగింది. అందుకే ఆమె మనసంతటినీ ఈ పల్లెటూరిమీదే లగ్నంచేసింది. ఇక్కడ దొరుకుతున్న జ్ఞానజలాన్ని దప్పిగొన్నదానిలా తాగే పనిలో వుంది. నిజంగానే దాహంతో వున్నవాడికి మంచినీళ్ళు పుష్కలంగా దొరికి తాగుతుంటే కలిగే తృప్తిలాంటి భావమే జయ మనసుని ఆవరించుకుని వుంది. అలాంటి మానసికస్థితిలో ఆమె ఆ పల్లెటూరి స్త్రీలను ప్రేమగా చూస్తోంది. వారితో ఏదో ఒకటి మాట్లాడాలని ప్రయత్నిస్తోంది.

సుధకు శ్రీకాంత్, లయలు గుర్తొచ్చారు. వారిద్దరూ ఈ ప్రయాణంలో తనతోపాటు వుంటే బాగుండేదని ఆమెకు గట్టిగా అనిపించింది. వాళ్ళిద్దరూ ఎంతో ఉత్సాహంగా ఈ ఆడవాళ్ళతో మాట్లాడేవారనీ, కలిసిపోయేవారనీ ఆమె అనుకుంది. శ్రీకాంత్ గురించీ లయ గురించీ వారి యిష్టాలకు అనుగుణంగా ఆలోచించటం సుధకు దాదాపు యిదే మొదటిసారి. ఎప్పుడూ వారి యిష్టాలను వ్యతిరేకించటం తప్ప వాళ్ళకు యిష్టమైన పనులగురించి సానుభూతితో ఆలోచించటం అలవాటు

లేని సుధకు యివాళ ఆ ఆలోచనకలిగే సరికి ఒక్కసారి మనసంతా మెత్తనై ఆర్ద్రమై విచిత్ర మైన అనుభూతికి లోనయింది. వారిద్దరినీ తలుచుకోగానే ఆమెకు కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. లయ దగ్గరకు తొందరగా వెళ్ళాలనీ లయతో ఈ కబుర్లన్నీ చెప్పాలనీ, అలా తను చెబుతుంటే ఆశ్చర్యానందాలతో వెలిగే శ్రీకాంత్ ముఖం చూడాలనీ ఆమెకు గాఢంగా అనిపించింది. ఆ ఆలోచనల ఒత్తిడికి గాఢతకూ లోనై కొద్దిగా కందిన ఆమె ముఖాన్ని చూసి జయ ఎంతో ఆనందించింది.

ప్రొఫెసరు రామారావుగారు తనకు తెలిసిన సత్యాన్ని ప్రయోగశాలలో నిరూపించి చూపిస్తున్న సైంటిష్టులా చిరునవ్వుతో కూర్చున్నారు. ఆయనలో మిగిలినవారిలో లాగా నిరాశగానీ, భయంగానీ, ఉత్సాహంగానీ లేవు. ఇదంతా యింతే, జరుగుతుందన్నట్లూ జరగాలన్నట్లూ వుంది ఆయన ముఖంలో భావం.

జీపు యిరవై నిమిషాలలో వెంకటాపురం చేరింది. డ్రైవర్‌కి నాలుగు ట్రిప్పులతో ఆ రోడ్డు కొట్టినపిండై ఆఘమేఘాలమీద నడిపించాడు జీపుని. అంత దూరాన ఊరు కన్పిస్తున్నప్పుడే వీళ్ళకు అర్థమైంది అక్కడేదో గొడవ జరగబోతోందని-

గుంపులు గుంపులుగా జనం- వాళ్ళ చుట్టూ పోలీసులు. రెండు పోలీసు జీపులు అక్కడ ఆగివున్నాయి.

ఆ రోజు మీటింగు ఎలాగైనా ఆపాలని ఎస్.ఐ.పట్టుపట్టి కూర్చున్నాడు. కూర్చోక ఏం చేస్తాడు? అంతకు మూడు రోజులముందు ఆ ప్రాంతపు సారా కాంట్రాక్టరు బాల్‌రెడ్డి జిల్లా నాయకుడిని తోడు తోసుకుని పోలీసు స్టేషన్‌కి వచ్చాడు. వచ్చేప్పుడు వట్టి చేతుల్తో రాలేదు. భారీగా బహుమతులు తీసుకుని వచ్చాడు.

"ఈ ఆడాల్ల సంగజ్జూస్తున్నవులే. సారా వద్దంటుర్రు. మీటింగులు వెట్టుకుంటుర్రు... దునియల. ఎట్ల జర్గితే మనకెందుక్కులేగాని... మన వూర్లె జరగొద్దు. ఈడ మీటింగులు వీటింగులు జరగొద్దు. నువ్వు జరక్కుండ ఆపాలె. ముందుగాల్నె మనం జర హెషియార్ తోని వుండాలె. ఒక్కపాలి ఈ ఆడోల్లందర్ని కల్వనిస్తిమా... ఆల్లింక మన మాటినేడ్దుండది. మీటింగులు మీద మీటింగులు వెడ్తరు. సారా దుక్నంలమీద వడ్తరు. సారా పేకట్లు పలగ్గొడ్తరు. దుక్నం తలగవెడ్తరు... ఇంకప్పుడు మనకి ఆల్లని ఆపనీకి రాదు.

ముందెగాల్నె జర... నీకు గవరమెంటెంత మందినిచ్చిందో దానికి పదంతలు నాతాన భీనా మనుసులుండరు. ఒక్కొక్కడు పొద్దున మొఖం కడగంగనే మూడు కోల్లను పలారం చేస్తడు.

అంత శక్తి వుంది ఆల్లతాన!
ఆడీ ముండల్ని ఏం చెయ్యాల్నో అదంత మాకెరికే. గాకుంటే మల్ల పొద్దుగాల మీరంతొచ్చి 'గిట్లచేసెడ్డి లేకుండే' అంట ఏడుస్తరని చెప్తాన్న- మీరంటే నువ్వని గాదు. నువ్వు మంచోనివే. నాకు తెల్వదా గని- పైనుంచి ఆపీసర్లొస్తరు. మల్ల ఈ పేపరోల్లు లొల్లిజేస్తరు.

అదంత మనకొద్దు. నీతోని ఏదయితే అవుతదో అదంత ముందు జేసుకోవాలె.

దానికి మీటింగ్లు మరూనే చెయ్యొద్దు.

ఎట్ల ఆప్తవో ఏమో...

అరే ఈ ఆడోల్లు మనిషి రక్తం రుజ్జూసిన ఆడపులుల్లెక్క గొడ్తున్నరయ్యా.

ఎన్నడన్న ఇంట్లనయిన ఆడిదాన్నిట్ల జూసినమా? ఆడోల్లందరూ ఈదుల్ల బడిరి. బూతులు తిట్టవట్టిరి. మగోల్లని చూసిడ్డి లేదు. డబ్బున్నోడు లేనోడని లెక్కలేదు. మొన్న పేపర్ల చదివినంగదా... శ్రీశైలంల సియంనే నిలదీశిరట.

సీ- సీ యివ్వ- కాలం.

ఎస్సెయ్ సాబ్- నేనొక్కటే చెప్తన్న. నా వక్కని ముచ్చట కాదు. ఈ వూర్ల మీటింగెట్టుకుంటే యిగ ఈ వూరితోని అది పోదు. ఈడ పుట్టిన మంట ఈ వూరిని, ఈ తాలుకాని, ఈ జిల్లాని నుతమండించి మసిజేస్తది.

మొత్తం జిల్లాల నీకు సారా సుక్క పుట్టకుంట చేస్తది.

ఏలమంది బతుకుతున్న యాపారం.

వూరినుంచి రాజధాని దంక లక్షల రూపాలు చేతులు మారుతున్న యాపారం.




పూరా లుక్సాన. యాదుంచుకో-

ఎట్ల జెయ్యాల్నో... జెయ్యి.

కావాలంటే సెప్పు- మందిని బంపుత.

నీకేం గావాల్నో నన్నడుగు... నాక్కావల్సింది ఒక్కటే ఈ వూర్ల మీటింగు జరగొద్దు, బస్''

సారా కాంట్రాక్టరు చెప్తున్న ప్రతిదానికీ అవు నవునన్నట్లు తలూపుతున్న జిల్లా నాయకుడు...

''ఎస్సయ్ మనోడే! మనం ఏం జెప్తె గదే జేస్తడు తియ్...

అరే... ఒక్క తానుంటున్నం. ఒకనికొకడు అంత మాత్రం 'ఎల్ప్' జేసుకోకుంట నడుస్తదా.

జేస్తడు తియ్... మన గురించి జేస్తడా? గవరమెంటు భీ మీటింగు జరగొద్దనే అంటున్నది గద. గవరమెంటు సారా అమ్ముకోమని లైసెంసిస్తే అమ్మొద్దననీకి ఈ ఆడిముండలెవరయ్యా!

అఁ- నీ మగడు తాగుతుండు. యింట్ల పైసలిస్తలేడు. మంచిదమ్మ. నీ మగనికి జెప్పుకో. నీ మగన్ని 'అజీర్' తిట్లు తిట్టు. మగన్ని గొట్టి మగసాలకెక్కినట్టు యిదేందిరో- సారా దుక్నంలమీద వడుడు. మంచిగ తాగే సారాని పారవోసుడు. గవరమెంటునే తిట్టుడు.

అదంత తప్పుగదా! ఏమంటున్న యిస్పెసాబు'' అని జబర్దస్తీగా ప్రశ్నించాడు.

''ఔను సార్- నాకు అర్థరొచ్చింది సార్- ఈ మీటింగుని జరగనిచ్చేది లేదు''

''మల్లింకేంది... లే''

అని చేతులు కలుపుకున్నారు ముగ్గురూ.

ఆ చేతులు యిప్పుడే కలవలా-

ఎన్నేళ్ళనుంచో ఆ చేతులు అలా కలుస్తూనే వున్నాయి. ఆ చేతుల్లోంచి డబ్బు మారుతూనే వుంది. అధికార దుర్వినియోగం లాగే-

ఎస్సయ్ వూర్లో పెద్దలనబడే వారిని కలిశాడు. అందరూ సహకరిస్తామన్నారు.

అయితే వూరి పెద్దలకి ఈ మీటింగు జరిగితే రాబోయే ప్రమాదం గురించి అవగాహన వున్నట్టు లేదు.

అఁ- ఆడోల్లు. పైనకి టికాన లేనోల్లు, మాల మాదిగలు. మీటింగు బెట్టి ఏం జేస్తరయ్యా-

అల్లమాట ఎవరింటరు? అసలాల్లకి మాటా డొస్తదా? అన్నట్టున్నారు.

ఎస్సయ్ రాగల ప్రమాదం గురించి, వేరేచోట్ల వచ్చిన ప్రమాదం గురించీ వర్ణించి వర్ణించి చెప్పిన మీదటవాళ్ళలో వాళ్ళు ముసిముసి నవ్వులు నవ్వుకుంట ''మంచిది. మీకేం గావాల్నో జెప్పు'' అని పూర్తి సహకారం యిస్తామన్నారు.

మీటింగు ఏర్పాటు చేస్తున్న దెవరో తెలుసుకుని వాళ్లల్లోకెల్లి బెదిరించాలని ఎస్సై చెప్పాడు.

''గట్లనే చెబ్దం తియ్'' అన్నారే గాని వాళ్ళకు నవ్వుగా వుంది. పైగా వాళ్ళు రోజూ చూస్తున్న ఆ ఆడవాళ్ళేదో పొడిచేస్తారంటే... వాళ్ళని చూసి ఎస్సయ్ లాంటి వాళ్ళు దగ్గర్నించి జడుసుకుచస్తున్నారంటే నవ్వుగా వుంది.

మీటింగు కోసం పర్మిషన్ అడుగుతూ కొందరాడవాళ్ళు వచ్చారు. ఆ వూరివాళ్లు కాదు.

సవాలక్ష ప్రశ్నలేసి దేనికీ వాళ్ళు లొంగకపోయేసరికి పర్మిషన్ నిరాకరించాడు యస్సయ్.

మాకు ముందే తెలుసు. పర్మిషన్ లేకపోయినా మీటింగు జరుగుతుంది. అక్కడ గొడవలేమన్నా అయితే మాత్రం బాధ్యత పూర్తిగా మీదే. గుర్తుంచుకోండి అని చెప్పి వెళ్ళారు.

వాళ్ళల్లో ఒకమ్మాయి... పద్దెనిమిదేళ్ళుంటాయేమో వెనక్కి తిరిగి ఎస్సయ్‌ని చూస్తూ...

''మీరెలాగూ వస్తారనుకోండి. అయినా పిలవటం మా బాధ్యత గాబట్టి పిలుస్తున్నాను. మీరూ మా మీటింగుకి రండి. మా బాధలన్నీ వినండి. మీరు మనుషులయితే మీకో తల్లీ చెల్లీ వుంటే స్త్రీల సమస్యలేమిటో అర్థమవుతాయి రండి'' అని చెప్పింది.

ఎస్సయ్ ఏం చెయ్యాలో తెలియక పళ్ళు నూరుకున్నాడు.

చివరికి పర్మిషన్ లేకుండానే మీటింగు జరుపుకోటానికి అన్ని సన్నాహాలూ పూర్తిచేసుకున్నారని తెలిసే ఎస్సయ్ రెండు జీపులతో ముప్పయిమంది పోలీసులతో, లాఠీలతో తరలి





వచ్చాడు. తను తుపాకీని నడుముకు బిగించుకున్నాడు. సాయంత్రం నాలుగు గంటల నుంచే గొడవ మొదలైంది. పొరుగూళ్ళనుంచి ఆడవాళ్ళు ట్రాక్టర్లమీదా బళ్ళమీద వస్తున్నారు. కొందరు నడిచి వచ్చారు.

అంతా కలిసి ఐదారొందలమంది దళిత స్త్రీలు పోగయ్యారు.

ఆ సంఖ్యను చూసి కాస్త ఆందోళన పడ్డాడు ఎస్సయ్. ఎంత చెప్పినా వినిపించుకునే వారెవరూ లేరు.

ఈ పెల్లాంటి మాటలతో పొడుస్తున్నారు.

"లైసెన్సు వున్న పాపుల్లో అమ్ముతారు. అమ్మ గూడదనే హక్కుమీకు లేదు. సర్కారు సారా అమ్మ మంటుంది. అమ్ముతున్నారు. సర్కారు చెయ్యమన్న పని చెయ్యక తప్పుతుందా" అన్న వాదనతో వాళ్ళను ఒప్పించాలని చూశాడు.

"సర్కారు శానా పన్లు చెయ్యిమంటుంది. జేస్తున్నరా? రేషన్ల బియ్యం పూరా యిస్తున్నరా? బావులు తవ్వనీకి పైకం యిస్తున్నరా. సారా మట్టుకి అమ్ముతున్నరు మేం అమ్మనియ్యం"

అనే వాదనతో ప్రభుత్వ పథకాలన్నీ ఎట్లా అమలుజరగకుండా మట్టిగొట్టుకుపోతున్నాయో ఉదాహరణ పూర్వకంగా వివరించి సారా మాత్రం ఎందుకు సజావుగా సాగుతోంది- మా పైసలు గుంజుకోటానికే గదా అని ఎస్సెయ్‌ని గుక్క తిప్పుకోనివ్వకుండా వాదించారు.

"మీరు మీ మగాళ్ళని తాగొద్దని చెప్పండి" అంటూ మరో స్టాండర్డ్ వాదన తెచ్చాడు ఎస్సయ్.

"సెప్తే యింటరా? దుక్నం కుల్ల వుంటె బెల్లం దిక్కు వుర్కే ఈగల్లెక్క వుర్కుతరు"

"మరి మీ మగాళ్ళనే మీరు అదుపులో పెట్టుకోలేనప్పుడు ప్రపంచాన్ని ఎట్లా అదుపులో పెడతారు? అమ్మేవాళ్ళు మీమాట ఎందుకు వింటారు" అని వెక్కిరించబోయాడు ఎస్సయ్.

"అయ్యా- ఇప్పుడు పెపంచంమీదకు వచ్చి పెత్తనాలు జేస్తున్న మగాల్లంత పెల్లాలను అదుపులో వుంచి పెత్తనం జెయ్యనీకి వస్తున్నరా-

మా మగాల్లతోని మేం జెప్పుకుంటమో లేదో- ఎట్ల జేస్కుంటమో నీకు ఫికరులేదు.

అయ్యన్ని మా సంసారపు గొడవలు.

పెపంచం అంతా బాగుండాలని సారా ఒద్దంటున్నం. మేం సారా ఒద్దని తిర్గబట్టిన్నట్టు నీ పెల్లం తిర్గబడితే నువ్వూరుకుంటవా? ఊర్కోవు. తాగెల్లి తంతవు. మరి నీ పెల్లాం బిడ్డల మంచికోసం గూడ మేమీ సారాబందు పెట్టాలంటున్నం"

అని ఎదురు సమాధానం చెప్పారు. ఎగతాళిగా నవ్వారు.

ఎస్సయ్‌కి ఒళ్ళుమండిపోతోంది.

ఈ ఆడోళ్ళకింత లాజిక్కు ఎలా ఒంటబట్టిందో అర్థం కావటం లేదతనికి.

సామరస్యంగా వచ్చినపని పూర్తి చేసుకుని వెళ్ళగలనా లేదా అనే అనుమానం క్షణక్షణానికీ పెరిగిపోతోంది.

ఏం చెయ్యాలో అర్థం కావటంలేదు.

లాఠీ చార్జీయే ఆఖరి ఆయుధం అనుకున్నాడు.

ఊరిపెద్దలు మీటింగు దిక్కుకే రాలేదు. వాళ్ళకు దళితుల ఓట్లు కావాలి. పంచాయతీ ఎన్నికల్లో గెలవాలి. ఇప్పుడీ మీటింగు ఆపిన వాళ్ళకు వాళ్లు ఓట్లెయ్యరు ఎందుకొచ్చిన గొడవ. కాసేపు చూసీ చూడనట్లు కళ్లు మూసుకుంటే సరి- అని రెండు ప్రధాన రాజకీయ పార్టీలకు చెందిన గ్రామపెద్దలు ఆలోచించారు. ఎస్సయ్ అదేమిటని కోపంగా అడిగితే మాలపల్లిలోగదా మీటింగు జరుగుతోంది. మేం అక్కడికొచ్చి మీటింగు ఆపండంటే వాళ్ళకీ మాకూ తగాదాలవుతాయి. ఒక వూళ్లో వుండేవాళ్ళం. అది మాకు మంచిదిగాదు. మీరు చెప్పినా విననివాళ్ళు మేం చెబితే వింటారా? ఏదో జరిగిపోనివ్వండి. మీరు ఆపుతున్నకొద్దీ వాళ్ళ పట్టుదల పెరిగిపోతుంది. ఒక్క మీటింగు జరిగితే ఏమవుతుందీ"-

ఇట్లా మాట్లాడటం మొదలుపెట్టారు.

సారాకంట్రాక్టరు బాల్‌రెడ్డేమో

"ఆ ఒక్క మీటింగూ జరిగిందా ఇక వాళ్ళ ను పట్టలేం" అంటున్నాడు.

అతనంటున్నాడనే కాదు. ఇంత అధికారం, ఇన్ని లారీలు, పోలీసులు, తుపాకులు. అన్నీ చేతుల్లో వుండి ఆడవాళ్ళ మాట నెగ్గనివ్వడమా అన్న అహంకారం ఎస్సయ్‌లో తన్నుకొచ్చింది. దాంతో నడుంమీది తుపాకీ చేతిలో కొచ్చింది. మాటిమాటికీ చేతిలో తుపాకీని అటూ ఇటూ తిప్పుతున్నాడు.

అది చూసైనా బెదురుతారేమోనని అతని ఆశ.

బెదరటం అలావుంచి ఎవరూ దానిని ఖాత రు చేసినట్లుగా కూడా లేదు.

అతను ఏం చెప్పినా ఎవరూ వినటంలేదు. ఒక మాటకు పదిమాటలు బదులిస్తున్నారు. సారాయి తాగినవాళ్ళను పట్టుకోవాల్సిన పోలీసులు సారాయి తాగొద్దంటున్న వాళ్ళనెందుకు పట్టుకుంటున్నారని అడుగుతున్నారు.

ఇది ప్రభుత్వ సారాయి. దీనిని అమ్మటం, కొనటం, తాగటం నేరంకాదు. దీనిని ఎంత ఎక్కువకొని తాగితే అంత ఆదాయం సర్కారుకి. సర్కారు పనిజెయ్యాలా, ఒద్దా. పనిచెయ్యాలంటే డబ్బు కావాలిగదా- డబ్బు కావాలంటే సారా అమ్మాలి. అని పోలీసులు మొత్తుకుంటున్నారు.

ఆ మాటల్లకు ఆడవాళ్ళు మండిపడుతున్నారు.

సర్కారోడికి అమ్ముకోటానికి సారాయి పొట్లాలు తప్ప ఇంకేం దొరకలేదా? అని తిట్టిపోస్తున్నారు.

ఎస్సయికి సహనం పోతోంది. సామరస్యధోరణి ఒదిలి బెదిరింపులలోకీ, తిట్లలోకీ దిగాడు.

పోలీసులు కూడా ఎస్సయ్‌తో గొంతు కలిపి ఆడవాళ్ళను తిట్టడం మొదలుపెట్టారు.

సరిగ్గా ఆ సమయంలోనే జీపు అక్కడికొచ్చి ఆగింది. కృష్ణమూర్తి, కాంతారావు, రామారావు, సుధ, జయ, యాదయ్య, జయరావు అందరూ హడావుడిగా జీపు దిగారు. పోలీసుల తిట్లకు ఆడవాళ్ళ హృదయాల్లో అగ్గి రాజుకుంది. ఆ అగ్గి తిట్లరూపంలో బైటికి రావటం మొదలయ్యేసరికి అందరూ నిర్ఘాంతపోయారు.

పోలీసుల నోళ్లు పడిపోయాయి.

నగరంనుంచి వచ్చిన మేధావులు నోళ్లు తెరిచారు.

ఆడవాళ్ళ నోళ్లనుంచి పిడుగులు కురుస్తున్నాయి.

శత్రుసంహారానికి తూటాలే అక్కర్లేదనిపిస్తున్నాయి.

మగవాళ్ళను తిట్టటానికి ఏ తిట్లూ లేవే- ఏం తిడదామన్నా అన్నీ ఆడవాళ్ళనవమానించే తిట్లే అని కోపం వచ్చినపుడల్లా లేని తిట్లకోసం తిట్టుకునే జయకు ఆ తిట్లు పరమానందంగా ఉన్నాయి.

సుధ ఆ మాటలు వినలేక చెవులు మూసుకుంది.

"ఛాయిసెస్ట్ ఎబ్యూసెస్" అని నవ్వారు రామారావుగారు.

కృష్ణమూర్తీ కాంతారావు పోలీసులను చూసి నవ్వుకుంటున్నారు. జయరావు, యాదయ్యా ఆ ఆడవాళ్ళ వంక గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు.

పోలీసులు తమ తిట్లు ఆడవాళ్ళ తిట్లకు దీటు కావనీ, వాళ్ళనీ మార్గంలో జయించలేమనీ నిర్ధారించుకున్నారు. లాఠీచార్జికి పర్మిషన్ ఇప్పించమని ఎస్సయ్ వంక చూశారు. ఎస్సయ్ అప్పటికే ఆగ్రహోదగ్రుడై వున్నాడు.

వెంటనే లాఠీచార్జీకి ఆర్డరు జారీచేశాడు.

పోలీసులు లాఠీలతో ఆడవాళ్ళమీద పడ్డారు.

ముప్పయిమంది పోలీసులు లాఠీలతో అందిన ఆడవాళ్లను అందినట్లు కొట్టటం మొదలెట్టారు.

పెద్ద గడబిడ మొదలైంది. అరుపులు, కేకలూ, ఆర్తనాదాలూ, తొక్కిసలాట-

ఐదు నిమిషాలసేపు లాఠీలతో స్వైరవిహారం చేశారు పోలీసులు.

ఆ తర్వాత కూడా చేసేవారే. చెయ్యాలనే వాళ్ళ ఉద్దేశం. కానీ వాళ్ళ చేతుల్లో లాఠీలు లేవు.

తమాషాగా లాఠీలన్నీ ఆడవాళ్ళ చేతుల్లోకి





వెళ్ళాయి.

పోలీసులు తమ లాఠీల బారినుంచి తమను తాము రక్షించుకోవాల్సినవారై అటూ ఇటూ పరిగెత్తుతున్నారు. ఈ పరిస్థితి ఎస్సయ్‌కి అర్థమయ్యేసరికి పదిమంది పోలీసులు ఆడవాళ్ళ చేతుల్లో పడిపోయారు.

ఇక లాభంలేదు. ఎస్సయ్ ఏ మాత్రం ఈ ఆడవాళ్ళమీద కనికరం చూపించదల్చుకోలేదు. తన పోలీసుల్ని రక్షించుకోలేకపోతే తనెందుకు?

తుపాకీ పట్టుకొన్న చెయ్యి పైకెత్తి గాలిలోకి ఒకసారి కాల్చాడు.

అందరూ ఉలిక్కిపడి అటు చూశారు.

రామారావుగారు, కృష్ణమూర్తి, జయరావు, యాదయ్యా ఒక్కసారిగా ఎస్సయ్‌వైపు పరిగెత్తబోయారు.

కాల్పులు జరిగితే ఈ ఆడవాళ్లు అన్యాయంగా చచ్చిపోతారే అన్న వూహతో కంగారుగా అడ్డుగా వున్న ఆడవాళ్ళను తోసుకుంటూ ఎస్సయ్‌వైపు వెళ్తున్నారు.

ఎస్సయ్ చెయ్యి ఇంకా కిందికి దిగలేదు.

ఆ గుంపునంతా ఒకసారి చూసి ఎటువైపు ఎవరిదిక్కున కాలుద్దామా అని నిర్ణయం చేసుకుంటున్నాడు.

'ఇన్‌స్పెక్టర్- స్టాపిట్' రామారావుగారి కేక పూర్తిగా బైటికి రానేలేదు.

అంతలోనే ఒక లాఠీ బలంగా ఎగురుతూ వచ్చి ఎస్సెయ్ చేతిలోని తుపాకీని తాకింది.

తుపాకీ కిందపడిపోయింది.

వంగి అందుకోబోయిన ఎస్సయ్‌ని పదిమంది ఆడవాళ్లు పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

కిందపడిన తుపాకీ కోసం నలుగురైదుగురు స్త్రీలు పోటీపడి చివరికి ఒకరు చేజిక్కించుకున్నారు.

"జాగ్రత్త- పేలుతుంది" అంటూ క్షణాల్లో ఆ తుపాకీని మాయం చేసేశారు.

వందమంది ఆడవాళ్లు ఆకలిగొన్న పులుల్లాగా ఎస్సయ్ మీదకు దూకారు.

ఐదు నిమిషాలపాటు ఏం జరుగుతోందో ఎవరికీ తెలియలేదు. ఎస్సయ్ అతికష్టంమీద ఆ గుంపునుంచి బైటికొచ్చి పరిగెత్తాడు. ఎటు పరుగెత్తుతున్నాడో కూడా అర్థం కాకుండా అటూ ఇటూ పరుగులు తీస్తున్నాడు.

యూనిఫారం చిరిగిపోయింది. ముఖమంతా ఎర్రగా కందగడ్డలా వుంది. విపరీతంగా రొప్పుతున్నాడు. వెర్రిభయంతో పరిగెత్తుతున్నాడు.

ఆడవాళ్ళు అతని వెంటబడి పరిగెత్తుతున్నారు.

వాళ్ళు తననివాళ ఒదలరనే భయం పట్టుకుని ఒణికిపోతున్నాడు. అలాగే తెగించి ప్రాణాలకోసం పరిగెత్తుతూ మాలపల్లినుంచి ఊళ్ళోకి వచ్చిపడ్డాడు.

ఊళ్ళో పెద్దలకు అతన్ని చూస్తూనే ఏం జరిగిందో అర్థం చేసుకున్నారు.

ఐతే అతనికి ఆశ్రయం ఇవ్వటానికి ఎవరూ సాహసించలేదు. కోపంతో మండిపడుతున్న గుంపు తమ ఇళ్ళమీదపడి ధ్వంసంచేస్తే-

వాతావరణం చూస్తే అపరకాళికల్లా వున్న ఆ ఆడవాళ్ళు రక్తం కళ్ళజూడంది శాంతించేలాలేరు.

ఊరిపెద్ద మల్లారెడ్డికి ఒక ఆలోచన మెరుపులా మెరిసింది.

"శివాలయంలోకి పరిగెత్తండి. గర్భగుళ్ళో దాక్కోండి" అని అరిచాడు ఎస్సయ్‌ని చూస్తూ.

"ఎటు? ఎటు శివాలయం? ఎక్కడ?" రొప్పుతూ ఏడుస్తూ అడిగాడు ఎస్సయ్.

దారి చూపిస్తూ తనూ పరిగెత్తాడు మల్లారెడ్డి.

ఎస్సయ్ అంత చలికాలంలోనూ చెమటలు కక్కుకుంటూ శివాలయంలోకి దూరాడు.

పూజారి అప్పుడే దీపారాధన చేశాడు. పచ్చగన్నేరు పూలతో, ఆకుపచ్చని బిల్వపత్రాలతో అలంకరించిన శివలింగం దీపపు కాంతిలో చిత్రంగా వుంది.

ఆ చిత్రాన్ని మరీ విచిత్రం చేస్తూ శివలింగం వెనకాల గజగజలాడుతూ నిలబడ్డాడు.

గర్భగుళ్ళోకి, శివలింగం వెనక్కు హఠాత్తుగా, ఒచ్చివడ్డ ఎస్సయ్‌నీ, అతని ఆకారాన్నీ చూసి గజగజ ఒణుకుతున్నాడు పూజారి.

నువ్వు బైటికి రావయ్యా పంతులూ- గర్భగుడి తలుపు లేసెయ్యి మాలోళ్ళను గుళ్ళోకి రానివ్వకు''

మల్లారెడ్డి కేకలేశాడు.

పూజారి గబగబా బైటికొచ్చి తలుపు గడియ పెట్టాడు.

అంతలో వచ్చిపడ్డారు ఆదిశక్తులు.

ఎస్సయ్‌ని బయటకు రమ్మని కేకలేశారు.

"మీరు ముందు బైటికి నడవండి. గుళ్ళోకి వచ్చి గుడిని మీ ఇష్టం వచ్చినట్లు మైల పడేస్తారా? నడవండి బైటికి'' ఆలయాన్ని మైల పడెయ్యటమనే మాట ఆ ఆడవాళ్ళ మీద కాస్త ప్రభావం చూపింది.

వెనక్కుతగ్గి నెమ్మదిగా గుడిబైటికి వెళ్ళారు. కొందరు దణ్ణం పెట్టుకున్నారు. మరికొందరు చెంపలేసుకున్నారు. గర్భగుడిలోకి తాము ప్రవేశించరాదనే ఆలోచనవాళ్ళందరిలోనూ వుంది.

ఎస్సయ్ తప్పించుకునేసరికి కాస్త ఆవేశం తగ్గి చల్లబడ్డారు. మొత్తానికి శివుడు ఆదిశక్తుల బారినుంచి ఎస్సయ్‌ని కాపాడి తన లింగప్రభావాన్ని కాపాడుకున్నాడు. మతం రాజ్యాన్ని రక్షించే తన కర్తవ్యాన్ని మరోసారి జయప్రదంగా నిర్వహించగలిగింది.

మతానికీ రాజ్యానికీ వున్న గాఢానుబంధాన్నీ ఆ రెండూ కలిసి ఆ పాశంతో తమ మెడకు బిగించే వుచ్చునీ అర్థం చేసుకోలేని అమాయక స్త్రీలు వెనక్కుమళ్ళారు.

ఊరిపెద్ద అదను చూసి-

"ఎస్సయ్ ఇంకా మీతాకి రాడు. మీరు మీటింగు పెట్టుకోర్రి. పోర్రి. ఎస్సయ్ ఆడి పాపాన ఆడే పోతడు. మీ మీటింగులు మీరు చూసుకోర్రి''

అని వాళ్ళను మాలపల్లికి తరిమాడు.

ఈ ప్రజాస్వామ్యయుగంలో రాజ్యం తనకెంత అవసరమో, ప్రజల్ని మాయ మాటలతో బుజ్జగించటం కూడా అంతే అవసరమని తెలిసిన పాలకవర్గ ప్రతినిధి మల్లారెడ్డి. అతను తన పాత్ర తాను సమర్థవంతంగా పోషించాడు. ఆడవాళ్ళు విజయగర్వంతో మాలపల్లికి తిరిగొచ్చారు. సారాబందు చెయ్యాలని తీర్మానించుకునేందుకు ఒకచోట చేరారు.

ఆ స్త్రీల సాహసాన్నీ, వారి ధర్మావేశాన్నీ తమ కోర్కె న్యాయమైందనే భావన వారికిచ్చిన బలాన్నీ చూస్తున్న నగరవాసవు మేధావులు ఆ స్త్రీలకు జేజేలు చెబుతూ జీపెక్కారు.



రాత్రి ఏడుగంటలు కావొస్తోంది. జీపు వేగంగా హైదరాబాదు వెళ్తోంది. అందరి మనసులూ ఉద్విగ్నంగా వున్నాయి. తామొక మహత్తరమైన సంఘటనను చూసిన అనుభూతి అందరినీ ఆవరించివుంది.

ఉదయంనుంచీ తాము చూస్తున్న జీవితానికి పరాకాష్టగా వుందీ చివరి ఘట్టం.

హఠాత్తుగా రామారావుగారు ఎవరూ ఏమీ ప్రశ్నించకుండానే, ఎవరూ ఏమీ అడగకుండానే మాట్లాడటం మొదలుపెట్టారు.

"పొద్దున్న మనందరం వేసుకున్న ప్రశ్న వుందే- ఈ దేశాన్ని రక్షించేవారే లేరా అని- ఈ దేశం అప్పుల్లోంచి బైటపడే మార్గమే లేదా అని-

ఆ ప్రశ్నకు సమాధానం ఇక్కడుంది.

ఈ పల్లెల్లో వుంది. పల్లెల్లో వున్న కూలీలూ, రైతులూ, స్త్రీలూ, దళితులూ వీళ్ళదగ్గరుంది సమాధానం.

వీళ్ళు మాత్రమే దేశాన్ని రక్షించగలరు.

తమ రక్తం, చెమట, చివరకు ప్రాణాలు సైతం ధారపోసి దేశాన్ని రక్షించగలరు.





మనవంటి నగరవాసపు పరాన్నజీవులకు దేశాన్ని తాకట్టు పెట్టటం తప్ప రక్షించుకోవటం తెలియదు.

మనల్ని మనం రక్షించుకోవటమే మనకు తెలియదు. మనమే పెంచి పోషిస్తున్న సంస్కృతి మనల్ని కాటువేస్తుంటే ఒక్క కేకైనా వెయ్యకుండా నిశ్శబ్దంగా చచ్చిపోగలం.

మనకు అంతా కావాలి. తీసుకోవటం తప్ప ఇవ్వటం తెలియదు.

ఈ పల్లెల్లో దళితులున్నారే- స్త్రీలున్నారే- వాళ్ళకు ఇవ్వటం తెలుసు.

ఇన్నాళ్ళూ వాళ్ళకు తమకున్నదంతా ఇవ్వటమే తెలుసు. తమకు రావాల్సింది తీసుకోవటం తెలియదు.

ఇవాళ వాళ్ళు తమకు రావాల్సింది తాము తీసుకోవాలని గ్రహించారు.

వాళ్ళు దానికోసం, తమ హక్కులకోసం, తమ మనుగడకోసం పోరాటం మొదలుపెడితే యిక దేశానికి భయంలేదు.

దేశమంటే ఈ మనుషులే-

ఈ మనుషులకు దక్కాల్సింది దక్కితే దేశం బాగున్నట్లే. నాకు ఇప్పుడు మనదేశం అభివృద్ధివైపుకు నడవగలదనే నమ్మకం గట్టిగా కలుగుతోంది.

అభివృద్ధి అంటే ప్రాజెక్టులూ, ఫ్యాక్టరీలూ, రవాణా కమ్యూనికేషన్ సౌకర్యాలే కాదయ్యా- పీడితుల చైతన్యమే దేశాభివృద్ధి.

ఇవాళ ఈ స్త్రీలలో మనం చూసిన చైతన్యమే దేశాభివృద్ధికి కొలమానం.

ఆ అభివృద్ధి మనదేశంలో వున్నంతకాలం మనదేశాన్ని గురించి మనం దిగులుపడనక్కరలేదు''

రామారావుగారు ఆవేశంతో మరి మాట్లాడలేకపోయారు.

''మరి మన సంగతేమిటి? మనమేం చెయ్యలేమా? మన పాత్రేమీ లేదా?'' యాదయ్య అడిగాడు.

అతనికి తనేం చెయ్యటంలేదని తనమీద తనకే కోపం. ఒకసారి తనేం చెయ్యగలిగింది లేదనీ, తన జీవితం వ్యర్థమనీ సినిసిజంలో పడుతుంటాడు.

మంచి మంచి వ్యాసాలు రాసి కూడా 'ఎవరు ప్రచురిస్తారు? ఎవరు చదువుతారు? ఎవరు మారతారు?' అంటూ చింపేస్తాడు.

''మనం''- నవ్వారు రామారావుగారు.

''మనం చేశాంకదా- మన జీవులో ఆడవాళ్ళను మీటింగుకి తీసికెళ్లాం. రేపు వాళ్ళమీద కేసులు పెడితే పోలీసులకు వ్యతిరేకంగా సాక్ష్యం ఇస్తాం. ప్రస్తుతానికిది చాలు. ఈ మాత్రం చెయ్యగలిగినా చాలు''

ఆలోచనగా అందరివంకా చూశారు. అందరి కళ్ళలోనూ ఏదో కాంతి. తాము కూడా ఎంత చిన్న పనైనాసరే చేశాంకదా అనే తృప్తి.

ఉదయం వచ్చేప్పటికంటే ఇప్పుడు వారి జీవితాలలో ఒక కొత్తదనం వుంది. వాళ్ళ ఉనికికి ఇన్నాళ్ళకు ఇవాళ ఒక అర్థం వున్నట్లనిపించింది అందరికీ- ఆ తృప్తి, ఆ సంతోషం వాళ్ళకు కొత్తగా వున్నా ఎంతో బాగున్నాయి.

ఒక్కరోజు పల్లెలో వుంటేనే ఇలా జరిగిందే మనకు. మన శలవరోజులన్నీ పల్లెల్లో గడిపితే- మేధావులంతా, విద్యాధికులంతా పల్లెలకు వెళ్ళి కొన్ని రోజులు గడిపితే? ఎవరు గడుపుతారు? ఎవరూ వెళ్లరు. పల్లెల్లో ఉద్యోగాలు చెయ్యలేక పట్టణాలకు పారిపోయే విద్యాధికులే అధికం. ఐనా ఈ విద్యాధికుల ప్రమేయం లేకుండానే పల్లెలు తమ బాగు తాము చూసుకుంటాయేమో-

వీళ్ళు తమ నగరాలను క్షాళనం చేస్తే చాలదూ? అదీ చెయ్యరు. చేస్తే వారికే మంచిదని కూడా తెలియని అజ్ఞానులు. ఆ పూట సుఖంకోసం ఎంత ప్రమాదమైనా దేశానికి తెచ్చిపెట్టగల ఘనులు.

రేవటి సంగతి అంటే తమ సంతానంకోసం కాస్త డబ్బు దాచటమే అనుకునేంత హ్రస్వదృష్టి వారిది. యాదయ్య, జయ ఇద్దరూ ఒకేలా ఆలోచిస్తున్నారు. సుధకు నగరం దగ్గరవుతున్నకొద్దీ శ్రీకాంత్‌నూ, లయనూ చూడాలనే ఆరాటం పెరిగిపోతోంది.

వాళ్ళపట్ల తను చాలా కఠినంగా వున్నానని ఆమె కనిపించటం మొదలైన దగ్గర్నుంచి వాళ్ళను కలుసుకోవాలని తహతహలాడుతోంది.



ఆమె చేతిలో వచ్చగులాబీలు కొద్దిగా వాడినా గ్రామంలో స్త్రీలకు మల్లే స్వచ్ఛంగా నవ్వుతున్నాయి.

ఆ గులాబీలను మెత్తగా గుండెలకానించు కుంది సుధ. ఎనిమిదిగంటలకు జీపు హైదరాబాదు చేరింది. అందరినీ ఎవరి ఇంటి దగ్గర వాళ్ళను దింపాలని అనుకున్నారు.

''మా ఇంటికి రారాదూ?'' సుధ అడిగింది.

''ఒద్దు- ఇవాళ ఇంటికి వస్తానని చెప్పాను. కంగారుపడతారు'' జయ మెల్లిగా చెప్పింది.

ఇవాళ సుధను ఒంటరిగా ఒదిలేయాలని జయ అనుకుంది. వచ్చగులాబీళను ప్రేమగా హృదయానికి హత్తుకున్న సుధ లయను కూడా అలాగే దగ్గరకు తీసుకుంటుందని జయకు నమ్మకంగా వుంది. ఆ సన్నివేశంలో తను అడ్డుగా వుండటం ఆమెకు ఇష్టంగాలేదు.

"అమ్మ యింకా రాదేం నాన్నా!" లయ సత్తెమ్మతో ఆటలు ఆడుతూ అరగంటకోసారి లోపలికి వచ్చి శ్రీకాంత్‌ని ఈ ప్రశ్న అడుగుతూనే వుంది సాయంత్రం ఆరుగంటలనుంచీ.

శ్రీకాంత్ ఏదో సమాధానం చెబుతూనే ఉన్నాడు. "వస్తుందులేరా! అందరూ కలిసి వెళ్ళారుగా. వచ్చేస్తారు. నువ్వు అన్నం తినరాదూ?"

"ఊహూ! అమ్మను రానీ" లయ మళ్ళీ వరండాలోకి పరిగెత్తింది.

సత్తెమ్మతో కలిసి అష్టాచెమ్మా ఆడుతోంది.

"సత్తెమ్మా! నీకాకలవుతోందా? వెళ్ళిపోతావా?" సత్తెమ్మ ఆకలిసంగతి గుర్తొచ్చి అడిగింది.

"అమ్మగారొచ్చాక వెళ్తా" సత్తెమ్మ గవ్వలు గిలకరించింది. అంతలో గేటుముందు జీపు ఆగి సుధని దించి వెళ్ళిపోయింది.

"నాన్నా! అమ్మొచ్చింది" లయ తండ్రి కోసం లోపలికి పరిగెత్తింది.

సత్తెమ్మ ఆట ఒదిలి కంగారుగా వెళ్ళిపోటానికి గేటువైపు నడిచింది.

తను యింతసేపు లయతో ఆడుకోవటం సుధమ్మగారికి నచ్చదని సత్తెమ్మకు తెలుసు.

అమ్మగారిని తప్పించుకుని వెళ్ళటం వీలుకాక ఎదురుపడింది.

అమ్మగారికి సాయంత్రంగానీ రాత్రిగానీ ఎదురుపడితే చెయ్యి చాపటం సత్తెమ్మకు అలవాటు. దానిప్రకారం సత్తెమ్మ తన కూలి రెండురూపాయలకోసం చేయిసాచింది.

సుధ పర్సులోంచి రెండు రూపాయలు తీస్తుంటే వచ్చగులాబీలు లోపల్నించి నవ్వాయి. సుధ రెండు రూపాయలు సత్తెమ్మ చేతిలో పెట్టింది. సత్తెమ్మ రెండడుగులు వేసింది.

"సత్తెమ్మా!" ఆగింది భయంతో.

"నీకు ఆ గులాబీ పూలు కావాలా?"

కాషాయిరంగు గులాబీలవంక చూపుతూ ప్రేమగా అడిగింది. భయంతో సందేహంతో అనుమానంతో సత్తెమ్మ తలదించుకుంది.

"ఇస్తానుండు"

సుధ సొలుగు గులాబీలు కోసి గుత్తిగా చేసి సత్తెమ్మవైపు చేయిసాచి "ఇదుగో తీసుకో... నీకే"

సత్తెమ్మ నమ్మలేకపోతోంది. ఆశ్చర్యంతో నోరు తెరిచింది. సత్తెమ్మ చేతిలో పువ్వులుంచుతుంటే సుధకు ఆనందంతో కళ్ళనీళ్ళొచ్చాయి.

మనసులో కల్మషాన్నంతా కడిగేస్తున్నట్లు చెంపలమీదకు కన్నీరు జారింది.

సత్తెమ్మ చేతిలో గులాబీలు నవ్వాయి. సత్తెమ్మా నవ్వింది. సుధ కూడా నవ్వి "వెళ్ళు. రేపట్నించీ రోజూ పూలు కోసుకో" అంది.

లయ అప్పుడే స్నానంచేసి బైటికొచ్చిన తండ్రిని తొందరపెట్టి హాల్లోకి తెచ్చేసరికి సుధ పూలు కోస్తోంది. లయ శ్రీకాంత్‌లు ఆశ్చర్యంగా చూస్తుండగానే అవి సత్తెమ్మకివ్వటం కనపడింది.

"నాన్నా!" అంది లయ ఆశ్చర్యంగా.

"ష్... మాట్లాడకు" అని లయను పక్కకు లాగి కుర్చీలో కూర్చోబెట్టి తను డైనింగ్‌టేబిల్ మీద గిన్నెలు అవసరం లేకున్నా సర్దటం మొదలుపెట్టాడు. సత్తెమ్మకు పువ్వులు యివ్వటం తామిద్దరం చూడటం సుధకు యిబ్బందేమో అనిపించి అట్లా చేశాడు. లయ ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుంది.

లోపలికి వచ్చిన తల్లిని అలాగే చూస్తుండిపోయింది. లయను చూడగానే సుధకు ప్రేమ ముంచుకొచ్చింది.

"లయా!" అని పిలిచింది. లయ ఒక్క ఉదుటున తల్లి కౌగిట్లో దూరిపోయింది.

"లయా! ఆరోజు కథ మధ్యలో ఆపేశాను. వినకుండా వెళ్ళిపోయావు. నీకు బాగోలేదన్నావు. గుర్తుందా?"

లయ గుర్తుందన్నట్లు తలూపింది.

"ఆ కథ యింకొంచమే వుంది. నీకు తప్పకుండా నచ్చుతుంది. చెప్పనిస్తావా?"

"చెప్పమ్మా" అంది లయ.









అక్కడే కింద కూర్చుని లయను ఒళ్ళో కూచోబెట్టుకుని శ్రీకాంత్‌ని ఆశ్చర్యంలో ముంచేస్తూ కథ చెప్పసాగింది సుధ.

"తనకు తామరపూవు లేదని రైతు కూతుకు ఏడుస్తూ బడినుంచి ఇంటికి వెళ్ళింది. తన తండ్రితో జరిగిందంతా చెప్పింది. కోమటాయన కూతురు తామరపువ్వుతో గర్వంగా తిరగటం, పంతులుగారు ఆమెను ఒళ్ళో కూచోబెట్టుకుని పాఠం చెప్పటం అదంతా చెప్పి ఏడ్చింది. రైతుకూతుర్ని సముదాయించి మర్నాడు తను మరో నలుగురితో కలిసి నది ఎగువకు వడవలమీద వెళ్ళి బుట్టలతో తామరపూలు తెచ్చాడు. అవి వూళ్ళో పిల్లలందరికీ పంచిపెట్టారు. పూలతోపాటు రైతు తామరవిత్తనాలు, దుంపలూ తెచ్చాడు. అవి వూళ్ళో చెరువుల్లో వేశారు. ఆ వూరికిక తామరపూల కరువులేదు. పిల్లలంతా సంతోషించారు"

సుధ కథ ముగించింది. లయ తల్లిమెడ చుట్టూ చేతులువేసి చెంపమీద ముద్దుపెట్టుకుంది.

"కథ చాలా బాగుందమ్మా! చాలా బాగుంది" సుధకు మళ్ళీ దుఃఖం వచ్చింది. దుఃఖాన్ని ఆపుతూ లేచింది.

శ్రీకాంత్ సుధ దగ్గరకొచ్చి "సుధా! అని పిల్చాడు.

సుధ ఆపుతున్న కన్నీళ్ళలోంచి నవ్వి లోపలికి వెళ్ళింది. వర్సులోంచి వచ్చగులాబీలను తీసి భద్రంగా దాచింది. శ్రీకాంత్ పట్టరాని సంతోషంతో లయను ఎత్తుకుని ముద్దాడాడు.



# 'విడాకులు'పై సమీక్షలు



సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఎ. జయలక్ష్మిరాజు నవల 'విడాకులు'పై పాఠకులనుండి అందిన సమీక్షలలో ఉత్తమంగా భావించిన ఆరింటిని ఈ దిగువ ప్రచురిస్తున్నాం.



## బాగుంది, కానీ...

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

మగవాళ్ళలో చాలామందికి భార్య ఉద్యోగం చెయ్యడం ఇష్టంలేకపోవటానికి గల కారణం వాళ్ళ ఇగో, సుపీరియారిటీ దెబ్బతింటాయనే దే! కాకపోతే చీరకట్టుకుని, పొందికగా ఏ టీచర్‌గానో చేస్తే కొంచెం సంతృప్తిగా ఉంటుంది. అలాంటిది తనతో సమానంగా కాకుండా మించిపోయేలా భార్య 'మగరాయుడు'లా యస్.ఐ. ఉద్యోగం చెయ్యడం రాఘవ లాంటి ఉపాధ్యాయుడికి నచ్చకపోవడం సహజమే.

కానీ కథలో రాఘవ కనకదుర్గల పెళ్ళి దగ్గర్నుంచీ జరిగిన సంఘటనలన్నీ అసహజంగా ఉన్నాయి. తను కోరుకున్న ఉద్యోగం చేస్తూ కూడా పెళ్ళి జరిగేవరకూ ఉద్యోగ విషయం దాచిపెట్టడం ఆమె చేస్తున్న ఉద్యోగానికి, స్వభావానికి విరుద్ధం. తరువాత విడాకులకోసం వారు జడ్జివద్దకు వెళ్ళినప్పుడు సహజంగా జడ్జి భార్యాభర్తలు విడిపోకూడదనీ, కలిసి ఉండాలనే చెప్పేందుకు ప్రయత్నిస్తారు! నిజమే కానీ ఈ నవలలోనివిధంగా వారికోసం ఒక ఇంటిని, ఆయాను ఏర్పాటు చేసి, ఏడాది తరువాత విడాకులు ఇస్తామనటం బహుశా ఈ కథలోనే సాధ్యం అవుతుందేమో! రాఘవకు పోలీసులపట్ల గల ఎలర్జీని పోగొట్టడానికి దారితీసిన సంఘటనలు కొంచెం వాస్తవంగా ఉండి, పోలీసుల సమస్యలను మన కళ్ళముందు ఉంచుతాయి. ఆ సమయంలోనే రాఘవ బలవంతంగా లొంగదీసుకుంటే దుర్గ మామూలు ఆడపిల్లలా మౌనంగా ఉండిపోయిందేకానీ ఒక ఎస్.ఐ.లా ప్రతిఘటించలేదు. ఈ కారణం ఆమె ఏ ఉద్యోగాన్నైతే వదులుకోకూడదని విడాకులకు కూడా సిద్ధపడిందో ఆ ఉద్యోగానికే మచ్చకాదా? కథలో ప్రధానలోపం ఇదేనేమో!

కథలో రాఘవ తన కూతుళ్ళకి చెప్పుకున్న ఫ్లాష్‌బ్యాక్ కనీసం ఇరవై ఏళ్ళక్రితంది. అయినా అందులో ఇప్పటి ఆప్కో ఎడ్వర్‌టైజ్‌మెంట్స్‌లాంటివి, డిస్కోశాంతి, వెంకటేష్, బ్రహ్మానందంవంటి ఇప్పటి నటీనటుల గురించి రాసి పాఠకులను అమాయకులకింద జమకట్టారు. అయితే 'విడాకులు' నవలను వాస్తవికతకోసం చూడకుండా ఒక హాస్యనవలగా చదివితే మొదటినుండి చివరిదాకా బాగుందనాల్సిందే.

-బొగ్గవరపు సూర్యపద్మావతి
కాకినాడ

## విమర్శాతీత నవల

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొంది సమీక్ష)*

భార్యాభర్తలమధ్య ఉండవలసిన అవగాహనా ప్రాముఖ్యతను విడాకులు నవల సరిగానే నిర్వచించింది. పెళ్లి కానంతవరకూ ఏదోవిధంగా కొడుకు పెళ్ళి చేసెయ్యాలని ఆలోచించే తల్లిదండ్రులు తీరా ఆ పెళ్ళయ్యాక కోడలిలో లోపాలెన్నుతూ బాధకు గురిచెయ్యడం ప్రతిచోటా జరిగేదే! అలాంటి వాతావరణంలో ఇక ఆ భార్యాభర్తలమధ్య అవగాహన కూడా కొరవడితే చెప్పేదేముంది? ఇంటాబ





యటా కూడా నరకంగా చేసుకుని అందరికీ చులకనకావడం సహజం.

నిశితంగా పరిశీలించి అవగాహన చేసుకోకుండా, ఏవో కొన్ని సంఘటనల ఆధారంగా కొన్ని విషయాలపట్ల మొండి అభిప్రాయాలు ఏర్పరచుకుంటే జీవిత భాగస్వామి విషయంలో అది తీవ్రపరిణామాలకు దారితీయడం తథ్యం అనే నిజాన్ని రాఘవపాత్ర ద్వారా చక్కగా ఆవిష్కరించారు. నేటి స్పీడు యుగంలో ప్రేమరాహిత్యానికిగల ముఖ్యకారణాలలో ఇదొకటి. 'ఎవరి జీవితమూ సంపూర్ణంకాదు, రాజీపడక జీవితాన్నించి పారిపోలేం. ఈ ప్రపంచంలో జీవించడానికి ప్రతీ వ్యక్తీ దేనికో దానికి రాజీపడక తప్పదు, అందుకే పెళ్ళిళ్ళు స్వర్గంలో జరిపి భూమ్మీదకు పడేస్తాడంటారు దేవుడు' అన్న రాఘవ బామ్మ ఉత్తరంలోని మాటలు ప్రతి భార్యాభర్తా నిత్యం మననంచేసుకోవలసిన మంత్రాలు.

ఎన్నుకునే అవకాశం తమదేగనుక జీవిత భాగస్వామిని ఎన్నుకోవడంలో తప్పుచేశామేమో అని పెళ్లయ్యాక కొందరు మథనపడుతుంటారు. కానీ లోపాలనేవి భాగస్వామి విషయంలోనేకాదు, తల్లిదండ్రుల విషయంలోనూ, తోబుట్టువులలోనూ, కన్న బిడ్డల్లోనూ కూడా ఉంటాయిగదా! మరి అప్పుడు ఏంచేస్తున్నాం? వీరితో నాకు ఏ సంబంధమూలేదు అంటూ వాళ్లకీ విడాకులిచ్చేసినట్లుగా బాంధవ్యాన్ని తెంచుకుంటున్నామా? లేదుగదా, అటువంటి దృక్పథం జీవిత భాగస్వామి విషయంలో కూడా ఉంటే అసలు విడాకుల ప్రసక్తే తలెత్తదు.

గిన్నిస్ కాంపౌండ్‌లోని పాత్రలతో చక్కటి హాస్యసన్నివేశాల సమ్మేళనంతో కథను విడవకుండా చదివేలా చేసే ఎ.జయలక్ష్మీరాజుగారి 'విడాకులు' నవల చక్కటి ఇతివృత్తంతో భార్యాభర్తల మనోభావాలని విభిన్నకోణాల నుండీ, వివిధ పాత్రల చాటునుండీ విశ్లేషణాత్మకంగా చూపింది. నవలపేరు చూసి ఏదో 'సీరియస్ మేటర్'లే అనుకునేవారినిసైతం నవ్విస్తూ మనోరంజకంగా ఒక సందేశాత్మక హాస్య చలనచిత్రాన్ని చూసిన అనుభూతిని కలిగించింది. అశ్లీలం లేకుండా, ఆద్యంతం నవ్విస్తూ, మళ్ళీ చదవాలనిపించేలా, విమర్శించడానికి వీలులేని నవలను అందించినందుకు రచయిత్రికి అభినందనలు, ప్రచురించిన 'చతుర'కి ధన్యవాదాలు.

-జి.భవానీరమణ
సికింద్రాబాద్

## అంతర్లీన సందేశం

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**మొ**దలుపెట్టిన దగ్గర్నించీ విడవకుండా చదివించిన ఈ నెల 'చతుర' నవల 'విడాకులు' ప్రధానగుణం ఆరోగ్యకరమైన విషయప్రధాన హాస్యం.

పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో మహిళా ఉద్యోగుల సాధకబాధకాల్ని చర్చిస్తూనే సందర్భమూ, సహజమూ అయిన హాస్యంతో, అంతర్లీనంగా ఓ సందేశాన్ని మేళవించిన తీరు ప్రశంసనీయం.

ఏరంగంలోనైనా చెడు అనేది ఉందన్న విషయం నిర్వివాదాంశమే అయినా పత్రికలు గానీ, సమాజంలో ఇతర వర్గాలుగానీ పోలీసు వ్యవస్థలో 'చెడు'నే ఎక్కువగా చూసి, దాన్నే బహిర్గతపరచడం జరుగుతోంది. ఈ డిపార్ట్‌మెంట్‌లోనూ నిజాయితీకి స్థానం ఉందనీ, వృత్తికే అంకితమైన ఉద్యోగులుంటారనీ, పోలీసులకు ప్రజలు సహకరించినప్పుడే ఈ సమాజంలో మంచికి మనుగడ ఉంటుంద'నే పాజిటివ్ దృక్పథాన్ని కల్గించే ఇలాంటి నవలను సరైన తరుణంలో ప్రచురించింది 'చతుర'.

ఆడవాళ్ళు ఈ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేయడంపట్ల సహజంగా రాఘవకున్న అనవసరమైన అపోహలు, ఆలోచనలు నేడు చాలా మందికి కలిగేవే. బాల్యంలో బామ్మ చెప్పిన బూచాడి కథ రాఘవ మనస్తత్వాన్ని ఆరకంగా మార్చడంలో ఆశ్చర్యంలేదు. కారణాలేవైనా, అర్థరహితంగా ఒక వ్యవస్థపట్ల ఏహ్యభావాన్ని పెంచుకొన్న రాఘవ మానసిక సంఘర్షణనూ, తర్వాత అతనికి పోలీసు మనుషుల పరిచయాలు జరగటంతో వారిపట్ల క్రమంగా సద్భావం ఏర్పడటం ఒకవైపూ, చివరికి యస్సై దుర్గగా భార్యతో రాజీపడేంతగా అతని ప్రేమనూ చక్కగా చిత్రించారు.

పరిస్థితుల్ని ప్రాక్టికల్‌గా ఎదుర్కొనే మనస్తత్వంగల దుర్గ, కష్టపడి సంపాదించిన ఉద్యోగాన్ని గౌరవిస్తుంది, తన భర్తలో మార్పును ఆశిస్తుంది. మనసుపొరల్లో వివాహ బంధంద్వారా ఏర్పడ్డ మమతల్ని అంత తేలిగ్గా తోసిరాజనలేక ఉద్యోగానికే విడాకులిద్దామనుకున్న దుర్గ గిన్నీస్ పరివారపు సానుభూతికే కాక పాఠకుల జాలికీ పాత్రమవుతుంది.

ఇక గిన్నీస్‌పరివారం అంతా విచిత్రంగా ఉండి, పాత్రోచిత హాస్యానికి తావిచ్చింది. అక్కడక్కడా సహజత్వానికి కొంత దూరంగా అనిపించినా 'కొన్ని కల్పితాలూ రాశానమ్మా' అన్న రాఘవయ్య మాట ఉంది గనుక సరిపెట్టుకోవచ్చు.

చివర్న దుర్గారాఘవల కలయికను మలచిన తీరు మొదలంటా వచ్చిన శైలికి కొనమెరుపు. ఏమైనా ఒక చక్కని నవల చదివిన తృప్తిని మిగిల్చింది ఈ నెల 'చతుర'.

-ఎస్.రాజేశ్వర్
వికారాబాద్

## మహిళాసమస్య

*(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

'**చ**తుర' మళ్ళీ ఒక ప్రత్యేకమైన అంశంతో కూడిన నవలను అందించి, వైవిధ్యంలో తనకు తనే సాటి అనిపించుకుంది. ఎ.జయలక్ష్మీరాజుగారి 'విడాకులు' ఆసాంతం హాస్యపు జల్లులతో కడుపుబ్బ నవ్వించటంతోపాటు నేటి పురుషాధిక్య సమాజానికి కొన్ని నిజాల్ని తెలియపరిచి, మహిళాలోకానికి చేయూతనివ్వాలని ప్రబోధించే ప్రయత్నం జరిగింది.

ఇప్పుడు మహిళాపోలీసాఫీసర్ల కథలు, సినిమాలు ఎన్ని వస్తున్నా అన్నింట్లోనూ వారు ధైర్యంతో దుష్టశక్తుల్ని మట్టుపెట్టిన విశేషాలు, విధానాలే వుంటున్నాయి. కానీ ఈ నవల ఓ ప్రత్యేకత సంతరించుకుంది. వారు డ్యూటీలో కాక ఇంట్లోనూ, చుట్టుపక్కలా ఎన్ని ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నారో సహజసిద్ధంగా తెలియజేసింది.

రాఘవ పెళ్ళయి 15 రోజులన్నా కాకుండానే తనమాటే నెగ్గాలన్నట్లుగా స్వయంశక్తితో దుర్గ ఎంతో కష్టపడి సంపాదించుకున్న ఉద్యోగాన్ని వదిలేయమనటం, అదీ కేవలం యూనిఫారం వేసుకోటం నచ్చక ఉద్యోగం మానేయమనటం ఎంతో బాధకలిగించింది. ఇలాంటివారు మన దేశంలో అదీ మన ఆంధ్రదేశంలో ఎక్కువనే చెప్పాలి. డ్యూటీలో అంతో, ఇంతో దేశసేవ చేయాలనే తన ఆశయానికి విలువనిచ్చి వివాహబంధాన్నిసైతం వదులుకోదల్చిన దుర్గ లాంటివారు దేశానికి ఎంతో అవసరం. ఈ విషయాన్ని వీరెప్పటికి గ్రహిస్తారో? ఆఖరున రచయిత రాఘవలో మార్పు కల్గినట్లు చూపేందుకు తనే పెంచిన కూతుళ్ళలో ఒకరిని పోలీసాఫీసరుగా చేసినట్లు కథను మల్చటం బాగుంది. సమాజంలోనూ ఇలాంటి మార్పునే అందరూ హర్షిస్తారని పరోక్షంగా తెలిపారు.

నవల సునిశితమైన హాస్యంతో ప్రబోధాత్మకంగా రూపొంది ఆసాంతం చదివేట్లుగా చేసింది. ఛండి, శ్రీశైలంల డైలాగులు కొంచెం ఇబ్బంది కలిగించినా అవసరమే అనిపిస్తాయి.

-పి. లావణ్య
నంద్యాల

## స్పీడ్‌బ్రేకర్స్

*(అయిదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

**చి**త్రవిచిత్రమైన సమస్యలను చతురంగా పరిష్కరించే నవలను ప్రచురించే ధైర్యం 'చతుర'కు కలదనటానికి నిదర్శనం ఈ నెల 'విడాకులు' నవల.

రాఘవ సమస్య కేవలం నేటి సమాజంలో మగవాళ్ళ సంకుచిత మనస్తత్వాన్ని చూపేదిగానే వుంది. దుర్గలాంటి ఎందరో స్త్రీలు తమ ఆశయంకోసం ఆశలను వదులుకుంటున్నారు. వీరిద్దరి సమస్యకు నాంది మన సమాజంలో ఆడదానికి విధించబడిన కట్టుబాట్లు. మన పూర్వీకులు స్త్రీలను మాతృమూర్తిగా ఆకాశానికి ఎత్తితే ఇప్పటివారుకూడా కేవలం మాతృమూర్తిగానే చూడటానికి ఇష్టపడుతున్నారు. ఆమె అభివృద్ధిపథంలో పురోగమిస్తుంటే చిన్నచూపు చూస్తున్నారు. వారి ఆశయాలకు




రంగులుపూసి అభివృద్ధికి అడ్డుగా నిలుస్తున్నారు.

చివరలో రాఘవలో కలిగిన మార్పు హర్షించదగినదిగా వుంది. మగవారు అలా సులభంగా మారగలిగితే దుర్గలాంటివారు తమ ఆశయాలను నెరవేర్చగలుగుతారు. వారి స్వచ్ఛంద సేవలు మనకు అందుతాయి.

ఈ నవలలోని మర్దిని పాత్ర, ప్రవర్తన కొంత అసహజంగా వున్నా లోతుగా చూసినట్లయితే ఆమె వెనుక కట్నాల కడలిలో కొట్టుకుపోతున్న ఆడపిల్లల తల్లిదండ్రులు కనిపించకపోరు.

నవలకు స్పీడ్‌బ్రేకర్లలాగా చండిక, శ్రీశైలంల సంభాషణలతో పాఠకుల సహనాన్ని పరీక్షించే సన్నివేశాలున్నాయి. నవరసాలలో సాగిపోతున్న కథలో వీరు కొంత వెగటురసాల్ని చేర్చినట్లుంది.

మొత్తంమీద రచయిత్రి తను చెప్పాలనుకున్న సమస్యను చెప్పి దానికి తగు పరిష్కారాన్ని చూపటంలో కృతకృత్యులయ్యారనిపిస్తుంది. ఇది కొన్ని వృత్తులలో వున్న స్త్రీలపట్ల చాలా మందిలోగల అసహ్యభావాన్ని తుడిచేసేదిగా వుంది. అందువల్ల స్త్రీలు పురుమలకంటే ఏరంగంలోనూ తీసిపోరనీ, అవకాశాలు కల్పించి, చేయూతనిస్తే ప్రగతిపథంలో పయనించి దేశ పురోగమనానికి తమవంతు సేవలు అందిస్తారనేది గుర్తించాలి.

-రమ్య
పరకాల

## వెరయిటీ సబ్జెక్ట్

*(ఆరవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

పేరు చూడగానే ఇదేదో ట్రాజెడీగా ముగిసే నవలేమో అనిపించిందిగానీ క్రమక్రమంగా మంచుతెరలు తొలగిపోయి, వెలుగుకిరణాలు సాక్షాత్కరించినట్లు దుర్గ-రాఘవల కాపురంలో అపార్థాలు, అపోహలు ఆవిరైపోయి, అవగాహనాతీరం చేరుకుంది వాళ్ళ నావ. వస్తుతః ఈ నవల 'సీరియస్'గా నడిచే అతి చిన్న కథాంశమే అయినా అడుగడుగునా హాస్యాన్ని అద్దుకుని సునిశితంగా ఆలోచింపచేస్తూ సుఖాంతమయింది. అన్ని డిపార్ట్‌మెంట్‌లలోనూ వున్న మంచిచెడ్డలే పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో కూడా వుంటాయనీ, మహిళలు వివిధ డిపార్ట్‌మెంట్‌లలో ఉద్యోగాలు చేస్తున్నట్టు అక్కడ కూడా నిస్సంకోచంగా చేరి తమ ఆత్మసంతృప్తికి, దేశాభ్యున్నతికి పాటుపడవచ్చుననీ రచయిత్రి ఈ నవలలో సూచించారు. పోలీస్ డిపార్ట్‌మెంట్‌పట్ల ప్రజలలో గల అపోహలను తొలగించే ప్రయత్నమూ చేశారు. తన భార్య పోలీసు ఉద్యోగిని అని హఠాత్తుగా తెలుసుకున్న రాఘవ(లాంటి సాధారణవ్యక్తి) ఆమెను ఉద్యోగం మానేయమనటం, ఆమె నిరాకరణ, ఇద్దరూ తెగేదాకా లాగి విడాకులదాకా పోవటం, జడ్జిగారు దానికి సమ్మతించి నాటకీయంగా ఆ ఇద్దర్నీ ఒకేయింట్లో సంవత్సరంపాటు కలసివుండమనటం జరుగుతుంది. ఈ నిబంధన వలన కథ సుఖాంతమయ్యే సూచనలు గోచరిస్తాయిగానీ దుర్గ, రాఘవ దంపతుల మొండి వైఖరి, మంకుపట్టు అందుకు భిన్నంగా ఉంటుంది. ఇక్కడే రచయిత్రి కథాగమనాన్ని శుభదిశగా నడిపించటంలో తన పనితనం చూపించారు. దుర్గ, రాఘవల సీరియస్‌నెస్ మధ్యకు వివిధ పాత్రలు వచ్చి కథాగమనం, హాస్యరసస్ఫోరకంగా సాగింది. ఎన్నుకున్న ఇతివృత్తం బరువైనదైనా, సున్నితమైన హాస్యం జోడింపబడటంవల్ల నునుపైన రోడ్డుపై కొత్తకారు పరుగెత్తినంత స్మూత్‌గా నడిచింది కథ.

అయితే రాఘవ భార్య దుర్గ డ్యూటీలోనే చనిపోయినట్టు (నవల ప్రారంభంలో) చెప్పారు. మిగతా డిపార్ట్‌మెంట్‌లలోలాగానే పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో కూడా మహిళలు చక్కగా ఉద్యోగాలు చేయవచ్చునంటూ రచయిత్రి చెప్పదలుచుకున్న విషయాన్ని ఇలా దుర్గ డ్యూటీలో చనిపోవటం అనేది దెబ్బతీస్తుందిగదా! రచయిత్రి ఎన్నుకున్న ఇతివృత్తం విభిన్నమైనదేమీ కాకపోయినా, సున్నితమైన హాస్యం మిళితంచేసి ప్రజెంట్ చేయడంవల్ల వెరయిటీ సబ్జెక్ట్ అనిపించేట్టుగా వుంది. మొత్తంమీద ప్రత్యేకతతో కూడిన 'చతుర' నవల అనిపించింది.

-పాట్నీడి చక్రరావు
విశాఖపట్నం






# జెల్లీ పోటీలో విజయ రహస్యం!

సిడ్నీలో ఓసారి 'జెల్లీతినడం'లో ప్రపంచవ్యాప్త పోటీ నిర్వహించారు. ప్రకటన చూడగానే నోరూరిన జెల్లీ ప్రియులంతా పోటీలో పాల్గొన్నారు. కానీ చివరివరకూ వెళ్ళేసరికి కొంతమందే మిగిలి... వారిలో పీటర్ స్ప్లి స్బరీ అనే 25 ఏళ్ళ ఆసామి ప్రథముడుగా వచ్చి 'వరల్డ్ జెల్లీ ఈటింగ్ ఛాంపియన్' బిరుదు కొట్టేయడం జరిగింది. ఎర్రగా మిలమిలలాడే అరలీటరు జెల్లీని 40.4 సెకన్లలో స్వాహాచేసేశాడు పీటరు. ఇంతకీ అతను చెప్పే విజయరహస్యమేమంటే నిత్యం బీర్ తాగుతున్నందున తన గొంతు కండరాలన్నీ జెల్లీని స్పీడుగా మింగేందుకు అనువుగా తయారయ్యాయని. ఈ పందెం విషయంలో అతను గిన్నీస్‌బుక్‌కెక్కే అవకాశం వుండచ్చన్నారు కొందరు. కానీ అది అనుమానమే. ఎందుకంటే మళ్ళీ జరిగే పోటీలకోసం బీర్ తాగడం ప్రారంభించేవుంటారుగదా రహస్యం తెలిసిన మిగతా పోటీదారులు.

# రచయితలకు మనవి 



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిననందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర ఫీచర్

# చేదు నిజాలు

## అడవిలో శవం

అస్సాంలో 'జగన్‌పరా' అనే ఓ చిన్న గ్రామం అడవిలో వుంది. అక్కడ కోయలు, భిల్లులు మొదలయిన అడవిజాతి వాళ్ళు ఎక్కువ. ఆ ప్రాంతంలో ఉన్న ఒక నది పై చిన్న డామ్ నిర్మించాలని నిశ్చయించింది అస్సాం ప్రభుత్వం. దానికోసం రాకేష్ అనే 40 ఏళ్ళ ఇంజనీరుని నియమించింది.

రాకేష్ చాలా తెలివైన, సమర్ధుడైన వ్యక్తి. ఈ డామ్ నిర్మించడానికి చాలా కాలమే పట్టవచ్చన్న ఉద్దేశంతో అతడు తన భార్యను కూడా తీసుకొచ్చి జగన్ పరాకి దగ్గర్లోనే వున్న గౌహతిలో మకాం పెట్టాడు. గౌహతినుంచి జగన్ పరా 5, 6 మైళ్ళు వుంటుంది. అయితే ఈ దూరం అంతా దట్టమైన అడవిగుండా ప్రయాణం చెయ్యాల్సిందే.

గౌహతిలో రాకేష్ కుటుంబంకోసం మంచి బంగ్గళాను ఇచ్చింది ప్రభుత్వం. అప్పుడప్పుడు పని ఒత్తిడి కారణంగా రాకేష్ రాత్రుళ్లు కూడా డామ్ సైట్ దగ్గరే వుండిపోయేవాడు. పదేళ్లయినా వారికి సంతానం కలగకపోవడంతో అంత పెద్ద బంగళాలో రాకేష్ భార్య పరిమళ ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ కాలంగడిపేది.

డ్యామ్‌లో ఎంతోమంది స్త్రీలు, పురుషులు పనిచేసేవారు. ముఖ్యంగా గిరిజన యువతులు చక్కని శరీరసౌష్టవంతో ఆకర్షణీయంగా కనిపించేవారు. ఒకసారి షాలీ అనే 20 ఏళ్ల గిరిజన పడుచు కూలీకి వచ్చి కుదిరింది. షాలీది కళ్ళు తిప్పుకోనివ్వని అందం. అప్పుడప్పుడు అక్కడ రోజుల తరబడి రాత్రింబవళ్లూ వుండిపోయే రాకేష్‌కి వంట చెయ్యడానికి ఆమెనే కుదిర్చారు ఆమె తల్లిదండ్రులు.

షాలీ అందాన్ని కొన్నాళ్లు కేవలం చూడ్డంతోనే సంతృప్తి చెందినా, ఎక్కువకాలం నిగ్రహించుకోలేకపోయాడు రాకేష్. దానికి తగ్గట్టు షాలీ కూడా సుముఖత చూపించడంతో ఇద్దరూ హద్దుమీరి ప్రవర్తించారు. అయితే గిరిజన తెగలో ఆడపిల్ల తనకు నచ్చిన వ్యక్తిని వివాహమాడటం, సదరు వ్యక్తితో వివాహానికి పూర్వమే శారీరక సంబంధం పెట్టుకోవడం తప్పుకాదు. అందుకే షాలీ వైపు పెద్దలు ఏమనకుండా వూరుకున్నారు. కొన్నాళ్ళకి షాలీ గర్భవతి అవడం, మగపిల్లవాడిని ప్రసవించడం కూడా జరిగింది. ఆ అబ్బాయికి తండ్రి రాకేష్‌బాబు అంటూ షాలీ అందరికీ చెప్పుకునేది.

ఇంతా అయ్యాక అప్పుడుగానీ ఈ నిజం పరిమళకు తెలియలేదు. డ్యామ్ దగ్గర పనిచేసే ఓవ్యక్తి ఓసారి టౌనుకి పనిమీద వచ్చి అనుకోకుండా రాకేష్ ఇంటికి వెళ్ళాల్సివస్తే, విషయాన్నంతా పరిమళకి చెప్పి వెళ్ళాడు.





వాళ్ళ దృష్టిలో అది మామూలే గనుక చెప్పటం తప్పనుకోలేదు. కాని ఆమె కుతకుతలాడిపోయింది. భర్త రాగానే అతనిమీద విరుచుకుపడింది. దానికి రాకేష్ "అదంతా అబద్ధం డియర్! ఆ డ్యామ్ పని అంతా చక్కగా చేయించి పేరు తెచ్చుకుంటున్నానన్న అసూయతో ఎవరో గిట్టనివాళ్ళు ఇలా ప్రచారం చేస్తున్నారు" అని నమ్మబలికాడు.

అప్పటికి ఆమె ఏం మాట్లాడకపోయినా ఆ తర్వాత మాత్రం వారిద్దరిమధ్యా మౌనయుద్ధం నడుస్తూనే వుంది.

ఓరోజు రాకేష్ పనివాళ్ళతో డ్యామ్ పని తీరుతెన్నులు గురించి చర్చిస్తుండగా ఓ వ్యక్తి పరుగున వచ్చి పరిమళ అడవిమధ్యలో చనిపోయి పడివుందని చెప్పాడు. వెంటనే జీప్‌లో ఆ ప్రాంతానికి ఆఘమేఘాలమీద వెళ్ళాడు రాకేష్. పరిమళ నిర్జీవ శరీరాన్ని చూసి కుప్పకూలిపోయాడు. ఒంటిమీద ఎక్కడా గాయాలుగానీ, రక్తపు మరకలుగానీ లేవు. నిశ్చింతగా నిద్రపోతున్నట్లున్న పరిమళ ఎలా చనిపోయిందో, ఆ అడవిలో ఎందుకు పడివుందో ఎవరికీ అర్థంకాలేదు.



వెంటనే పోలీసులు రంగంలోకి దిగారు. శవాన్ని పోస్ట్‌మార్టమ్ చేయిస్తే విషాహారం కారణంగా మరణం సంభవించినట్లు తేలింది. పోలీసులు ముందుగా పరిమళ ఇంట్లో పనిచేసే వృద్ధ మహిళను పట్టుకుని ప్రశ్నించారు. ఆమె తనకేమీ తెలియదనీ, ఆరోజు తనకి పని వుండటంతో రోజూకంటే ఓ గంట ముందుగానే వెళ్ళిపోయాననీ, కానీ తను వెడుతుంటే ఓ 12 ఏళ్ళ కుర్రాడు చేపలు తెచ్చి అమ్మగారికి వ్వడం చూశాననీ చెప్పింది.

రాకేష్‌కు షాలీతో గల సంబంధాన్ని తెలుసుకున్న పోలీసులు రాకేష్‌ని అనుమానించి ప్రశ్నించారు. కానీ పరిమళను తాను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాననీ, పిల్లలు లేనంత మాత్రాన ఆమెను చంపే దురుద్దేశం తనకులేదనీ, షాలీకి దగ్గరవడం కేవలం ఆకర్షణేగానీ పరిమళను వదిలి వివాహమాడే వుద్దేశం లేదనీ తేల్చాడు.

చివరికి విషాహారఫలితమని రిపోర్ట్ రావడంవల్ల ఆరోజు వంట కాలన్నీ పరిశీలించారు. ఆనాటి చేపల కూరను పరీక్ష చేస్తే, అవి విషపూరితమైన చేపలని తేలింది. చేపలను పరిమళకిష్టమని డ్యామ్‌సైటు నుంచి ఓ కుర్రవాడిచేత తానే పంపానని చెప్పాడు రాకేష్. ఆ చేపలను నదిలో పట్టి తెచ్చినవి అంటూ షాలీయే తనకిచ్చిందని చెప్పాడు.

ఆ చేపలే ఆమె మరణానికి కారణమనీ, అవి తిన్న వెంటనే కలిగిన బాధ తట్టుకోలేక అడవి గుండా భర్తకోసం పరిగెట్టుకువచ్చి వుంటుందనీ, కానీ మార్గమధ్యంలోనే చనిపోయివుంటుందని తేల్చారు పోలీసులు. వెంటనే షాలీకోసం వెతికారు. ఆమె అడవిలో ఎక్కడా దొరకలేదు. గిరిజనులు కూడా ఆమె ఆచూకీ గురించి నోరువిప్పలేదు. చాలాకాలం షాలీకోసం పోలీసులు గాలిస్తూనే వున్నారు.

## పెళ్ళిరోజు

**ఆ**శకు ఆరు సంవత్సరాల వయసప్పుడు ఆమె తల్లిదండ్రులు కారుప్రమాదంలో మరణించారు. మేనత్త మరకతం ఆశను పెంచి, పెద్దచేసి కన్నబిడ్డలా చూసుకొంది.

కోయంబత్తూరుకి చెందిన ఆశ అందమైందేకాకుండా చదువులో కూడా క్లాసులో అందరికంటే ముందుండేది. అందువలన ఆశకు తగిన వయసు రాగానే తన ఏకైక సంతానం చంద్రన్‌కి ఆశనిచ్చి వైభవంగా వివాహం జరిపించింది మరకతం.

పెళ్ళయి మూడేళ్ళు గడిచినా ఆశ తల్లయ్యే సూచనలు కనిపించలేదు. ఫలితంగా మరకతంలో తీరని అసంతృప్తి చోటుచేసుకుంది.

అయితే ఓరోజున తాను నెలతప్పాననే శుభవార్త చెప్పింది ఆశ. మరకతం సంబరపడిపోయి, ఆరోజు వారి పెళ్ళిరోజుకూడా కావడంతో భార్యాభర్తలిద్దర్నీ గుడికి పంపింది.

ఒక గంట గడిచాక, ప్రభుత్వ ఆసుపత్రికి అర్జంటుగా రమ్మంటూ మరకతానికి ఫోనొచ్చింది.

ఆస్పత్రిలో పడివున్న చంద్రం, ఆశల దీనావస్థ చూసి కుంగిపోయింది మరకతం.

గుడినుండి ఇంటికి తిరిగి వస్తుండగా కారు ప్రమాదానికి గురికావడంతో ఆశ, చంద్రంలకు బాగా దెబ్బలు తగిలాయి. ఆశకు అబార్షన్ అయింది. దానికితోడు ఒక కాలు తీసివేయవలసి వచ్చింది.

చంద్రం వారంరోజుల్లో కోలుకున్నాడుగానీ ఆశను నెలరోజులు ఆసుపత్రిలోనే వుంచినా ఆమె ఆరోగ్యం కుదుటపడలేదు. వెన్నులో విపరీతంగా నొప్పిరావడంతో ఆమెకు ఎక్కువగా శ్రమకలిగించవద్దన్నారు డాక్టర్లు.

ఇంటికి వచ్చాక ప్రతిపనికీ మరకతంపైన ఆధారపడవలసి వచ్చింది ఆశకి. పనిభారం ఎక్కువ కావడంతో ఆశ పనులు చూసుకోవడానికి మీనా అనే నర్సును నియమించింది మరకతం.

మధ్యవయస్కురాలైన మీనా ఉదయం ఆరుగంటలనుండి సాయంకాలం తొమ్మిదివ







రకూ వుండి ఆశ పనులన్నీ చేసివెళ్ళేది.

రోజులు గడుస్తున్నా ఆశ అనారోగ్యంలో మార్పులేదు. ఆమె బాధను తొలగించడానికి ఎన్నో ప్రయత్నాలు చేసేవారు. రోజూ రాత్రి నిద్రమాత్ర వేసేవారు. చక్రాలబండిలో ఇల్లంతా తిప్పేది మీనా.

ఈ దశలో 1976 ఆగస్టు 8న వారంరోజుల సెలవుమీద వెళ్ళింది మీనా. ఆ వారంరోజుల కోసం మాలిని అనే అందమైన అమ్మాయిని నియమించింది మరకతం.

ఆగస్టు 12న మరకతం గుడికి వెళ్ళిన సమయంలో ఇంటికి వచ్చాడు చంద్రం. భర్తను పలకరించడానికి చక్రాల కుర్చీలో అత నుండే గదివైపు వెళ్ళింది ఆశ. అక్కడ కని పించిన దృశ్యం ఆమెను ఆశ్చర్యపరచడంతో పాటు కుంగదీసింది. చంద్రం, మాలినిలు ఒకరి కౌగిట్లో ఒకరు ఒదిగిపోయి మైమరచిఉ న్నారాసమయంలో. వారు చూడకుండా వెంటనే వెనక్కి తిరిగివచ్చింది ఆశ.

మరకతం గుడినుంచి రాగానే జరిగిన విషయం చెప్పి ఏడుస్తూ, తనకిక బతకాలని లేదని బాధపడింది ఆశ. ఆశపై మమకారాన్ని

పెంచుకొన్న మరకతానికి ఈ సమస్యనెలా పరిష్కరించాలో అర్థంకాలేదు.

ఆ మరునాడు ఎప్పటిలాగే మాలిని ఇచ్చిన నిద్రమాత్ర వేసుకుని ఆశ నిద్రపోయింది. అదే సాయంత్రం మరకతం గాలిమార్పుకోసం మద్రాసు వెళ్ళింది.

అయితే నిద్రమాత్ర వేసుకుని మామూలుగా నిద్రపోయిన ఆశ మర్నాడుదయం లేవలేదు. చనిపోయిందని నిర్ధారించారు. మాలిని, చంద్రంల రహస్య సంబంధాన్ని చూచాయగా పసిగట్టిన ఇరుగుపొరుగువారు ఆశది సహజమరణం కాదని అనుమానించారు.

విషయం పోలీసులవరకూ వెళ్ళింది. శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపారు. మోతాదుకు మించి మాత్రలు మింగడంవల్ల ఆశ చనిపోయిందని రిపోర్టులు అందాయి.

ఆశకు నిద్రమాత్రలు రోజూ మాలినే ఇవ్వడంవల్ల పోలీసులు మొదట ఆమెనే ప్రశ్నించారు. "రోజూ ఇచ్చినట్టుగానే ఒకే మాత్ర ఇచ్చాను" అంది మాలిని.

ఏదో అనుమానం వేసిన పోలీసులు ఆశ, చంద్రంల గురించి ఎంక్వయిరీ చేయగా ఉత్సుకతను రేకెత్తించే కొన్ని విషయాలు బయటపడ్డాయి. మాలిని మొదట్లో చంద్రం పనిచేసే ఆఫీసులోనే స్టెనోగా పనిచేసేది. వారిద్దరిమధ్యనున్న పరిచయం కాస్తా ఆశ అవిటిది కావడంతో ప్రేమగా మారింది. మీనా వెళ్ళగానే ఆ స్థానంలో ఎవరికీ అనుమానం రాకుండా మాలినిని తెచ్చి వుంచాడు చంద్రం. ఈ విషయం మరకతానికి కూడా తెలియదు.

చంద్రం, మాలిని కలిసి తమకు అడ్డుగా వున్న ఆశను నిద్రమాత్రలిచ్చి చంపారని భావించారు పోలీసులు.

ఈలోగా మద్రాసునుండి తిరిగి వచ్చిన మరకతం ఆశ మరణంపట్ల తీవ్రంగా బాధపడింది. అయితే మాలిని, చంద్రంలను అరెస్టు చేయడానికి పూనుకున్న పోలీసులకు అడ్డువచ్చి కేసుకో కొత్తమలుపునిచ్చింది.

మరకతం చెప్పిన విషయాలు అందర్నీ ఆశ్చర్యపరిచాయి. "మాలినీ, చంద్రంల ప్రేమ వ్యవహారం నిజమైనా ఆశ మరణానికిమాత్రం వాళ్ళు కారకులుకారు. ఆశను మేము కంటికి రెప్పలా చూసుకున్నాం. ఓవక్క మాలిని, చంద్రంల ప్రేమకు అడ్డుచెప్పలేక, మరోవక్క ఆశ బాధను చూడలేక మధ్యలో నలిగిపోయాను నేను. చంద్రం, ఆశల ఇద్దరి కోరికలను తీర్చడానికి నాకు ఒకేమార్గం కనిపించింది. మోతాదుకుమించిన నిద్రమాత్రల్ని మాలినికి తెలియకుండా పాలలో కలిపి ఆమెద్వారానే ఆశకి ఇప్పించాను. కానీ ఇది పోలీస్‌కేసు అవుతుందని ఊహించలేదు" అంది మరకతం పశ్చాత్తాపడుతూ.

ఆవిధంగా ఆశను చంపిన నేరానికి ఇరవై ఐదేళ్ళ కఠిన కారాగార శిక్షకు గురైందామె.

# కర్తవ్యం

ఆలూరు పోలీస్‌స్టేషన్ హెడ్‌కానిస్టేబుల్‌గా పనిచేస్తున్న ఆరడుగుల భారీ విగ్రహుడైన అతడు సదా నేరస్థుల గుండెల్లో నిద్రపోతుంటాడు. నీతీ నిజాయితీలుగల సమర్థుడైన పోలీస్ ఉద్యోగిగా పేరు తెచ్చుకున్నాడతను.

ఆలూరు పోలీసు స్టేషన్‌కి రెండు మైళ్ళ దూరంలో ఓ పెద్ద మర్రిచెట్టూ, దాని చుట్టూ సిమెంట్ అరుగూ వుంది. ఒకప్పుడు ఊరి పెద్దలు అక్కడ కూర్చుని లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ పక్కనే చెరువుమీంచి వచ్చే చల్లగాలి పీలుస్తూ గంటలకు గంటలు సుఖంగా గడిపేవారు. కానీ ఈమధ్య ఆ స్థానాన్ని ఓ నలుగురు రౌడీలు ఆక్రమించి స్వంతం చేసేసుకున్నారు. పొద్దున్నే పీకలదాకా తిని, అక్కడ చేరి వచ్చేపోయేవారిని విమర్శిస్తూ, గేలిచేస్తూ గడిపేవారు. ముఖ్యంగా వయసులో వున్న ఆడపిల్లలను, స్త్రీలను అసభ్యపదాలతో, అశ్లీలపు సంజ్ఞలతో పీడించుకు తినడం ఎక్కువయింది. సామాన్యంగా మంచి నీళ్ళకి యువతులు బావికో, చెరువుకో వెళ్ళాలన్నా ఆడపిల్లలు స్కూలుకి వెళ్ళాలన్నా ఆ చెట్టుముందు








నుంచే వెళ్ళాలి. వాళ్ల బాధ చూసిన పెద్దమనుషులు ఎవరయినా వాళ్ళకి కాస్త మంచీ చెడూ చెబుదామని ప్రయత్నించినా ఒకడుగు ముందుకువేసి పోలీసులకు ఫిర్యాదు చేస్తామని బెదిరించినా సదరు వ్యక్తిని సున్నంలోకి ఎముక మిగలకుండా కొట్టేవారు. వీళ్ళ పైశాచికత్వానికి జడిసి ఆవూరి ప్రజలెవ్వరూ నోరెత్తకుండా వీళ్ళ వేధింపుల్ని భరించేవారు.

అయితే ఈ విసుర్లూ వ్యంగ్యాలూ అటునుంచే పోలీస్‌స్టేషన్‌కి నిత్యం డ్యూటీకెళ్ళే హెడ్‌కానిస్టేబుల్‌కి కూడా తప్పలేదు. మొదట్లో దాన్ని పట్టించుకోనక్కర్లేని విషయంగా చాలా కాలం నిర్లక్ష్యం చేస్తూ వచ్చాడతను. చివరకి ఆ ఊళ్లోని నలుగురు యువకులు కలిసి ఓ రోజు ఈ రౌడీలను చితగ్గొట్టడంతో కథ మరో మలుపు తిరిగింది. ఈ రౌడీలు మరో నలుగురు గూండాలను తోడు తెచ్చుకుని తమను కొట్టిన నలుగురినీ మళ్ళీ నడవలేకుండా నుగ్గునుగ్గు చేశారు.

ఇదంతా విన్న హెడ్‌కానిస్టేబుల్ ఆగ్రహోదగ్రుడయ్యాడు. వాళ్లకి ఒక పాఠం చెప్పడం అవసరమనిపించి, ఆ నలుగుర్నీ లాకప్‌లో పెట్టి చితకతన్ని వదిలేశాడు.

అప్పటినుంచీ వాళ్లు మర్రిచెట్టుకింద కూర్చోవడం, జనాన్ని ఏడిపించడం మానేశారు గానీ హెడ్‌కానిస్టేబుల్‌పై ప్రతీకారం తీర్చుకో

వాలన్న కసి మాత్రం రోజురోజుకూ వాళ్ళలో పెరుగుతూ వచ్చింది.

రోజూ మధ్యాన్నం రెండు గంటలకి ఇంటికి భోజనానికి వచ్చే హెడ్‌కానిస్టేబుల్ కోసం ఓరోజు మాటువేశారు, ఈ నలుగురూ. ఒకళ్ల చేతిలో గునపం, మరొకరిచేతిలో కత్తి, ఇంకోళ్ల చేతిలో పిస్టల్... ఇలా మారణాయుధాలతో పొంచి ఉండి కానిస్టేబుల్, మోటార్‌బైక్ చప్పుడు కోసం చెవులు రిక్కించి ఎదురు చూస్తున్నారు. ఆరోజూ టైం ప్రకారం ఇంటికొస్తున్న కానిస్టేబుల్‌ని నలుగురూ చుట్టుముట్టారు. ఆలోచించి, ఎదురు తిరిగేందుకు అరసెకను వ్యవధికూడా లేకపోయినా హెడ్‌కానిస్టేబుల్ శాయశక్తులా పోరాడసాగాడు. పట్టపగలు నట్టనడిరోడ్డుమీద జరుగుతున్న ఈ మారణకాండని ఆ వూరి ప్రజలు వారి చుట్టూ నిలబడి చూస్తూనే వున్నారు తప్ప సాహసించి ఎవరూ ముందుకొచ్చే ప్రయత్నం చెయ్యలేకపోయారు. తమని రక్షించడానికి ప్రాణాల్ని సైతం లెక్కచేయని ఓ నీతీ, నిజాయితీగల పోలీసు తమ కళ్ళముందే రక్తపు మడుగులో గిలగిలలాడుతుంటే చూస్తూ వూరుకున్న ఆ ప్రజలమీద మండిపడింది అతడి భార్య. దుఃఖంతో రోదిస్తూనే, ధైర్యంగా పోలీస్‌స్టేషన్‌కి ఫోను చేసింది. కానీ సిబ్బంది అక్కడికి చేరుకునేసరికే అంతా అయిపోయింది. ఆ రక్షక భటుడు తుదిశ్వాస విడిచాడు.

ప్రజల్ని రక్షించడానికే పోలీసు డిపార్ట్‌మెంటు వున్నా, అవసరమయితే ఆ డిపార్ట్‌మెంటును ఆదుకోవడానికి ప్రజలు కూడా ముందుకు రావాలని చెప్పక చెబుతోంది ఈ సంఘటన. ఏది ఏమయినా మళ్లీ ఆ ఊళ్ళో ఎలాంటి రౌడీ వేధింపులూ కనిపించలేదని చెబుతుంటారు, ఆ గ్రామ ప్రజలు.

---

## రంగువేసిన జుట్టు

ఆ రోజు సోమవారం. రాత్రి 9 గంటలకి సుష్టుగా భోజనంచేసి తన టూ బెడ్‌రూమ్‌ఫ్లాట్‌లో నిశ్చింతగా నిద్రకుపక్రమించాడు రమాకాంత్. ఆరోజు అతనికి నిత్యం వదలకుండా చూసే టీ.వి. చూడబుద్ధికాలేదు. మనసంతా అంతక్రితం మూడు రోజులపాటు తనకు దొరికిన మధురమైన అనుభవం తాలూకు స్మృతితో నిండి మత్తుగా వుంది.

రమాకాంత్ పూనాలో ఓ లోకల్ కంపెనీలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. 30 ఏళ్ళ బ్రహ్మచారి. ఓసారి అతనికి దొరికిన మూడురోజుల శలవులను పక్కనే వున్న లోనావాలా హిల్‌స్టేషన్‌లో గడుపుదామని వెళ్ళాడు. అక్కడ ఒక మంచి హొటల్‌లో రూమ్ తీసుకుని, మొదటి రోజు హొటల్‌కి దగ్గరలో వున్న 'జూ' చూద్దామని బయలుదేరాడు. వేయించిన పల్లీల ప్యాకెట్టు కొనుక్కుని ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటూ అక్కడున్న రకరకాల కోతుల్ని వాటి విన్యాసాలని చూస్తూ నుంచున్నాడు. అంతలో హఠాత్తుగా అతని పక్కనే నిలబడి వాటిని చూస్తున్న ఓ యువతి చేతిలోని పర్సుని దొరకబుచ్చుకుని ఒక్క అంగలో చెట్టెక్కి ఓ చిటారు కొమ్మన సెటిలయిపోయింది ఓ అల్లరి కోతి. అకస్మాత్తుగా జరిగిన ఈ సంఘటనకి ఆ యువతి బెదిరిపోయింది. అక్కడి మిగతా సందర్శకులలో పిల్లలు ఈ సంఘటనకి నవ్వుకుంటూ చప్పట్లు కొట్టసాగారు. ఇదంతా తెల్లబోయి చూస్తున్న రమాకాంత్‌కి టక్కున ఓ ఆలోచన ఫ్లాష్‌లా వెలిగింది. వెంటనే తన చేతిలోని పల్లీ పాకెట్టును కోతికేసి విసిరినట్టు చెయ్యి ఊపాడు. కోతి ఛెంగున కిందకి దూకి రమాకాంత్ దగ్గర కొచ్చి పర్స్ అక్కడ వదిలేసి పల్లీ పాకెట్టు లాక్కుని పారిపోయింది. వెంటనే ఆ పర్స్ ఆమెకిచ్చి అభినందనలు పొందాడు రమాకాంత్. తన పేరు వసుమతి అనీ, అక్కడే లోకల్ స్కూల్లో టీచర్ననీ చెప్పిందామె. మొదటి పరిచయమే ప్రేమగా మారి పెళ్ళి చేసుకుందామనుకునేంతవరకూ వచ్చింది వారి వ్యవహారం. ఆ మూడురోజులూ ఆమెతో సరదాగా గడిపాక ఒకరి ఎడ్రస్ ఒకరు తీసుకుని, రమాకాంత్ పూనా వచ్చాడు. ప్రస్తుతం అవే ఆలోచన





లతో మైమరుస్తున్న రమాకాంత్‌కి కాలింగ్‌బెల్ చప్పుడు వినపడటంతో తలుపు తీశాడు. ఎదురుగుండా ఓ పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్ నిలబడి వున్నాడు. రమాకాంత్ ఏదో అడగబోయేలోపే, "మీరు మాతో అర్జంటుగా స్టేషన్‌కి రావాలి" అంటూ తీసుకెళ్లాడతను.

★ ★ ★

అంతకుముందు రోజు ఉదయం పూనా రైల్వేస్టేషన్‌నుంచి సబ్‌ఇన్‌స్పెక్టర్ యశ్వంత్‌కి ఫోనొచ్చింది అర్జంటుగా రైల్వేస్టేషన్‌కి రమ్మని. ఆరోజు ఉదయం లోనావాలానుంచి పూనా చేరిన రైలులో ఒక పెద్ద పెట్టెని ప్రయాణీకులెవరూ తీసుకెళ్లకుండా కంపార్ట్‌మెంట్‌లోనే ఒదిలేశారు. ఇద్దరు కూలీలు ఆ పెట్టె సంగతి స్టేషన్ మాస్టారికి చెప్పగానే దాన్ని కిందకు దింపించాడు స్టేషన్‌మాస్టరు. తీరా చూస్తే పెట్టె అడుగునంతా రక్తం నిండివుంది. అందరూ భయంతో గడగడలాడి, వెంటనే పోలీసులకి తెలియజేశారు. స్టేషన్‌కి వచ్చిన యశ్వంత్ పెట్టె మూత తీయించి చూశాడు. అది ఓ యువతి శవం. ఆ శవంమీద లోనావాలాలోని

ఒక లోకల్ పేపరు కాగితాలు కప్పబడి వున్నాయి. ఆ పేపర్ అంతకుముందు రోజుదే. వెంటనే లోనావాలా బయలుదేరాడు యశ్వంత్. శవానికి తీసిన ఫొటోలద్వారా ఎంక్వయిరీ చెయ్యగా ఆ యువతి ఆ ఊరుకి చెందినదే అనీ, పేరు వసుమతి అనీ, స్కూలు టీచరుగా పనిచేస్తోందనీ తెలిసింది. ఆమె ఎడ్రసు పట్టుకుని ఇంటికి చేరి, గది తాళం పగలగొట్టి లోపలికి ప్రవేశించాడు యశ్వంత్. గదంతా చిందరవందరగా వుంది. మచంమీద, నేలమీద అక్కడక్కడ రక్తపు మర కలు కనిపించాయి. అక్కడే టేబుల్‌మీద ఆమె డైరీ కనిపించింది. డైరీలో నాసిక్, బోంబే లకు సంబంధించిన కొన్ని అడ్రసులున్నాయి. చివరగా రమాకాంత్ ఎడ్రస్ వుంది. రమా కాంత్ పేరుకు ముందు 'డియర్' అని కూడా రాసి వుంది. వివరాలన్నీ సేకరించి లోనావాలా పోలీస్‌స్టేషన్‌కి చేరి అక్కడి ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడుతున్నాడు యశ్వంత్. అంతలో ఓ నడివయసు వ్యక్తి పోలీసుస్టేషనుకి వచ్చాడు.

"సర్! నిన్న జరిగిన యువతి హత్య గురించి నాకు కొంత సమాచారం తెలుసు" అన్నాడు.

"ఎవరు నువ్వు? నీ పేరేమిటి?" అడిగాడు యశ్వంత్.

"విజయన్ సర్! నేను ఆటో నడుపుకుంటాను" అన్నాడు వినయంగా.

"చనిపోయిన యువతి నీకు తెలుసా?"

"తెలియదు సార్"

"మరి వివరాలెలా చెప్పగలవు?"

"నిన్న ఉదయం రైల్వేస్టేషన్ బయట ఓ వ్యక్తి నావద్దకు వచ్చి ఆటో కడతావా అని అడిగాడు సర్. సరే అన్నాను. తనక్కడే వుంటానని నా చేతిలో పాతిక రూపాయలు పెట్టి, ఓ ఇంటి అడ్రసిచ్చి, ఆ ఇంటి బయట ఓ పెట్టె వురటుందని, అదిక్కడికి తెమ్మనీ చెప్పాడు. నేను ఒప్పుకుని తీరా పెట్టె తెచ్చేసరికి అతను అక్కడలేడు. చాలాసేపు చూసి ఒక కూలీని పిలిచి పెట్టె ప్లాట్‌ఫాంమీదకిచేర్చమని, దాని యజమాని వచ్చి తీసుకుంటాడని చెప్పి వెళ్ళిపోయానుసార్" అంటూ వివరించాడు.

వెంటనే యశ్వంత్ విజయన్‌ని పూనా తీసుకొచ్చి రమాకాంత్ ఎడ్రసు ప్రకారం అతని ఇంటివద్దకు తీసుకెళ్ళి దూరంగా రోడ్డుమీద నిలబడమన్నాడు. రమాకాంత్ ఆఫీసుకెడుతుండగా అతనిని చూసిన విజయన్ అతడే పెట్టె తెచ్చిన వ్యక్తి అని సబ్‌ఇన్‌స్పెక్టర్‌కు చెప్పాడు. వెంటనే రమాకాంత్‌ని అరెస్టుచేయడం జరిగింది. కానీ మర్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రధాన్, సబ్‌ఇన్‌స్పెక్టర్ యశ్వంత్‌ని కొన్ని ప్రశ్నలేశాడు.

"యశ్వంత్! విజయన్ వయసెంతుంటుంది?"

"35, 36 దాకా వుండొచ్చునర్"

"జుట్టుకి రంగు వేస్తాడా? బట్టతలా? ఒత్తుగా వుంటుందా?"

"బట్టతలే సార్. అక్కడక్కడ పలచగా వున్న జుట్టుకి రంగేశాడు సార్"

"వెంటనే అతన్ని అరెస్ట్ చెయ్యి. రమాకాంత్ నిర్దోషి. శవాన్ని పోస్ట్‌మార్టమ్ చేయించినపుడు బయటపడిన వివరాల్లో 3 రంగేసిన వెంట్రుకలు ఆమె చీరమీద కనిపించాయి. వాటిని పరీక్షిస్తే అవి 35, 40 సంవత్సరాల మధ్య వయస్కులది అని వచ్చింది. అంతేకాదు ఇంకా మరికొన్ని వివరాలు కూడా లోనావాలా పోలీసులు అందించారు. వసుమతికి వున్న చాలామంది ప్రియుల్లో విజయన్ ఒకడు. అయితే రమాకాంత్‌తో ఏర్పడిన కొత్త స్నేహాన్ని సహించలేక ఆమెను హతమార్చి కేసు రమాకాంత్‌మీద తొయ్యడానికి ప్రయత్నించాడు" అంటూ ముగించాడు ఇన్‌స్పెక్టర్ ప్రధాన్.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

